# ధమ్మపదము



అనువాదకులు

శ్రీ రాజా వాసిరెడ్డి

దుర్గా సదాశివేశ్వర ప్రసాద బహద్దరు గారు


ఆంధ్రపత్రికా కార్యాలయము

చెన్నపురి

౧౯౨౭] [రూ. ౧-౪-౦

| | పు |
|---|---|
| పియవగ్గో సోళసమో ... ... | ౯ |
| కోధవగ్గో సత్తరసమో ... ... | ౯ |
| మలవగ్గో అట్ఠారసమో ... ... | ౧౦ |
| ధమ్మట్ఠవగ్గో ఏకూనవీసతిమో ... ... | ౧౧ |
| మగ్గవగ్గో వీసతిమో ... ... | ౧.౯ |
| పకిణ్ణకవగ్గో ఏకవీసతిమో ... ... | ౧౨ |
| నిరయవగ్గో బావీసతిమో ... ... | ౧౩ |
| నాగవగ్గో తేవీసతిమో ... ... | ౧౩౯ |
| తణ్హావగ్గో చతువీసతిమో ... ... | ౧౪౬ |
| భిక్ఖువగ్గో పఞ్చవీసతిమో ... ... | ౧౫ |
| బ్రాహ్మణవగ్గో ఛబ్బీసతిమో ... ... | ౧౬ |

# విషయసూచిక

[ఆంధ్రముఖము]


| | | | పుట |
|---|---|---|---|
| పీఠిక. | ... | ... | ౧-౪౬ |
| ౧. యమకవర్గము | ... | ... | ౪ |
| ౨. అప్రమాదవర్గము | ... | ... | ౧౦ |
| ౩. చిత్తవర్గము | ... | ... | ౧౫ |
| ౪. పుష్పవర్గము | ... | ... | ౨౨ |
| ౫. బాలవర్గము | ... | ... | ౨౮ |
| ౬. పండితవర్గము | ... | ... | ౩౫ |
| ౭. అర్హత్తవర్గము | ... | ... | ౪౨ |
| ౮. సహస్రవర్గము | ... | ... | ౪౭ |
| ౯. పాపవర్గము | ... | ... | ౫౪ |
| ౧౦. దండవర్గము | ... | ... | ౬౧ |
| ౧౧. జరావర్గము | ... | ... | ౬౬ |
| ౧౨. ఆత్మవర్గము | ... | ... | ౭౧ |
| ౧౩. లోకవర్గము | ... | ... | ౭౭ |
| ౧౪. బుద్ధవర్గము | ... | ... | ౮౩ |

| | | పుట |
|---|---|---|
| ౧౫. సుఖవర్గము | ... ... | ౮౯ |
| ౧౬. ప్రియవర్గము | ... ... | ౯౪ |
| ౧౭. క్రోధవర్గము | ... ... | ౯౯ |
| ౧౮. మలవర్గము | ... ... | ౧౦౬ |
| ౧౯. ధర్మస్థవర్గము | ... ... | ౧౧౪ |
| ౨౦. మార్గవర్గము | ... ... | ౧౨౨ |
| ౨౧. ప్రకీర్ణకవర్గము | ... ... | ౧౨౯ |
| ౨౨. నిరయవర్గము | ... ... | ౧౩౫ |
| ౨౩. నాగవర్గము | ... ... | ౧౪౨ |
| ౨౪. తృష్ణావర్గము | ... ... | ౧౫౧ |
| ౨౫. భిక్షువర్గము | ... ... | ౧౬౨ |
| ౨౬. బ్రాహ్మణవర్గము | ... ... | ౧౭౪ |
| అనుబంధము | | |

# పీఠిక

సృష్టిలో నేవస్తువున కేని కాల మొక్కరీతిగాఁ గడచుట యసాధారణము. అవనతి కొన్నాళ్లు, ఉన్నతికొన్నాళ్లు గలుగుచుండును; తారుమారగుచుండును.

క్రీ. పూ. 6 వ శతాబ్దియందు భారత దేశములో మతవిషయమున నిట్టిస్థితి కలిగినది. అనఁగా ఇప్పటికిఁ గొంచె మించుమించుగా 2,600 యేండ్లకుఁ బూర్వమన్నమాట. పరమసాధువులై, నిష్కామ్యబుద్ధితో దేశక్షేమముకొఱకు, శాంతిక పౌష్టికాది క్రియలు చేయుచు రాజులకు సదా ప్రజాహితముకొఱకయి ధర్మములఁ గఱపుచు ఆధ్యాత్మికచింతనముతోఁ గాలముఁ బుచ్చవలసిన బ్రాహ్మణసంఘము, రాజుల కాగ్రహమువచ్చునని జంకి వారి తుందుడుకుల నడ్డగింపరైరి. కేవలము హింసాత్మకములైన కామ్యకర్మములకుఁ బాల్పడిరి. *హీనజాతుల వారిని నీచముగాఁ జూచుచుండిరి. మానవసాధారణములైన వారిస్వత్వములను హరించి వారిని క్రూరముగా శిక్షించుచుండిరి.

* బౌద్ధజాతకకథలలో ఇట్లున్నది.

కముతో మనుజులు తమకుఁ బా మవి యున్నవని బాధక ములు గల్పించుకొనుచున్నారు.

అజిత కేశకంబళ మతము:—ఇది చాలవఱకుఁ బాంచ భౌతికవాదముఁ బోలియుండును. ఇందుఁ బ్రకృతిపదార్థ ము లైదున్నవందురు. అజిత కేశి అవినాల్గుపదార్థములే యనును. మఱియు నితఁడు ప్రపంచములో అన్ని మతముల సిద్ధాంతములఁగూడ సత్యదూరములుగానున్నవనును. అవి కేవలముయుక్తిప్రతియుక్తులతోఁ దర్కించిచేసిన సిద్ధాంత ములే. ప్రత్యక్షానుభవముతో నిర్మించినవి గావు. అను భవదూరమైనది సత్య మెట్లగును? అనును.

ఇవిగాక వామభాగ, అఘోరాదులైన మతము లెన్నియో యున్నవి. వానిలో జీవికి నరకానుభవము తప్పనిది. చెవులలో ముక్కులలో సీలలు గ్రుచ్చుకొనుట, దేహము రక్కుకొనుట మొదలగుపనుల కలవాటుపడి నరకబాధల సహింపఁగలనేర్పు సంపాదింపవలెను. వాని కొఱకు హఠయోగాదు లభ్యసింపవలె నని కొన్నియు, శవము మృతాత్మ; దానికి దహనఖననాది సంస్కార ములు చేయరాదు. మఱొక సజీవాత్మ తినవలెను. జీవికి అణిమాదిసిద్ధులే పరమార్థము అని కొన్నియు, ననును.

---

తాంగములోఁ జెప్పఁబడిన దేహాత్మవాద పాంచభౌతిక వాదములకును గొంతవఱకుఁ బోలికయున్నది.

ఇంతకంటె వానినిఁగూర్చి యింకఁ దెలిసికొనుటకు మన
కాధారములు లేకున్నవి. మొత్తముమీఁద నివన్నియు
హింసాత్మకములైనవే.

ఈ గజిబిజిపాటులోనుండి బయటకుఁ బడుటకుఁ
త్రోవ కానరాకుండెను. కొందఱుధీమంతులు బయలుదేరి
రాజకీయసంస్కరణములు గావించిరి. కొన్ని దేశముల
వారు ప్రజాస్వామ్యపురాజ్యముల స్థాపించుకొనిరి. ప్రజ
లకు విశ్వాసపాత్రుఁడైన నాయకుఁడే దానికిఁ బాలకుఁడుగా
నుండవలెనని నియమమును చేసికొనిరి. వాని యధికారముఁ
గూడ మితపఱిచిరి. *కపిలవస్తు,సుంసుమారము,అలకప్ప,
వైశాలి మొదలగురాజ్యము,లిట్టివి. నగరము, రథ్య,విద్య,
వాణిజ్యము,తటాకములు,కాలువలు, మొదలగువ్యవస్థలు
పాలించుట కొక్కొక్కదాని కొక్కొక్కప్రత్యేక సమితులు
గల్పింపఁబడినవి.ఇట్టిసంస్కరణములవలనరాజకీయదురవస్థ
కొంతవఱకుఁ దొలఁగిపోయినది. కాని శాంతి సుస్థిర
ముగాఁ గుదురుకొనలేదు. బాహ్యసంస్కరణములు దానిని
భద్రపఱుపఁ జాలవుకదా! ఆధ్యాత్మికపరిణామ మవస
రము. "యదా యదాహి ధర్మస్య గ్లాని ర్భవతి భారత,
అభ్యుత్థాన మధర్మస్యతదాఽఽత్మానం సృజామ్యహమ్"
అను శ్రీకృష్ణభగవానుని అభయప్రదానమున కిది పరీ

---

* చంద్రరాజ భండారీగారి మహావీరచరిత్రము.

ముగాఁ బెంపొంది దృఢపడుటకు రెండేండ్లు పట్టినది. ముప్ప
దవ యేఁట నతఁడు సర్వసంగపరిత్యాగముచేసి దిగంబరుఁ
డై పరమసత్యము గనుఁగొనుటకు దీక్షఁ బూనినాఁడు.
పిదపఁ గైవల్యప్రాప్తియగునఱకు అనఁగా ౧౨,౧-౨ ఏండ్లు
మౌనవ్రతుండై యుండెను.

వర్ధమానుఁ డిట్లతిధైర్యసాహసములతో నింద్రి
యముల నిగ్రహించుట చూచి జన మితనిని మహావీరుఁ
డని పేర్కొనుచుండిరట. నాఁటినుండియు వర్ధమానుఁడు
మహావీరుఁ డైనాఁడు. మౌనవ్రతుఁడై యొకచోటఁ గూ
ర్చుండక జ్ఞానపిపాసువై దేశదేశములు భ్రమ్మరినాఁడు.
ఒకనాఁడీతఁడు కుమారగ్రామసమీపారణ్యములోఁ దపము
చేసికొనుచుండెను. గొల్లఁడొకఁ డాదారిని రెండెడ్లను
తోలుకొని వేవేగఁ బోవుచు మహావీరునియొద్ద నాయెద్దు
లను విడచిపోయెను. అతఁడు మరల వచ్చుసరికి ఆయెద్దు
లక్కడ లేకపోయెను. వాఁడు వెదుకగా ఆసమీపమున
నొకచోట నున్నవి. మహావీరుఁడే వానిని దాఁచినాఁడను
కొని గొల్లఁడు మహావీరునిబట్టి చెవులలో సీలఁగొట్టె
నాఁడు.

ఇంద్రుఁ డది తెలిసికొని "ప్రభూ! మీయాజ్ఞయై
నచో మీకుం దిట్టివిపత్తులు గలుగనీక కాచుచుందు ననెనట.
భగవానుఁడు "తీర్థంకరుఁ డెట్టిసమయములోఁగూడఁ బరు

లసహాయ మపేక్షింపఁ”డని ప్రత్యుత్తర మిచ్చెనట. కైవల్య ప్రాప్తియగులోపల నిట్టియుపసర్గము లనేకములు మహావీరుఁ జేరొన్నవి. వ్రతభంగము చేయుటకు వైరులు ప్రలోభ ములు గూడఁ గల్పించినారు. కాని యతఁడు వేనికిని జలిం పలేదు. జంబుకగ్రామములో ఋజూబాలికానది యొడ్డు ననున్న శ్యామాకునిచేనిలోని గుప్తచైత్యములో శాలి వృక్షముక్రిందఁ గూర్చుండి తపముచేయుచుండగా నీతనికిఁ గైవల్యము(జ్ఞానము) గోచరించెను. అపుడు ఘాతీయకర్మ చతుష్టయము (జ్ఞానావరణీయము, దర్శనావరణీయము, మోహనీయము, అంతరాయము) నశించి పోయెను.

ప్రపంచమం దన్నిప్రాణులును సమానులని దాని ముఖ్యాశత్త్వము. జైను లిప్పుడుగూడఁ గైవల్యప్రాప్త్యుత్స నము చేయుదురు. అం దీభావము ప్రకట మగు చుండును.

ఇట్లు తాను జ్ఞానియైనపిదప దానిని లోకములో వ్యాపింపఁ జేయుట కపాయనగరము వెలుపల‡ సమ వశరణసభ గావించెను. ఆసభకు మానవులేకాక పశు పక్ష్యాదులైన ప్రాణిసంఘమంతయు వచ్చెనట! అం దొక

‡ జైనులు ధర్మోపదేశము చేయుటకుఁ జేసెడిసభ; బౌద్ధులపరి షత్సభవంటిది.

బంగారు తామరపూవులోఁ గూర్చుండి మహావీరుఁ డిట్లు పన్యసించెనట. "లోకములో బ్రాణులు అశాంతిచే, అజ్ఞానముచే దుఃఖభాజనులై నశించుచున్నారు. నాయుపదేశములు విని మేలుపొందుఁడు. అజ్ఞానచక్ర మతిక్రమింపుఁడు. మ్లేచ్ఛులు, బ్రాహ్మణులు, శూద్రులు, స్త్రీలు అను భేదము లేదు. సత్యపిపాసువు లందఱును సమముగా ఉదారమైన నాధర్మపతాకనీడను జేరుట కర్హులే. సంసారము సముద్రమట్లు భయంకరమైనది. వృక్షమునకు బీజము కారణమైనట్లు అన్నిటికిని గర్మమే కారణము. అసత్కర్మములు వలన నధోగతి పొందుదురు. అశుభములైన బంధన కర్మములకు హింసయే కారణము. ప్రతిజీవుఁడుకూడ మీవంటివాఁడే యనుకొనుఁడు. కామవివశులై కన్నుగానక చరింపవలదు. దానివలననే హింసాకృత్యము గలుగుచున్నది. ఇవి సూక్ష్మస్థూలము లని రెండు విధములుగా నున్నవి. సూక్ష్మము లాచరించుట కందఱు సమర్థులుకారు. స్థూలము లందఱు ఆచరింపవలెను." అని దానిసారము.

ఆయుపన్యాసమువిని వేలకొలఁదిజనులు మహావీరుని శిష్యులైరి. ఆసమయముననే అక్కడ నొకయజ్ఞము జరుగుచుండెను. దానికి ఇంద్రభూతి, అగ్నిభూతి, వాయుభూతి మొదలగువారు పదునొకండుగురు బ్రాహ్మణులు ఋత్విజులు వచ్చిరి. వారుకూడ నాయుపన్యాసము విని మహా

వీరునితో వాదించి యోటువడి శిష్యగణములోఁ జేరిరి. మహావీరుఁ డిట్లు తన ధర్మములు దేశములోఁ బ్రబోధముచేసి శిష్యసంఘముఁ గూర్చెను.

తన యుపదేశము లందఱకు సులభముగాఁ దెలియుటకు నప్పు డాతఁడు దేశభాషగానున్న మాగధిభాషతో నుపన్యసించెను; గ్రంథములనుగూడ నా భాషతోనే వ్రాయించెను. జైనులలో సన్న్యాసులే కాక గృహస్థులు గూడ నున్నారు. జైనగృహస్థులైన పురుషులకు శ్రావకు లనియు, స్త్రీలకు శ్రావికలనియుఁ బేర్లు. గృహస్థులకొఱకు మహావీరుఁడు ప్రత్యేకముగాఁ బండ్రెండు ధర్మములు నియమించినాఁడు * 1. స్థూలహింస, 2. స్థూలానృతము, 3. స్థూలాదత్తాదానము, 4. స్థూలమైథునము, 5. పరిగ్రహ పరిమాణము, 6. దిగ్వ్రతము, 7. భోగోపభోగ పరిమాణము, 8. అనర్థదండము, 9. సమాయిక, 10. దేశావకాశిక, 11. పోషధ, 12. అతిథిసంవిభాగాఖ్య

---

* 1. అహింసాస్వరూపము తొలుత రెండు విధములుగాను, తిరిగి మొదటి మూఁడిటి నొక్కొకదానిని స్థూలమని సూక్ష్మమని రెండువిధములుగాను విభజించినారు జైనులు. స్వప్రయోజనముకొఱకుఁ బరపీడనము గానిది.

2. పరులకు హానికరమైనది.

3. "పతితం విస్మృతం, నష్టం స్థితం స్థాపిత మాహితమ్; అదత్తం నాదదీత స్వం పరస్వం నక్వచి త్సుధీః" అని స్థూలాదత్తాదాన స్వరూపము జైనశాస్త్రకారులు నిర్ణయించినారు.

ములు, ముఖ్యముగా అనుసరింపవలసిన ధర్మములు. ఇవి సన్న్యాసధర్మము లాచరించుటకుఁ గ్రమాభ్యాసము గూర్చునట్లున్నవి. చీకటిపడ్డపిదప భోజనము చేయరాదు.

ఈశిష్యులలో 11 గణధరులు, 9వృద్ధులు, 42000 శ్రవణముఖ్యులు, 1500 శ్రవణులు, శ్రావికులు 3,18,000 ఉండిరి. మహావీరుఁడు స్త్రీపురుష భేదముగాని, హీనజాతి ఉత్తమజాతిభేదముగాని చూపక అందఱను సమముగా

4. పరస్త్రీగమనము.

5. ఆశకు పరిమితి గల్పించుకొనుట. ఆనియమమునకు మించి లాభించినయర్థమును ధర్మకార్యములకు వెచ్చించుట.

6. ఇమ్మటకుఁబోవుటకు దిక్కులు నియమ మేర్పఱచుకొనుట.

7. అన్నపానములు వస్త్రభూషాదులునైన భోగ్యవస్తువులను మితపఱచుట.

8. ఏవిధముగాఁగూడఁ బరుల కనవసరముగా హానికల్పింపకుండుట.

9. రాగద్వేషము విడిచి శాంతుఁడై రెండుగడియలకాల మాత్మధ్యానవిచారము చేయుచుఁ గూర్చుండుట.

10. సామాయిక వ్రతముల నియమములు ఏదో కాలనియతి యేర్పాటుచేసికొని అందును కాచరించుట.

11. ఉపవాసాది వ్రతనిష్ఠుడై ౪ లేక ౮ దినములు సాధువృత్తితో ధర్మకార్యములు చేయుచుండుట. ఈవ్రతకాలములలోఁ దైలమర్దనము, పాపచింతనముఁగూడదు. బ్రహ్మచర్య మనుష్ఠింపవలెను.

12. అతిథులనఁగా జైనభిక్షువులు. వారికి అన్నవస్త్రాదు లిచ్చి వారివ్రతము నిరభ్యంతరముగా సాగింపఁజేయుట.

నాదరించెను. అధమజాతివాఁడుఁ గూడఁ బండితుఁడై యాచార్యపీఠ మారోహించుటకు దారిఁ జూపెను. మహావీరుని యనుచరులలో ముఖ్యులైనవారిలో ఆర్యకాళ యను స్త్రీ గూడఁ గలదు.

స్యాద్వాదము:— అజ్ఞేయవాదముఁ బడఁగొట్టుటకు మహావీరుఁడు స్యాద్వాదముఁ గల్పించినాఁడు. జైన తత్త్వశాస్త్రములోని ప్రధాననియమ మిందే యున్నది. స్యాద్వాద మనఁగా ఒకవస్తువును భిన్నభిన్న దృష్టులతో విచారించి భిన్నభిన్నధర్మములఁ గనిపెట్టుట. ఒకఁడే పురుషుఁ డొకనికిఁ దండ్రి, యొకనికిఁ గొడుకు, వేఱొకనికి మామ యగుచున్నాఁడు. ఒకటే ఘటము సత్తును, అసత్తును అగుచున్నది. అనఁగా ఆఘటమందలి మృత్పదార్థము నశింపదుగాన సత్తును, దాని యాకృతి నశించునది గాన అసత్తును అగును.

ప్రతివస్తువులోఁగూడ సదసద్ధర్మములిమిడియున్నవి గాన కేవలసత్తుగాని కేవలాసత్తుగాని కాదు. వస్తువునందలి మూలపదార్థము నశించునది గాదు. ప్రతివస్తువులో సామాన్య విశేషధర్మము లిమిడియున్నవి. సామాన్యధర్మమంతయు సత్తు, విశేషధర్మ మంతయు అసత్తు అని యావాదము నిరూపించుచున్నది. శ్రీజగద్గురు శంక

రవాదులు "ఒకవస్తువులో ఒకేసమయమందు శీతోష్ణధర్మ ములు రెండు నుండుట యసంభవముగదా ! అట్లే సద సద్ధర్మములుగూడ నుండఁజాలవు" అని యీవాదమును ప్రోసిపుచ్చినారఁట. "శ్రీ శంకరులు ఈవిషయమున లోతు గా నాలోచింపలేదు. సదసత్త్వలు ఉష్ణశీతములట్లు విరు ద్ధధర్మములు కావి గావు. అపేక్షాకృతులు స్వరూప పర రూప దృష్టులతో విచారించిన ఇందలి తత్త్వము బోధ పడు" నని జైను లందురు. "శీతోష్ణములు విరుద్ధ ధర్మ ములు కాకైనను ఏకకాలమందే ఏకవస్తువు నాశ్రయిం చుటకు వీలున్నది. ఒకవస్తువునందు 50° (డిగ్రీలు) ఉష్ణ మున్నచో మఱికొన్ని (డిగ్రీలు) శీతమున్న దన్నమాటే కదా! ఏపదార్థముగూడ సంపూర్ణముగా లేకపోవుట యసంభవము; గణితసిద్ధాంత ప్రకారము (మేథమెటి కల్‌గా) సంపూర్ణమైన శీతముగాని సంపూర్ణమైన ఉష్ణముగాని యుండదు. ఏదేని ప్రదేశములో వాయు వును సంపూర్ణముగాఁ దొలఁగించుట సాధ్యమా? అట్లే సంపూర్ణఉష్ణము సంపూర్ణశీతములు గూడ కల్పించుట యసాధ్యము. కావున శంకరులవాదముకంటె మహావీరుని వాదమే సమంజసముగా నున్న" దని ఆధునికపాశ్చాత్య ప్రకృతిశాస్త్రజ్ఞు లనుచున్నారు.

జైనమత ముఖ్యసిద్ధాంతములు :—భగవానుడు కేవలము సుగుణరాశిమాత్రమే. అతడు సర్వాంతర్వ్యాపి, సర్వశక్తుడుగావాడనుట అసంబద్ధము. సృష్టి, జీవులు అకల్పితములు, అనాదులు, అవినాశులు. మనుజుని కర్మమే వాని సద్గతికి దుర్గతికి కారణము. నరలోక స్వర్గ లోకములు, పాపపుణ్యములు కలవు. అగ్రమింద్ర లోకము సర్వోన్నతమైనది. భగవానుడందుండును. జీవుడు అనాది, అనంతము, అవినాశి, సచ్చిదానందస్వరూపము గలవాడు. జీవుడు కర్మబంధములో బడి తికమక లాడుచుండును. అది విడిపించుకొనుటయే ముక్తి. మనుజుడు మూడు పరిణామములు పొందిగాని ముక్తిని బడయలేడు. దుష్కార్యాచరణమునుండి, సత్కార్యాచరణము, దానినుండి పరిశుద్ధకార్యాచరణము ఈ పరిణామములు. మొదటి దానివలన పాపబంధము, రెండవదానివలన పుణ్యబంధము, మూడవ దానివలన సర్వబంధ విముక్తి, సచ్చిదానందము గల్గును. ఇదియే మోక్షము; ప్రతిజీవియు బొందదగిన పరమార్థము. సృష్టియందలి జీవులన్నియు సమానములే. వానియున్నతి నైచ్యములు వాని గుణశీలములచేతనే కల్గును. జాతి వానికి కారణము కాదు.

మహావీరుఁడు దేశదేశములలో సంచారము చేయుచుఁ బలువురు రాజులకు, భోగులకు, యోగులకు, బ్రాహ్మణులకు, స్త్రీలకుఁ బతితజాతులకుఁగూడ, జైన దీక్ష నిచ్చుచు లోకములోఁ బ్రాఁతగిల్లిన యాసిద్ధాంతములు పునరుద్ధరించుట కనుక్షణము ప్రయత్నించుచుండెను. కాని చిరకాల మిట్లు జరిగినది కాదు. శిష్యులలో మతభేదములు కల్గినవి. బ్రాహ్మణద్వేషము ప్రబలినది. *వారియూహల కనుకూలముగఁ గథ లల్లి మతగ్రంథములలోని కెక్కించిరి. అసభ్యములైన కథ లంటఁగట్టిరి. దిగంబరత్వము మొదలగు కఠిననియమములు ప్రజలకు రుచింపకుండెను. క్రమముగా జైనమతము సన్నగిల్లి సాగెను. క్రమక్రమముగా క్షీణించి క్షీణించి మహావీర నిర్వాణమునాఁటికి 11,100 మంది జైనులుమాత్ర ముండిరి. తొల్లిటియట్లు దిక్కుదిక్కులకుఁ బోయి వానిని వారించుటకు మహావీరుఁడు శక్తుఁడు గాకుండెను. ప్రాయంపుఁ బ్రొద్దు పడమటదిరిగినదికదా! ఓపిక లుడిగినవి. వారిమీఁద సమయమున నేమిచేయఁగలఁడు? ఏవ్యక్తియందును మాహాత్మ్యము సుస్థిరముగా నుండదుగదా!

* కల్పసూత్రములో మహావీరుఁడు తొలుత బ్రాహ్మణీగర్భమున నుండెననియు, బ్రాహ్మణజన్మము పవిత్రముకాదని గ్రహించి క్షత్రియాణీగర్భములో బ్రవేశించినాఁడనియుఁ గథ గలదు.

గోశాలిఆజీవిక మతస్థాపనము :—ఈస మయము నసే అతని ప్రథమశిష్యుఁడైన గోశాలి జైనమతమునుండి విడిపోయి 'ఆజీవిక'మను నూతనమతము స్థాపించినాఁడు. జైనగ్రంథములలో నితఁడు మూర్ఖుఁడు,పిచ్చివాఁడునుగాఁ చిత్రింపఁబడినాఁడు. ఇది కేవలము వానియందలి యసూయా వలనఁ జేసిన యకార్యము. జైనబౌద్ధములట్లే ఆనాఁ డీమత ముగూడ దేశములో విరివిగా వ్యాపించెనని తెలియవచ్చు చున్నది. అతఁడు నిజముగా పిచ్చివాఁడైన-చో ఆతని నింద అనుకరించి యుందురా? అదిగాక బౌద్ధగ్రంథము లితనిఁ బిచ్చివానిగా వర్ణించుట లేదు.ఏ హేతువుచేతనో యీమత మిప్పుడు దేశములో నంతరించినది. ఈమతముయొక్క తత్త్వ మెఱుఁగుటకు ఈమతగ్రంథములుకూడ నశించుట వల్ల వీలుగాకున్నది. అయినను యీమతముగూడ బౌద్ధ జైనములట్లే అహింస నుద్బోధించుచున్నట్లు తెలియనగు చున్నది. వాఁడు ముందేమికావలెనో వానికర్మమే నిర్ణ యించును. కర్మ నిర్జరముగాన మనుజుఁ డాత్మవిచారము చేయవలెను. అని వీని సిద్ధాంతములు.

మనోరంజన ఘోషుగా రీమతమునుగూర్చి యిట్లు చెప్పినారు:—

"The history of the Ajivkas reveals the curious fact that sacredness of animal life was not the peculiar tenet of Buddhism alone but the religion of Sakyamuni shared it with the Ajivkas and the

Nigrants. They had some tenets in common, but differed in details..................They were naked monks practising severe penances. We find the Ajivkas an influential sect in existence even in the life time of Buddha. Mokkali Gosala was the teacher of the Ajivkas with whom Gautam Buddha had a religious controversy."

" Ancient civilization " అను గ్రంథములో ఇట్లున్నది:

"Among the other sects of ascetics which flourished side by side with the Buddhists and Nirgranthas (jains) in the sixth century B. C., the Ajivkas founded by Gosala were the best known in their day. Asoka names them in his inscriptions, along with Brahmins and Nirgranthas. Gosala was therefore a rival of Buddha and Mahavira, but his sect has now ceased to exist."

## గౌతమబుద్ధుడు

జగద్రక్షాపరాయణుఁడు, సృష్టికర్త యింతటితో సమాప్తి నొందలేదు. ప్రపంచమునం దంతటను అహింసాప్రచారముఁ జేయింప సంకల్పించినాఁడు. ఆతఁడే గౌతమబుద్ధుఁడు; కరుణాస్వరూపుఁడు. మాయాదేవి గర్భవతిగా నుండి పుట్టినింటికి వెళ్లుచుండఁగా లుంబినీవనము లోనికి వెళ్లినది కామెకుఁ బ్రసవవేదనము కలిగెను * బుద్ధుఁ డావనమునఁ బుట్టినాఁడు. ఈ

* ఇది కపిలవస్తువులోనిది. బౌద్ధమతము వ్యాప్తినొందిన పిదప ఇక్కడ స్మారకచిహ్నముగా నొకస్తూపము గట్టిరి.

కపిలవస్తువు శాక్యరాజ్యమునకు రాజధాని ఇదిగూడ స్వాతంత్ర్యము సంపాదించుకొన్న దేశము. బుద్ధునితండ్రి, శుద్ధోదనుఁడు, శాక్యులకు నాయకుఁడు. వీనికి మాయాదేవి గౌతమియనువా రిద్దరు భార్యలు. బుద్ధునిగన్నది మాయాదేవి. బుద్ధుఁడు పుట్టినకొలఁదిదినములకే మాయాదేవి పరమపదించెను. గౌతమి పుత్రప్రేమతో బుద్ధునిఁ బెంచినతల్లి. బుద్ధునికిఁ బెట్టినపేరు సిద్ధార్థుఁడు.

సిద్ధార్థుఁడు తనకుఁ గ్రమాగతములైన వేదాధ్యయనము, రణవిద్య, అశ్వగజాదుల శిక్షణము చక్కఁగా నేర్చినాఁడు. పదుగుర ప్రశంసలకుఁ బాత్రుఁడైనాఁడు. సహజముగాఁ జురుకైన బుద్ధిగలవాఁడు. పసితనమునుండియు, మృదులమైన స్వభావముగలవాఁడు. అతని సౌజన్యము పరీక్షించుటకేమో యొకనాఁ డొకసంవిధానము జరిగినది. సిద్ధార్థుఁడు తోడివారితోఁ గూడఁ దోఁటకు విహరింపఁ బోయినాఁడు. వారిలో దేవదత్తుఁ డను నొక రాజహంసమును గొట్టినాఁడు. అది బాణము ప్రేటునకుఁ దట్టుకొనలేక గిలగిలఁ గొట్టుకొనుచు నేలఁగూలినది. సిద్ధార్థుఁడు దాని దైన్యమును జూచి పరితపించి వెంటనే ఆయంచను చేతఁదీసికొన్నాఁడు. ఆబాణము నూడఁదీసినాఁడు. ఆయంచ మఱింత విలపించినది. కారణమేమని, ఆయమ్ము తాను గ్రుచ్చుకొని మరల లాగిచూచినాఁడు. గ్రుచ్చినపుడును

లాగున స్వప్నమునుగూడ వ్యథ హెచ్చినది. అపుడు దాని బాధ యొక్క యాథార్థ్యముఁ దెలిసికొన్నాఁడు. దేవదత్తునితో వివాదపడి న్యాయంచను ప్రాణరక్షణము చేసినాఁడు. వీనియందు వైరాగ్యము స్ఫురించుచుండెడిది. శుద్ధోదనుఁ డదిచూచి పెండ్లి చేసి వానికి దుఃఖకరములైన విషయములగపడకుండునట్లు, సర్వదా భోగములలో మునిఁగి తేలుచుండునట్లు సంఘటించెను.

ప్రపంచమంతయు సుఖస్వరూపమే యను నూహ వానికిఁ గల్పించి వైరాగ్యవిముఖునిఁ జేయవలెనని యా ప్రయత్నము. అయితే మహోన్నతాదర్శములుచూపి లోక కల్యాణము ప్రతిపాదింపవలసినవాఁ డీసంకుచితమార్గము నంబడి యడఁగిపోవునా? ఒకనాఁడు పట్టణముఁ జూచుటకు బయలుదేరి పోవుచుండెను. దారిలో ముదుసలి, రోగార్తుఁడు, శవము, మొదలగు వ్యసనములు చూచెను. తన సారథిని "ఇవి ప్రతివారికుండునా" అని అడిగి అవి తప్పనివని తెలిసికొన్నాఁడు. తన వైరాగ్య మొక్కమారుగా రేగినది. సౌఖ్యములపై బుద్ధి పారకున్నది. ఇంటికిఁ బోయినాఁడు. ఆరాత్రియే శుద్ధావాస దేవతలు "సత్యాన్వేషణకు" బయలుదేరుమని యుద్బోధించినారు. అంతట నా వెంటనే యామునోంలో బిడ్డను, భార్యను, రాజ్యమును విడిచి అరణ్యమున కేఁగినాఁడు. జుట్టును దీసివేసి కాషాయమును

కట్టి సన్న్యాసియై తనకు జ్ఞానోపదేశము చేయఁగల సమర్థుని వెదకుచు ఘోరవ్రత వాయుజలాశనులై పంచాగ్నిమధ్యమున నుండి తీవ్రతపము చేయు ఋషులను జూచుచు వారితో జ్ఞానచర్చలొనర్చి అవి సరియైన త్రోవలు గావని వారివాదములు ఖండించుచు మగధయొద్దనున్న పాండురగిరికిఁ బోయెను. అక్కడ ఆరాళరాముఁడను మునిని జన్మాదిదుఃఖనివారణోపాయముఁ జూపుమనఁగా అతఁడు యోగమార్గము చూపెను. బుద్ధుఁడది తీవ్రముగా నాచరించుచుండెను. అప్పుడు శుద్ధోదనుఁడు కుమారునిఁ దీసుకొని రమ్మని మంత్రులఁ బంపఁగా వారు వచ్చి రమ్మని ప్రతిమాలిరి. "ఐహిక సౌఖ్యము లన్నియు నాకు దుఃఖకరములుగా నున్నవి. సత్యముఁ గనుఁగొని కాని వెనుదిరుగ"నని వారిని బంపివేసెను. ఆ యోగాభ్యాసమువల్ల నేమియు ఫలింపలేదు. కాయశోషణము కలిగినది. అప్పుడు "కాయశోషణము వలనఁ గార్యము లేదు" అనుకొని సిద్ధార్థు *డాహారమును భుజించెను. అతనితోఁగూడ నున్న మును లైదుగురు అతఁడు వ్రతభంగము చేసినాఁడని వీని నసహ్యించుకొని వెడలిపోయిరి. ఇప్పటికి గౌతముఁడు సత్యపిపాసువై వెడలి 6 ఏండ్లైనది.

---

* ఆహారమువలన అంగము, అంగముచేత అభిజ్ఞత గలుగునని బౌద్ధుల మతము.

పిమ్మట గౌతముఁడు నైరంజనీనదీతీరమున నొకయశ్వత్థముక్రిందఁ గూర్చుండి నిరాహారముగ మూఁడు సత్యాన్వేషణము చేయుచుండెను. ఇట్లు ౪౯ నాళ్లయిన తరువాత ‡ ౫౦-వ నాఁటి ఉదయమున మారుఁడు మోహము, భ్రమ, కామములను తనపుత్రికలతో వచ్చి గౌతమునితోఁ బోరాడి జయింపలేకపోయెనట. క్రీస్తు సైతానుతోఁ బోరుటకును దీనికిని బోలికయున్నది. పిదప ఆనాఁటి రాత్రి గౌతమునకుఁ బూర్వజన్మజ్ఞానము గలిగి(జ్ఞానము) సత్యచతుష్టయము గోచరించెను. అవి దుఃఖము, దుఃఖోత్పత్తి, దుఃఖనివారణము, దుఃఖనివారణమార్గము. అంతట మహాబ్రహ్మము ప్రత్యక్షమై "చింతచేఁ బురుషునిపై దయయుంచుము; లోకులు స్వార్థబుద్ధితోఁ మెలఁగుదురు. జీవుల దయఁ జూడవలెనని యెఱుఁగరు. ధర్మోపదేశము విరివిగాఁ జేసి యీయాక్రమము నడిగింపు"మని హితము చెప్పెను. గౌతముఁ డానందించి అట్లు చేయ నిశ్చయించుకొనెను. తానార్జించిన యీజ్ఞానము తొలుదొలుత ఆరాళరామునకుఁ జెప్పి యొప్పింపఁదలఁచి యతఁడు గతించినాఁడని విని విచారపడి తనతోనున్న బ్రహ్మపంచకమున కుపదేశించుటకుఁ బోవుచు దారిలో ఉపకుఁడను బ్రాహ్మణునితో

‡ బుద్ధుఁడిట్లు జ్ఞానముఁబొందినదినము ఈశానశక 103 పం. వైశాఖపూర్ణిమా బుధవారము.

వాదించి తనమతము స్థాపించుకొనెను. అంతటితోఁ బరు
లతో వాదించి తనమతము స్థాపించుకొనవలెననుకొన్నాఁ
డు బుద్ధుఁడు. కాశీకింబోయి ఆమునిపంచకమునకుఁ దన
సిద్ధాంతములు చెప్పి యొప్పించి వారిని సంఘమునఁ జేర్చెను.
అదియే సంఘస్థాపనమున కారంభము. అక్కడనే తొలు
దొల్త బుద్ధుఁడు తన ధర్మచక్రము ద్రిప్ప నారంభించినది.
ఆచిహ్నముగా నక్కడ నొకస్తూపము గట్టినారు. అదియే
సారనాథము. ఇటుమీఁదటఁ గొలఁదికాలమునకే యుదార
మతస్థాపకుఁడైన యాతేజోమూర్తి మహావీరుఁడు నిర్వా
ణముఁ బొందినాఁడు. కనుకనే మహావీరుని శిష్యుఁడైన
గోశాలితోఁ దనసిద్ధాంతముం గూర్చి ముచ్చటించిన
బుద్ధుఁడు-ఆమహామహుఁడు-మహావీరునితో మాటలాడు
టకు నోచుకొనలేదు.

ఇప్పటికి బుద్ధునకు 40 ఏండ్లు నిండుకొన్నవి.
ఇమ్మట బుద్ధుఁడు 5 నెలలలోపల నఱువది మందిని దన
మతమునకుఁ ద్రిప్పినాఁడు. ఈ 60 మందియు స్వసంఘపరి
త్యాగముఁ జేసి బౌద్ధసంఘములోఁ జేరినసన్న్యాసులు. బు
ద్ధుఁడు వారితో "శ్రమణులారా! ఈసత్యమును మందబుద్ధికి
ంగూడఁ దెలియునట్లు బోధింపుఁడు. వారియవివేకముఁ దొలఁ
గించి సన్మార్గమునకుఁ ద్రిప్పుఁడు. మీరొకొక్కరొక్కొక
దేశమునకుఁబోయి ఈమతప్రచారముఁ జేయుఁడు.

పురుష భేదముగాని జాతిమత భేదముగాని మనకక్కర లేదు. జ్ఞానము పొందుట కందఱు నర్హులే" అనిబోధించి వారిని బంపెను.* వారల్లే వివిధ దేశములకుఁ బోయి మతప్రచారముఁ జేయుచుండిరి. బుద్ధుఁడు తరువాత బింబిసారునకు గూడ బుద్ధదీక్ష నిచ్చెను. బుద్ధుఁ డనేకవిపత్తుల నెదుర్కొనుచుఁ దన మతప్రచారము నిరాఘాటముగా సాగించుచుండెను.

శుద్ధోధనుఁ డది విని తనమరణములోగా నొకమారయినను గౌతమునిఁ జూడవలెనని యున్నదని గౌతమునకు వర్తమాన మంపెను. బుద్ధుఁ డంతటఁ గపిలవస్తుపురకుఁ బోయి ధర్మోపదేశముచేసి శుద్ధోదనునకు, గౌతమి మొదలగువారికి దీక్షనిచ్చెను. యశోధర "వారునన్ను శీలవతియని దలఁచెదరేని వారే నాయొద్దకు వచ్చెద"రని యక్కడకు వెళ్లలేదు. బుద్ధుఁడే యశోధరను సమీపించి దుఃఖించుచుండగా నోదార్చి వివేకము గల్పించి దీక్ష నిచ్చెను. తనతండ్రి పరలోకగతుఁ డైనప్పుడు దగ్గరనుండి అంత్యక్రియలు తానే చేసెను.

---

* ఈశిష్యు లందఱు వర్షాకాలమునఁ దిరిగ బుద్ధునియొద్దకుఁ జేరి తాము చేసిన ప్రచారమునుగూర్చియు ముందు జరుగవలసిన పనిని గూర్చియు ముచ్చటించుచుండువారు.

బుద్ధుఁడు పతితులఁగూడ దన [stamp] దేశమువల్ల న్మార్గమునకుఁ ద్రిప్పినాఁడు. ఉపాలీ* య[stamp] ళీమాలుఁ డనుబోయ అట్టివారు. బుద్ధుని యుపదేశ శి మధురముగా నుండెడిదని బౌద్ధగ్రంథము లనుచు న్నవి. ఇతఁడు తనయుపదేశములు దేశభాషయైన పాలీ లోనే చేయుచుండెను. ఈ యుపదేశములు నీతని శిష్యులు యథాతథముగాఁ గూర్చుచుండిరి. వానిని సూత్రపిటక వినయపిటక అభిధమ్మపిటక లని మూఁడు గ్రంథములుగా ర్చిరి. ఇవియే బౌద్ధులకు ముఖ్యప్రమాణగ్రంథములు. వైదికమతమువారికి వేదములట్లివి వీరికిఁ బవిత్రములైనవి. ట్లితఁడు సంతతము మతప్రచారము చేయుచు వేలకు ల ప్రజలకు దీక్ష నిచ్చుచుండెను. భారతవర్షమందేకాక కు మొదలగు విదేశములకుఁగూడ శిష్యులు పోయియీ మతప్రచారము చేసిరి. ఇట్లప్రతిహతముగాఁ దన ధర్మ క్రము విసరివిసరి యాభవ్యమూర్తి బుద్ధుఁడు తన 80-వ యేట నిర్వాణముఁ జేరకొన్నాఁడు. ఈకాలము క్రీస్తుకుఁ పూర్వము ౪౮౭-వ సంవత్సరము.

బౌద్ధసంఘములు:—బుద్ధుఁడు తొలుత తనసంఘ మును వారణాసిలో బ్రాహ్మణపంచకముతో నారంభించి

---

* వీఁడు తనబుద్ధిబలముచేత బౌద్ధులలో గౌరవస్థానముఁ బొందినాఁడు.

నాఁడు. పిదప నీసంఘములో పెక్కువేలమంది చేరినారు. వీరందఱు భిక్షుపదవిఁ బొందినవారు. స్త్రీలుగూడ నున్నారు. గృహస్థుఁడు భిక్షువు కాఁబోవునప్పుడు* శరణత్రయముఁ బొందవలయును. దీనివల్ల బుద్ధునిసద్గుణములను, ధర్మమును, సంఘపుటుత్తరువులను జవదాటలేఁడు. ఇట్టి సంఘనిర్మాణమున కతఁడే జనకుఁడని చారిత్రకులు తలఁచుచున్నారు. తొల్లిటినుండియు ఇట్టివి గలవు. మహావీరుఁడుగూడ నిట్టి సంఘమును స్థాపించినాఁడు. అయితే బౌద్ధసంఘములు సుశిక్షితములైనవి. అతిధైర్యసాహసములు గలవనుటలో సందియము లేదు. బుద్ధుని అనంతరముగూడ నీమతము సుస్థిరముగా నుండుటకు నీసంఘములో నైకమత్యమే కారణము. వారి యుద్యోగప్రవర్తనము దీనికి మరింత తోడ్పడెను. జర్మనిలోని యిప్పటి పోల్జర్లకంటె వారిశిక్షణము చక్కఁగను, సాహసము నిర్దుష్టముగను నుండెనని యొకఁడు వ్రాసెను. ఇది చక్కని వ్రాఁతయే. అయితే వారియందుఁ గార్క్య మేమియు లేదు; పరమశాంతశీలురు. ఈసంఘములో నుండువా రందఱు సంగమును త్యజించిన భిక్షుకులే. వీరు మతప్రచారము కొఱకుఁ గాలినడకతో దుర్గమారణ్యములుగూడ నతిక్ర

* 'బుద్ధం, ధర్మం, సంఘం, శరణం గచ్ఛామి' ఇది శరణత్రయము.

మించినారు. పారావారములుకూడ దాటిపోయినారు. ఇట్లు సుదూరములైన దేశములుగూడఁ జొచ్చుకొనిపోయి తమమతము యొక్క విజయధ్వజముల నాటినారు. వారెంతటి క్రూరజాతుల యొద్దకుఁగూడ నొంటరిగాఁ బోవుటకు జంకువారు గారు.

వీరట్లు సాహసించి సింహళ యవన గ్రీకు(Greek) సుమిత్ర, జపాను, చీనా, ఐగుప్తు(ఈజిప్టు) మొదలగువి దేశములలోఁగూడ నీమతము స్థాపించినారు.‡ అమెరికాలోఁగూడ నిటీవల బౌద్ధశిల్పశకలములు లభించినవని చారిత్రకులు వ్రాసిరి. కాన అంతదాఁకఁగూడనీమతము ప్రాకెనేమో! స్పెయిన్ వారికి లోఁబడకముందు అమెరికావారినాగరికత ఆసియా వారినాగరికతను బోలియున్నది. ఇది భారతవర్షమునుండియే వ్యాపించియుండవచ్చును. అయిన నీభిక్షుకులు మతావేశము చేత అకృత్యములకు దిగలేదు. ప్రజాను ప్రలోభపరచి యీమతమునకుఁ జేర్చలేదు. పరమశాంతముతో సచ్ఛీలముతోఁ బ్రవర్తించియే ఈ మతమును

---

‡ బుద్ధుని పద్మాసనముతోఁ గూర్చుండియున్నట్లు చెక్కఁబడిన విగ్రహమొకటి మెక్సికో (Mexico) దేశములో దొరికినది. ఇప్పుడిది ఫ్రాన్సులోని "ఎత్నోగ్రాఫిల్ సొసైటీ మ్యూజియం (Ethnographical Society Museum) లో నున్నది." ఆవిగ్రహపీఠముపై నిరుద్వపుల శాసనములు గలవు. వానిలో నొకటి చేతిగానివానిచేత

వ్యాప్తి నొందించిరి. లోకములో శాంతిస్థాపనమే వారి పరమాభిప్రాయము. భిక్షుకులు బంధములన్నిటిని బాపుకొనవలెను. అహంకారమును గోరరాదు. నగ్నముగా నుండకుండుటకే కాషాయము గట్టవలెను. బ్రతుకుటకే భుజింపవలెను. తృష్ణను విడువవలెను. ఆకాశమునందు భిక్షువులెగరాదు. పరుషకథ లెవ్వరితోఁ గూడఁ బ్రస్తావింపరాదు. సర్వదా జీవకారుణ్యము గలిగి యుండవలెను. బ్రహ్మచర్యనిష్ఠ నెపుడు నుండవలెను. దశశీలము లాచరింపవలెను. ఆహారనియమము గలిగియుండవలెను. ఇట్లు ధార్మికశాస్త్రమం దున్నది. ఈ మొదలైన నియమములు భిక్షుకులు పాటింపవలెను. వీనిని మ్రొక్కుబడి తీర్చుకొనుటకని ఆచరింపరాదు. నిజమైన జ్ఞానము విశ్వాసము గలిగియే

"బుద్ధునను" మాట అపభ్రంశముగాఁ జెప్పఁబడియున్నది.

......యుక్స్మల్ (Uxmal) అను దేవాలయపు గోడమీఁద జ్యోతిషచక్రములు చెక్కఁబడియున్నవి............

...మెక్సికోలో బహుప్రదేశములందు దేవాలయముల గోడలమీఁద చెక్కఁబడియున్న నాగఫణాకారములను, ఇండోచైనాలలోని దేవాలయముల గోడలమీఁదనుండు నాగఫణాదులవంటి చెక్కడపుఁబోఁతలున్నవి.

...అమెరికాయందలి ప్రాచీనమనుష్యుల యొక్కయు స్థలముల యొక్కయుఁ బేరులలో బౌద్ధసాంప్రదాయము ప్రవేశించెఁగలవాయని పరిశోధింపఁగా అనేకము దొరకినవి."

Mahabodhi Magazine, April May Of 1926. "Discovery of America by ancient Buddhists."

జీర్ణింపకుండ నుద్ధరించుటను గూర్చియు ఆలోచించు
చుండెడివారు అవసరమైన మార్పులుగూడఁ జేయుచుండిరి.

ముఖ్యసిద్ధాంతము :—కర్మము సర్వ స్వతంత్ర
మైనది. దానికి ప్రేరకుఁడొకఁడు లేఁడు. సర్వాంతర్వ్యా
పియు సర్వశక్తుఁడును నైన పరబ్రహ్మపదార్థము గాని
ఆత్మగాని లేవు. వేదములుగూడఁ బౌరుషేయములే. అవి
చే పరమప్రమాణము లని నిలుగావు.

కారణములేనిది కార్యము గలుగదు. కారణము
నశించిన కార్యము తనంతట నదియే పోవును. ప్రపంచ
మంతయు దుఃఖభాజనము. ఈదుఃఖమున కన్నిటికిని మూ
లకారణము తృష్ణ. ఆతృష్ణను వర్జించినయెడల సర్వ
మును నశించిపోయి నిర్వాణము లభించును. దశశీలాచర
ణమే దీనికి సాధనము. పంచశీలాష్టశీలములు దశశీలము
లాచరించుటకు క్రమాభ్యాసముఁ గూర్చును. ఇట్లు చేసి
నిర్వాణముఁ జేరుటే ప్రతివానికిఁ బరమార్థము. నిర్వాణమే సర్వో
న్నతమైనస్థానము. బుద్ధునకుఁ దొలుదొలుత గోచరించిన
దుఃఖము, దుఃఖోత్పత్తి, దుఃఖనివారణము, దుఃఖ నివారణో
పాయము అను సత్యచతుష్టయము లివియే.

## ఉపసంహారము

ఇఁక మీఁదట మహావీర బుద్ధులకాలము బౌద్ధమత మీ దేశమున సన్నగిల్లుటకుఁ గారణము మొదలగు వానిఁ గూర్చి చర్చించెదము.

కాలనిర్ణయము:—మహావీరుని కాలమునుగూర్చియు బుద్ధునికాలమును గూర్చియు వివాదము లున్నవి. హార్మన్ జేకోబీగారు మహావీరుని నిర్వాణకాలము క్రీ. పూ. 477 అగునని నిర్ణయించినారు. స్మిత్ గారు 460 అన్నారు. ఇవి నిలువనేరని నిర్ణయములు. ఈ దేశములోని వివిధములైన మాసములతీరు తెలియక పాశ్చాత్యులు ప్రమాదపడి యిట్లు చేసినారు. ఇప్పుడు మనవారు పలువురు విషయములఁ జర్చించి క్రీ. పూ. 527 మహావీరుని నిర్వాణము 597 జననమని నిర్ణయించినారు. ఇదే అనేకవిధముల స్పష్టముగానున్నది. ఇఁక బుద్ధునివిషయము. బుద్ధునిగూర్చికూడ నిట్లే వివాదము లున్నవి. కొందఱు క్రీ. పూ. 543లో నిర్వాణమొందెనందురు. ఇదిపొసఁగదు. ఇట్లైన మహావీరునికంటె బుద్ధుఁడే ప్రాచీనుఁడగును. కాఁడుకదా అని ప్రశ్నింపవచ్చును. జైనగ్రంథములు మహావీరునిఁ బ్రాచీనునిఁగాఁ జెప్పుచున్నవి. బుద్ధగ్రంథములలోఁ గూడ బుద్ధుఁడు గోశాలితో తనమతముఁగూర్చి ప్రస్తాపిం

చినాఁడని యున్నది. ఈ గోశాలి మహావీరుని శిష్యుఁడని యిదివఱకే చెప్పియుంటిమిగదా! మహావీరునికంటెఁ జ్యేష్ఠ వాఁడైన బుద్ధుఁడు మహావీరుని శిష్యుఁడైన గోశాలితో ముచ్చటించుట సంభవమా? ఇవన్నియు ఆలోచించిచో మహావీరుఁడే ప్రాచీనుఁడన్నాము. క్రీ. పూ. 487 లో బుద్ధుఁడు నిర్వాణమొందినాఁ డన్నమాట సుస్థిరపడె.

ఇట్లైనచో 487 + 80=567 అగును బుద్ధుని జననకాలము. మహావీరబుద్ధులు ఉభ జ్యేష్ఠులై సమకాలీనులు కాఁజాలరను హార్మన్ జేకోబిగారి వాదము. ఏలకారాదు? 567—39=528లో బుద్ధుఁ డుపదేష్ట అయినాఁడు. 527లో మహావీరుఁడు నిర్వాణ మొందినాఁడు. 1 సంవత్సరకాలము సమకాలీనులు కాఁదగియున్నారు. ఇంత కొద్దికాలమునుబట్టికూడఁ ఎఱుఁగరేమో? లేనిచో మహావీరుని శిష్యుఁడైన గోశాలితో మతచర్చ జరిపినబుద్ధుఁడు ప్రసిద్ధుఁడైన మహావీరునితోఁగూడ మాటాడియుండఁడా? బింబిసారుఁ డిట్టి కున్నాఁడా అని కొందఱు శంకించి. ఉన్నాఁడు. మహావీరుఁడు నిర్వాణమొందనుండఁగా వెళ్లి దర్శించి వచ్చినాఁడని * జైనగ్రంథములు చెప్పుచున్నవి.

* మహావీరచరిత్రము, కాలనిర్ణయభాగము.

527 లో మహావీరుడు నిర్వాణముం జెందినాడు గాన బుద్ధుని బాప్రున 528 ప్రాంతముననే బింబిసారుడు దర్శించి యుండవలెను. కనుక ఆకాలమునకును బిదపం గొంత కాలమున అరుఁగూడ జీవించినాఁడగును. ఈసందేహము మేల నిర్ధారణ చేయఁగా: క్రీ. పూ. 554లో బింబిసారుడు రాజ్య త్యాగముం జేసినాడు. ఎవారే బింబిసారుని అంత్యకాల మును భ్రమపడినారు వారు.

జైన బౌద్ధములన్నచో మనవారుకొంద అసహ్యించు కొందురు. అవి వేదదూరములైన మతములని వారియూహ. పరిమితముగా వాఙ్మయము మాత్రసంబధమగు ఇట్టియూహ నసత్యమును గలిగించున్నది. సద్భావముతో మన మాలోచించిన యెడల నివి మన సాంప్రదాయములకు సుదూరములు గాననట్టివి యగును. ఇవి వేరుకావు. ప్రపంచమునందలి మతములన్నియు ఆర్షమతపు పునుకమటి లోనివేనని యొంచవలయున్నవి. క్రైస్తవమతముకూడ ఆర్షమతముతో ననుసంధానమైనదే నని చారిత్రకులను చున్నారు. గ్రీకుదేశాంగి పైథాగరస్ మొదలైనవారు పాశ్చాత్యదేశములలో బౌద్ధసాంప్రదాయములు ప్రచారము చేసినారట. ఆనాడు భారతదేశమునుండి వచ్చుచుండెడి వర్తకసంఘమువలన ఆ సాంప్రదాయములు

వారి కొంతకవడియుండును. క్రీస్తువీ సాంప్రదాయములం జాలవఱ కనుకరించెనట.

జైనబౌద్ధములకు ఆర్షమతసంబంధము:— జైనమతము బౌద్ధముయొక్క శాఖాభేదమని పాశ్చాత్యచరిత్రకారులు వ్రాసినారు. అది ప్రమాదజనితమైనయూహ. సంఘము, అర్హంతుడు, భిక్షువు మొదలగుపదముల సాదృశ్యములు సాధారణముగా నిట్టిప్రమాదమును గొల్పును. లోతుగా విచారించినయెడల రెండును వేఱువేఱు తీరులుగలవని తెలియును. బౌద్ధసంఘము, భిక్షుకీ, భిక్షుకులని రెండుభాగములు గలది. జైనసంఘము ముని, ఆర్జిక శ్రావక, శ్రావికలనునాల్గుభాగములుగలది. బౌద్ధులకు బుద్ధ ధర్మసంఘములు శరణము. జైనులకు తీర్థము, ధర్మము, సంఘము, శరణము. బౌద్ధాచార్యులు కాషాయధారులు; జైనార్హతులు, దిగంబరులు. జైనులు ఆత్మ దైవము నొప్పుకొందురు. బౌద్ధులవి యొప్పుకొనరు. ఇట్లు వేర్వేరు తీరులుగలిగి యున్నవి. అయితే యివి రెండును ఆర్షమతమునుండియే వెలువడినవి. హార్మిమన్ జేకోబీగారీవిషయమిట్లు చెప్పుచున్నారు: "The Buddhas improved upon the Brahamani system of Yugas while the Jains invented their Utsarpini and Avaserpini ears after the model of the day and night of Brahma." బుద్ధులు బ్రాహ్మ

ణులయుగపు పద్ధతుల ననుసరించి దానిని బెంపొందించి నారు. జైనులేమో బ్రహ్మయొక్క అహోరాత్రములకు ఉత్సర్పిణి అపసర్పిణి అను కాలకల్పము గనుగొన్నారు. జైనులు బౌద్ధులుగూడ తమధర్మము లనాది యనుచు న్నారు. అందుకొఱకే జైనులు మహావీరుడు తుదివ తీర్థం కరుడందురు. బుద్ధుడు తనవంటివారిదివఱ కెందఱో బు ద్ధులు వచ్చిపోయినారని చెప్పెను. కపిలమతమునుండి బౌద్ధము వచ్చినదని కొందఱందురు. జైనబౌద్ధములకు ముఖ్యమైనది సన్న్యాసము. "సన్న్యాసః కర్మయోగశ్చ నిశ్శ్రేయసకరా ఉభౌ" అను గీతావాక్యమువలన నది ప్రాచీనకాలమునుండి యున్నట్లు కనుపడును. బృహదా రణ్యకోపనిషత్తులోఁగూడ దీని కుదాహరణము లున్నవి. ఆర్షసన్న్యాసుల పంచప్రతిజ్ఞలు, జైనసన్న్యాసుల పంచ శీలములు, బౌద్ధసన్న్యాసుల దశశీలములలోని పంచశీల ములు నొక్కపోలికనే యున్నవి. అహింస, సూనృతము, బ్రహ్మచర్యము, అస్తేయము అప్రతిగ్రహములవి. ఇట్లే యీ మతములన్నిటిలోని గృహస్థధర్మములకుఁ గూడఁ బోలిక లున్నవి. జైనబౌద్ధు లవి స్మృతులనుండియే కైకొన్నట్లగుపడును. చీకటిపడ్డపిదప భోజనము మాన

వలె నను జైననియమము అర్హమానమునుండి గ్రహించి నదే. *

అహింస అర్హమానమువారికింగూడ ముఖ్యధర్మమే. యజ్ఞయాగములలోఁ పశువధ చేయుట లేదా అనుట అది వేఱుమాట, అది కామ్యకర్మములలోనిది. అర్హమానము నకు కామ్యకర్మములు పరిమితములైనవి గావు. జీవన్ముక్తి నొందువారికిట్టి కామ్యకర్మములు చేయరాదు. జైనబౌద్ధు లలోఁగూడ అహింస తీవ్రముగా నాచరింపఁబడినవారు అర్హతు (జీవన్ముక్తు)లే. జైనబౌద్ధగ్రంథములఁగూడ అహింస పరిమితముగానే యున్నది. జైనబౌద్ధగ్రంథము లందు వర్ణింపఁబడిన స్థితప్రజ్ఞునియొక్కయు లేక వేదాంతుల జీవన్ముక్తునియొక్కయుస్థితి యొక్కయుచ్చున నే యున్నది.

మహావీరుఁడు బ్రాహ్మణనిరసనము చేయక పోయి నను నాయనశిష్యులు ద్వేషించినారు. బౌద్ధు లట్లు చేయ లేదు. నైష్ఠికులైన శ్రమణకులను బ్రాహ్మణులని వారు

* ఆ సంగతే దానానాం [illegible] ముచ్యతే,
అన్నం [illegible] సంప్రాప్తే [illegible] చైవ [illegible].
—మార్కండేయఋషి.

సద్రుమేషు ప్రస్వభూతాని నిర్ద్వంద్వో నిస్పృహో భవేత్,
నక్తం చైవ భక్షిణాం రాత్రౌ ధ్యానపరో భవేత్.
—మత్స్యపురాణము.

పేర్కొనుచుండిరి. బుద్ధుఁడు బ్రాహ్మణత్వ మొప్పుకొన్నాఁడు. అయితే అది జాతిచేతఁగాక శీలముచేత సంపాదింపఁదగినదన్నాఁడు. కొంచెమించుమించుగా ఆర్షమతమువారి అభిప్రాయముగూడ నిట్లేయుండును. *జన్మముచే నొకఁడు బ్రాహ్మణుఁడైనను శీలము లేనివానికి గౌరవమెంతకంతేకదా? నేఁడు గాంధీమహాత్మునకుఁ దనశీలమువలన లోకోత్తరమైన గౌరవము గలుగలేదా? జైనులచే లేపఁబడిన బ్రాహ్మణ ద్వేషము బుద్ధుఁడు తన మతముతో నాపఁగలిగినాఁడు. లోకములో సమానసభ యను సమకూర్పఁగల్గినాఁడు.

వేదములు అపౌరుషేయము లన్నమాట బుద్ధుఁ డొప్పుకొనఁడు. కాని భూపరిమాణ స్వరూపములు, ఖగోళసందర్భములు, స్వర్గమర్త్యపాతాళాది లోకములు ఇంద్రాది దేవతలు మున్నగు విషయములు చాలవఱకు వేదములనుండి యథాతథముగాఁ దీసికొన్నాఁడు. వేదము లొప్పుకొన్న యజ్ఞము తానొకచిక్కులోఁ దగుల్కొనునట్లుంచెను. తాను ప్రతిష్ఠింపఁదలఁచిన అహింసాధర్మమున కవి యడ్డుదగులునట్లుంచెను. లోకకల్యాణమున కాసమయమున అహింసయొక్క యవసరమేమో వెనుకటి సందర్భముల స్మరింపుఁడు. వేదములు, కామధేనువులు. ఎవరే

* జన్మనా జాయతే శూద్రః కర్మణా జాయతే ద్విజః.

యర్థము సాధింపవలయునన్న వారి కట్టియర్థ మందు లభిం
చును. అందువల్లనే వాని కనేకములు భాష్యములు బయ
లుదేరినవి. ఇన్నిమతములు గలిగినవి. బుద్ధుఁడు పూను
కొన్నచోఁ దనమతమునకు వేదమునుండియే ప్రమాణ
ములు చూపియుండును. అట్టిచర్చలతోఁ బ్రొద్దుపుచ్చుట
కిచ్చగింపఁడు బుద్ధుఁడు. "పదివేలశ్లోకములుపఠించుటకంటె
ఒక్కపని చేయుట మంచిదన్నాఁడు బుద్ధుఁడు. కానినే
యాపని కాతఁడు పూనుకొనలేదు. యజ్ఞములలో బశు
వులతోఁగూడ తమపాపములు వ్రేల్చఁబడుచున్నవను నభి
ప్రాయ మాకాలమునఁ బ్రతివానికిని గాఢముగా నాఁటి
యున్నది. కొద్దికొద్ది సంస్కరణములతో నా యూహ
త్రుళ్లగింపరానిది. కాన నింతపెద్దమెత్తు నెత్తినాఁడు.
కామ్యకర్మముల నిర్మూలించినాఁడు.

బుద్ధుఁడు మొట్టమొదట పరబ్రహ్మపదార్థముగాని
ఆత్మగాని లేదన్నాఁడు. కనుకనే వైదికమతమువారు
బుద్ధుని నాస్తికుఁడన్నారు. బుద్ధుఁడు కేవలము నాస్తికుఁ
డనుటకు వీలులేదు. బ్రహ్మపదార్థ మొప్పుకొనకున్నను
దత్తుల్యమైన మఱొకస్థానము నంగీకరించినాఁడు. అదియే
నిర్వాణము. నిర్వాణస్వరూప మొక బౌద్ధగ్రంథమున
నిట్లు వర్ణింపఁబడినది.

శ్లో. దయాసిద్ధి రేవా స్త్యహింసాస్తు లోకే
స దా న్తి స్సశాంతి స్స నీతి స్సదాఽపి;
స్వారాది ప్రస క్తిః పునర్జన్మ హేతు
ర్భజధ్వాం నిరాకార నిర్వాణ మేకమ్.

దీనికిని బరబ్రహ్మస్వరూపమునకును భేదమేదియు లేదు. నిర్వాణమనగా మరణమని కొంద అనుకొందురు. ఆమరణమునకుఁగూడ మరణ మడ. అనఁగాఁ బునర్జన్మ లేనియవస్థ. వేదాంతుల బ్రహ్మైక్యావస్థ గూడ నిట్టిదే కదా! బుద్ధుఁడుగూడ కొంతకాలమైనపిదప ఆత్మ, బ్రహ్మపదార్థములు కేవలము లేవన లేకపోయినాఁడు. ధమ్మపదములో జ్ఞానశీలురు ప్రశ్నించినవారిని బ్రహ్మముగూడ స్తుతించునని బ్రహ్మనుగూర్చి చెప్పినాఁడు. అయితే* అవి దురూహ్యములైన విషయములు. ఆ యప్పరిలోఁబడి సత్కార్యాచరణమును నిర్లక్ష్యము చేయవలదని చెప్పినాఁడు. ఆకాలములో కేవల మాత్మవిచారమునందభినివిష్టులై ఇతరకార్యములు చిన్నచూపుతోఁ జూచెడివారని దీనివలన మనకుఁ దెలియుచున్నది. బుద్ధుఁ డీమాట ముఖ్యముగా జైన-ఆజీవిక యతులఁగూర్చి చెప్పియుండును. అయితే యిట్టి నిర్గుణోపాసనము చిరకాలము జరుగలేదు. అది సాధ్యమా?

* సంయుక్తని కాయసుత్తము.

బుద్ధునియనంతరము క్రీ. శ. 2-వ శతాబ్దియందు భక్తి పరమైన మహాయానశాఖ వెలువడినది. ప్రజాభిప్రాయము గుర్తింపఁగల్గిన యాయుదారమూర్తి బుద్ధుఁడే యింతవఱకు జీవించినచో యీ సగుణోపాసనానుష్ఠానము తానే సాగించియుండునేమో!

ఈ భవ్యమూర్తిని వైదికమతస్థులు గూడ దశావతారములలో నొకనిఁగా స్వీకరించినారు. ఇట్టి సౌహార్దము మెచ్చఁదగినదే. కాని సహింపలేకపోయిరి కాబోలు! ఆ ప్రక్కనే కొందఱు ఈ సత్ప్రశంసకుఁ గొంత మచ్చ నంటించినారు. "శ్రీ మహావిష్ణువు ప్రజల సుఖము సంహరించుటకు బుద్ధావతారమెత్తి వేదోపనిషత్ప్రమాణములఁ జెరిచినాఁడని" ఆ కథ. ప్రతిమోపాసకులైనను పరమతమును గర్హించుచుందురు. అట్టి విద్వేషబుద్ధి విజ్ఞులకుఁ దగనిది. కొద్దిగా భిన్నాభిప్రాయ మున్నంతమాత్రమున నే వ్యక్తిని మనము గర్హింపరాదు. అభిప్రాయభేదము లేనివా రెవరు?

'తర్కోఽప్రతిష్ఠః శ్రుతయశ్చ భిన్నా, మహామునీనాం మతయశ్చ భిన్నాః; ధర్మస్య తత్త్వం నిహితం గుహాయాం, మహాజనో యేన గతస్స పంథాః" అన్న వ్యాసునిమాట ముత్యాలమూటయే. ఆర్షమతము

మాత్ర మేకాభిప్రాయముతో నున్నదా? మహాబుధు
లందఱు తెలుకొన త్రోవఁ ద్రొక్కి చూపినవారే. పై వివేచ
నమువల్ల జైనబౌద్ధములకు ఆర్షముతో నున్న బాంధ
వ్యము తెలిసికొన్నాము. ఈవిషయము ఇంతకంటె విపు
లముగాఁ జర్చించుటకిట చోటు లేదు. ఏది యెట్లున్నను
జైనబౌద్ధములు ఆర్షమతమునకు సుదూరములైనవి గావ
నుట నిర్వివాదము. ఈవిషయమునలో లోకమాన్య బాల
గంగాధరతిలకుగారు చెప్పినమాట ముచ్చటగ నున్నది.
"జైనబౌద్ధమతములు కాలక్రమమున ఆర్షమతమునుండి
తమభాగము పంచుకొని తండ్రినుండి వేర్పడ్డ కుమారుల
వలె నున్నవి" అని. దేశమంతయు హింసాప్రవా
హములోఁ గొట్టుకొనిపోవుచున్నపుడు దాని నడ్డగించి
కల్యాణతీరమునకుఁ జేర్చిన మహావీరబుద్ధులు మనకుఁ
జిరస్మరణీయులు; వందనీయులు. ఒకప్పుడు భవ్యమైన
యీబుద్ధమూర్తిని గూర్చి నే నిట్లు పద్యముఁ గూర్చితిని.

మ. స్థిరధర్మోజ్జ్వల మూలముం సుకృత వి
స్తీర్ణాలవాలంబు సత్
కరుణాసారము ధీకళావిశద శా
ఖం బిచ్ఛసచ్ఛాయ భా

సురముఖఁ సమ్మోదపల్లవంబు సుయశ
స్స్నానంబునుఁ సత్ఫలో
త్కరమూశా విస్తృతంబు బుద్ధ సురవృ
క్షం బెందు మేలందుతఁ.

ఆనాఁడు శిథిలమగుచున్న సాశీల్యమును, సత్యసంధతను, ధర్మనిరతిని నుద్దీపింపఁజేసి సర్వసమానత్వముఁ బాదుకొల్పి మానవాత్మాభిమానమును మృదువుపఱిచి, యుదారమైన అహింసను ప్రతిష్ఠించి మహోన్నత వ్యాప్తితో నున్న బౌద్ధమత మిప్పు డీదేశములో మఱుఁగుపడినది. దీనికిఁ గారణము బ్రాహ్మణమతద్వేషమని కొందఱు, దానిలో నిజమైన సత్త్వములేక కాస పాల పొంగువలె వ్యాపించి యట్లే సమసిపోయినదని కొందఱు, పాశ్చాత్యచరిత్రకారు లభిప్రాయపడినారు. అవి యపప్రథలు. దీర్ఘముగా ఆలోచించితిమేని అవి సత్యములు గావు. మొదటివాదము పరిశీలింతము. హర్షకనిష్కాదు లీమతము వ్యాప్తికిఁ దెచ్చుట కెంతయో పరిశ్రమించినారు. కాని తొల్లిటిప్రాభవముఁ బొందలేకపోయినది. రాజాదరణముఁ బొందిన యీమతమును బ్రాహ్మణు లెదిరించుటా? ఎదిరించినను రూపుమాపఁగల్గుదురా? అసూయాగ్రస్తులెవరో కొందఱుతప్ప, బ్రాహ్మణులు, బౌద్ధుల హింసించినట్లగుపడరు. పాహియాను "బ్రాహ్మణులు, బౌద్ధులు

అన్యోన్య మనురాగముతో మెలఁగుచుండుటఁ జూచితి" నని వ్రాసినాఁడు. అదిగాక బౌద్ధమతమును మహోచ్చస్థితికిఁదెచ్చిన అశోకుఁడు బ్రాహ్మణ, జైన, ఆజీవిక, బౌద్ధాదిమతములవారి నందఱిని సమానాదరముతోఁ జూచినట్లు చారిత్రపరిశోధనములు దెల్పుచున్నవి. గుప్తసంతతిరాజులుగూడ నీమతములవారి నందఱిని సమముగా నాదరించినారు. వీరు బ్రాహ్మణమతావలంబులు. మఱొక వింత: కాశ్మీర, కళింగ, మహారాష్ట్ర, దేశాధిపతులు శైవవైష్ణవాది మతావలంబులై, గుళ్లు గోపురములు గట్టించుచుండఁగా వారిరాణులు బౌద్ధమతావలంబులై, బౌద్ధభిక్షువులఁ బూజించుచు, స్తూపములు ఆరామములు గట్టించుచుండిరట. ఇటీవల నిట్టిశాసనములు, చారిత్రకులు కనుఁగొన్నారు. కనుక బౌద్ధమతక్షీణత కిది కారణము గాదు. ఇఁక రెండవయపప్రథఁగూర్చి విచారింతము. దానిలో సత్యములేనిచో రాజాధిరాజులు, పండితప్రకాండులు దాని నాశ్రయించియుండరు. జను లందఱు కాదనిశేయమై యుండరు. ఈమతము చరమదశయం దున్నప్పుడే దీనిని బూర్వపక్షముసేయుట కుమారిలభట్టునకు సుసాధ్యము గాలేదు. ఒక్కయూఁపూఁపినది. కాన యీవాదముగూడ నిలువనేరనిదే. అయితే దీనిక్షీణతకుఁ గారణ మేమి? అది క్షీణింప లేదు. ఆర్షమతములో లీన

మైనది. మహాయానసంస్కరణమే దీని నీదారికి లాగినది. మహాయానమతమువారుగూడ సగుణోపాసన మొప్పుకొన్నారు. ఆర్యమతమువారు బుద్ధునిగూడ దేవుఁడే నన్నారు. అహింసావిషయ మిద్దఱకు నంగీకారమేకదా? అంతటితో ఆర్యబౌద్ధమతములభేదము పోయినది. ఈవగి గాను మెవరికిని తెలియకుండనే ప్రకృతి జరిగించినది. స్వార్థత్యాగము నుద్బోధించిన యీమతము తుదకుఁ దానుగూడ స్వార్థత్యాగ మొనర్చినది. ఎందుకొఱకు ఆర్యమతమునుండి తాను ఏర్పడ్డదో ఆ యహింసాధనము నార్జించుకొన్నది. మరల ఆర్యమతముచే సమ్మేళన మొందినది. తనతల్లియైన ఆర్యమతమునకు నూతనతేజముఁ గల్పించినది. కాని ఇప్పుడీదేశమున బౌద్ధమతము వ్యాప్తిలో లేకపోయినది. విదేశములలో అహింసాప్రధానమైన ప్రాచీనమతము లేదు. కాని యీబౌద్ధమతమే మిక్కిలి సుస్థిరముగా వర్ధిల్లినది. బౌద్ధమత మిప్పటికిఁ గూడఁ బ్రపంచమునందలి జనసంఖ్యలో మూఁడవవంతును నాక్రమించినది.

ధమ్మపదము

బౌద్ధులకు ముఖ్యముగాఁ బ్రమాణగ్రంథములు త్రిపిటకములు. వీనిలో సుత్తపిటకము మిగులఁ బ్రాచీనమైనది. బుద్ధునియుపన్యాసము లిందు యథాతథముగా

ంధానింపఁబడినవి. బుద్ధుఁడే కథకుఁడుగా శిష్యులు శ్రోతలుగా నిది కూర్పఁబడినది. బుద్ధునిజీవితము, సిద్ధాంత ములు తెలియుట కిదే ముఖ్యగ్రంథము.

తరువాత ప్రసిద్ధమైనది వినయపటకము. ఇందు భిక్షుకుల నియమములు నిరూపింపఁబడినవి. ఇది సంఘ మున కుపయుక్తమైనది.

మూఁడవది అభిధమ్మపిటకము. ఇందు జన్మకారణము, జీవితరహస్యములు నిరూపింపఁబడినవి. గృహస్థ ధర్మములుగూడఁ జెప్పఁబడినవి. ఇది బుద్ధనిర్వాణానంత రము పుట్టినదని యొకవాదుక గలదు.

ఈ మూఁడింటిలోనిసారము దీసి ధమ్మపదమను గ్రంథము కూర్పఁబడినది. దీనికూర్పరి యెవరో తెలియ రాకున్నది. ఆర్షమతమువారికి భగవద్గీత యెంత పవిత్ర గ్రంథమో బౌద్ధుల కీధమ్మపద మంతపవిత్రమైనది. దీనికి బుద్ధగీతయను నామాంతరముగూడఁ గలదు. ఇట్టిగౌరవ మున కిది తగియున్నది. ఈ ధమ్మపదమందలి నీతులు మెచ్చఁదగినవి. కాన భగవద్గీతలోని శ్లోకములం దలఁపిం చునవి ఉన్నవి. కొన్ని ఆర్షమతమందలి ధర్మముల పోలి కగల ధర్మములున్నవి. చూడుఁడు:—

"నహి వేరేణ వేరాణి సమ్మంతీధ కుదాచనం,
అవేరేనచ సమ్మంతి యేస ధమ్మో సనాతనో."

ఇది 26 వర్గములుగల గ్రంథము. ఇందలి యొక్కొక్క శ్లోకమునకును బుద్ధఘోషుఁ డొక్కొక్కకథ వివరించి వ్యాకరించినాఁడు. ప్రాకృత మిందలిభాష. దీనిని, బుద్ధఘోషునికథలను అనేకులు ఆంగ్లమునఁబరివర్తించిరి. స్వామి సత్యదేవుగారు హిందీలో ననువదించిరి. మాతృకను, హింది ఆంగ్ల కర్ణాటక పరివర్తనములనుజూచి దీనిని దెలిఁగించినాను. కొన్నికొన్ని యెడల హిందీ పరివర్తనమునకు మూలము సరిగా సరిపోవుచుండలేదు. అట్టిచోట్ల ఆంగ్లానువాదములు నాకుఁ జాల సహాయపడినవి. యథాప్రజ్ఞ మీగ్రంథము నాంధ్రీకరించితిని. గుణము గ్రహింపవలసినవారు పాఠకులే కదా!

ఈగ్రంథములోని సందేహములు దీర్చుటకు బ్ర. శ్రీ. గన్నవరపు సుబ్బరామయ్యగారు (భారతీకార్యాలయము) తోడ్పడినారు. వారికిఁ గృతజ్ఞుఁడను.

జయంతిపురము
28-8-26.
} వాసిరెడ్డి శ్రీ దుర్గాసదాశివేశ్వరప్రసాద్.

# ధమ్మపదము

నమోతస్స భగవతో అరహతో సమ్మాసం బుద్ధస్స.

## యమకవగ్గో పఠమో

మనో పుబ్బంగమా ధమ్మా మనోసేట్ఠా మనోమయా,
మనసాచే పదుట్ఠేన భాసతివా కరోతివా,
తతోనం దుక్ఖ మన్వేతి చక్కంవ వహతో పదమ్. ౧

మనోపుబ్బంగమా ధమ్మా మనోసేట్ఠా మనోమయా,
మనసాచే పసన్నేన భాసతివా కరోతివా,
తతో నం సుఖ మన్వేతి ఛాయాఽవ అనపాయినీ. ౨

అక్కోచ్ఛి మం అవధి మం అజిని మం అహాసి మే,
ఏతం ఉపనయ్హన్తి వేరం తేసం నసమ్మతి. ౩

అక్కోచ్ఛిమం అవధి మం అజిని మం అహాసి మే,
ఏతం న ఉపనయ్హన్తి వేరం తే సూపసమ్మతి. ౪

నహి వేరేన వేరాని సమ్మన్తీధ కుదాచనం,
అవేరేనచ సమ్మన్తి ఏస ధమ్మో సనాతనో. ౫

పరేచ నవిజానన్తి మయమేత్థ యమామసే,
యేచ తత్థ విజానన్తి తతో సమ్మన్తి మేధగా. ౬

సుభానుపస్సిం విహరన్తం ఇన్ద్రియేషు అసంవుతం,
భోజనమ్హి అమత్తఞ్ఞుం కుసీతం హీన వీరియం,
తం వే పసహతి మారో వాతో రుక్ఖంఽవ దుబ్బలం. ౭

అసుభానుపస్సిం విహరన్తం ఇంద్రియేసు సుసంవుతం,
భోజనమ్హిచ మత్తఞ్ఞుం సద్ధం ఆరద్ధవీరియం,
తం వే నప్పసహతి మారో వాతో సేలంఽవ పబ్బతం. ౮

అనిక్కసావో కాసావం యో వత్థం పరిదహేస్సతి,
అపేతో దమసచ్చేన నసో కాసావ మరహతి. ౯

యోచ వన్తకసావస్స సీలేసు సుసమాహితో,
ఉపేతో దమసచ్చేన సవే కాసావ మరహతి. ౧౦

అసారే సారమతినో సారే చాసార దస్సినో,
తే సారం నాధిగచ్ఛన్తి మిచ్ఛాసఙ్కప్పగోచరా. ౧౧

సారంచ సారతో ఞత్వా అసారంచ అసారతో,
తేసారం అధిగచ్ఛన్తి సమ్మాసఙ్కప్పగోచరా. ౧౨

యథాఽగారం దుచ్ఛన్నం వుట్ఠి సమతివిజ్ఝతి,
ఏవం అభావితం చిత్తం రాగో సమతివిజ్ఝతి. ౧౩

యథాఽగారం సుచ్ఛన్నం వుట్ఠి న సమతి విజ్ఝతి,
ఏవం సుభావితం చిత్తం రాగో నసమతి విజ్ఝతి. ౧౪

ఇధ సోచతి పేచ్చ సోచతి పాపకారీ ఉభయత్థ సోచతి,
సో సోచతి సో విహఞ్ఞతి దిస్వా కమ్మ కిలిట్ఠ మత్తనో. ౧౫

ఇధ మోదతి పేచ్చ మోదతి కతపుఞ్ఞో ఉభయత్థ మోదతి,
సో మోదతి సో పమోదతి దిస్వా కమ్మ విసుద్ధి మత్తనో. ౧౬

ఇధ తప్పతి పేచ్చ తప్పతి పాపకారీ ఉభయత్థ తప్పతి,
పాపం మే కతంతి తప్పతి భియ్యో తప్పతి దుగ్గతిం గతో.

ఇధ నన్దతి పేచ్చ నన్దతి కతపుఞ్ఞో ఉభయత్థ నన్దతి,
పుఞ్ఞం మే కతంతి నన్దతి భియ్యో నన్దతి సుగ్గతిం గతో. ౧౮

బహుంపి చే సహితం భాసమానో
న తక్కరో హోతి నరో పమత్తో,
గోపోఽవ గావో గణయం పరేసం
న భాగవా సామఞ్ఞస్స హోతి. ౧౯

అప్పంపి చే సహితం భాసమానో
ధమ్మస్స హోతి అనుధమ్మచారీ,
రాగంచ దోసంచ పహాయ మోహం
సమ్మప్పజానో సువిముత్తచిత్తో,
అనుపాదియానో ఇధవా హురం వా
సభాగవా సామఞ్ఞస్స హోతి, ౨౦

ఇతి ధమ్మవగ్గో పఠమో

శ్రీమద్గీతోపనిషద్గోదోగ్ధ్రే

శ్రీకృష్ణపరబ్రహ్మణేనమః

---

గీ. ధరణి జీవులఁ దనయట్లు తలఁచువాఁడు
గుణము లెందున్న వడి నేరికొనెడివాఁడు
మాటలోఁ జేఁతలో నొక్కమాద్రివాఁడు
బుద్ధుఁ డొసఁగిన యుపదేశమును వినుండు.

## బుద్ధగీత (ధమ్మపదము)

### ౧ యమకవర్గము

ఒకనాఁటి యుదయమున బుద్ధదేవుఁడు ధ్యానాదికను దీర్చుకొనివచ్చి యొక మామిడిచెట్టు క్రిందఁ గూర్చుండి యుండఁగా ప్రియశిష్యుఁ డానందుఁడను భిక్షుకుఁడు భిక్షువులందఱితోఁ గూడివచ్చెను. వచ్చి నమస్కరించి బుద్ధుని యనుమతి వడసి "దేవా! మాకుఁ గొన్ని సంశయము లున్నవి. మీరు వానిని దీర్చవలెను" అనెను. బుద్ధదేవుఁడు "సరియే, కానిండు" అనెను. అంత గౌర వర్ణుఁడగు యువభిక్షుకుఁడొకఁడు లేచి యడిగెను, "జన ప్రభూ! మనస్సనఁగా నేమి? సుఖదుఃఖములు గలుగుట కేది కారణము? కర్మసిద్ధాంత మెట్టిది? ఏవి భిక్షుధర్మములు? వీనినిగూర్చి సుబోధముగా నుపన్యసించి మాకు మేలు

సేయుఁడు " అని. అంతట బుద్ధుఁ డనియెను: "నాయనా! వినుము:

మనుజుని వ_ర్తమానస్థితి వాఁడాచరించు ధర్మముల (పంచ స్కంధములలోని వేదన, సంజ్ఞ, సంస్కారము అను నీ మూఁడును ధర్మము లనబడుచున్నవి.) ననుసరించియుం డును. మనవిచారములఁ బుట్టించునది మన మానసికావ స్థయే. వానినిఁ బాలించునదియు మనస్సే. వీని కన్నిటికి నాధారము విచారసంస్కారములు. మనమాటలలోను, చేఁతలలోను మనయాలోచనలు స్ఫురించుచుండును. బండినీడ్చెడి యెద్దుయొక్క గొరిజల నొరసికొని చక్ర ములు వచ్చుచుండునట్లు దుర్విచారములుసేయుచు దుడు కుఁబోకలు పోవువానిని దుఃఖములు వెన్నంటియే యుండును. ౧

మన మెవరమో యెఱుఁగుదురా? మనము మన విచారముచేఁ గల్పింపఁబడిన రూపములము. ఇంటిబలా బలము లాయింటికిఁ గట్టిన యిటుక, సున్నము, కలప మొదలగుసామగ్రి ననుసరించి యుండునట్లు మనుజుని విచారము ననుసరించి యాతని స్థితియు నున్నది. మను జుఁడు తనకుఁ దోఁచిన పవిత్ర సంకల్పములను లోక మున కుపదేశించుచుఁ దానుగూడ నట్లాచరించుచుండె

నేని సుఖమును, శాంతిని బడయఁగలుగును. ఛాయ
యట్లు సర్వదా యవి వానినిఁ గాచికొనియుండును. ౨

ఓభిక్షులార! "వీఁడు నన్నుఁగొట్టెను; వీఁడు నన్నుఁ
దిట్టెను; వీఁడు నన్ను నోడించెను; వీఁడు నన్నుఁదోఁచు
కొనెను" అని విచారపడువానిని క్రోధము విడువదు. 3

అట్టి విచారమును దూరీకరించినవానికి వైర మపస
రిల్లును. ౪

ద్వేషము ద్వేషమువలన నెన్నఁటికిని నశింపదు. ప్రేమ
వలననే యది శాంతించును. ఇది సనాతనమైన ధర్మము.

సంసారములోఁ బడి కొట్టుకొనువారు "మనము గూడ
నశించువారమే" యని తలపోయరు. ఆ మర్మము నెఱిఁ
గినవారికి వైరము నశించును. ౬

విషయసుఖముల మరగినవారిని, ఇంద్రియ వివశులను,
భోజనపానములందు నియమములేనివారిని, సోమరులను,
దుర్బలులను, బలహీనమైనవృక్షమును ప్రచండమారు
తము గూలఁద్రోయునట్లు మారుఁడను భూతము పడఁ
గొట్టును. ౭

విషయసుఖములకు లొంగక సంసారమునఁ దిరుగు
చుండువానిని, భోజనపానములందు నియమము గా

వానిని, జితేంద్రియుని, శ్రద్ధాళుని మారుఁడు చెఱుపలేఁడు.
ఇంద్రియములను స్వాధీనపఱుచుకొనఁజాలనివాఁడు పవిత్ర
మైన కాషాయమును గట్టరాదు. అట్లు కట్టఁగోరువాఁడు
నియమమును, సత్యమును వంచించుచున్నాఁడు. ౯

కాషాయము గట్టువాఁడు ఇంద్రియములగెల్చి, సద్గుణము
లు గల్గి,నియమబద్ధుఁడై సత్యవాదియై యుండవలెను.౧౦

సత్యాసత్యముల తారతమ్యమును గుర్తింపలేక సత్యము
నసత్యముగను, అసత్యమును సత్యముగను భ్రమించి
యెంచువాఁడు కేవలము తనకర్మములకు దాసుఁడు. ౧౧

సత్యాసత్యభేదము గుర్తించినవాఁడు, సత్యపదముఁ జేరు
చున్నాఁడు. వాఁడు పవిత్రవృత్తితో జీవించును. ౧౨

చిక్కఁగా నేయని యింటికప్పునుండి వర్షబిందువులులోపలికి
జాఱునట్లు వివేకములేని మనస్సునుండి విషయవాంఛలు
స్రవించును. ౧౩

కలయనేసిన కప్పునుండి వర్షబిందువులు ఇంటిలోనికిఁ
గురియనట్లు వివేకసంపన్నమైన మనస్సునుండి విష
యేచ్ఛలు స్రవింపవు. ౧౪

భిక్షులారా! అకార్యములఁ జేయువారీజన్మమున, ఉత్తర
జన్మమునఁగూడ వ్యసనమందుదురు. తమ దుశ్చేష్టిత
ములు అపుడు తలఁపునకు రాఁగాఁ బశ్చాత్తాపమును
జెందుదురు. ౧౫

సత్కార్మములు సేయువారు ఈజన్మమున నుత్తరజన్మమునఁ గూడ నానందింతురు. ౧౬

కుకర్మములఁ జేయువాఁడు తనమాయికకృత్యముల మాయ ఫలములను జూచుకొని కుమార్గమున నడచుచుండును. వాఁడు తనకుఁదానే వినాశముఁ దెచ్చుకొనును. ౧౭

సత్కార్మములు సేయువారికి వారి శుభకర్మములఫలము గోచరించినపుడు శాంతికలుగును; వారు ధర్మమును జక్కఁగా నిర్వర్తించుచున్నట్లు గుర్తించినపుడు వారింకను నానందించెదరు. ౧౮

అవివేకియగు భిక్షుకుఁడు ధర్మపదము(బుద్ధగీత)లోని శ్లోకములను గంఠస్థముగాఁ బఠించినను ఫలములేదు. తానును దదుక్తధర్మముల నాచరింపవలెను. అట్లు కావింపనివాఁడు భిక్షుపదమును బొందుటకేమాత్రముఁ దగఁడు. ఇతరుల యావులను లెక్కించు గొల్లనివలె నాతఁడు భాగార్హుఁడు గాఁడు. ౧౯

తా నెఱిఁగినది కొంచెమేయైనను నిహపరసౌఖ్యముల యాశలేక రాగద్వేషమోహములను జయించి, తా నుపదేశించుదానిని దాను జక్కఁగా నాచరించువాఁడు జ్ఞానియై మనశ్శాంతి నొందును. అతఁడే భిక్షుపదమున భాగార్హుఁడగును." ౨౦

## అప్పమాదవగ్గో దుతీయో

అప్పమాదో అమతపదం పమాదో మచ్చునోపదం,
అప్పమత్తా నమీయన్తి యేపమత్తా యథా మతా. ౧

ఏతం విసేసతోఞత్వా అప్పమాదమ్హి పండితా,
అప్పమాదే పమోదన్తి అరియానం గోచరే రతా. ౨

తే ఝాయినో సాతతికా నిచ్చం దళ్హ పరక్కమా,
ఫుసన్తి ధీరా నిబ్బాణం యోగక్ఖేమం అనుత్తరం. ౩

ఉట్ఠానవతో సతిమతో సూచికమ్మస్స నిసమ్మకారినో,
సఞ్ఞతస్సచ ధమ్మజీవినో అప్పమత్తస్స యసోభివడ్ఢతి. ౪

ఉట్ఠానేనఽప్పమాదేన సఞ్ఞమేన దమేనచ
దీపం కయిరాథ మేధావీ యం ఓఘో నాభికిరతి. ౫

పమాద మనుయుఞ్జన్తి బాలా దుమ్మేధినో జనా,
అప్పమాదంచ మేధావీ ధనం సేట్ఠంఽవ రక్ఖతి. ౬

మాపమాద మను యుఞ్జేథ మాకామరతిసన్థవం,
అప్పమత్తో హి ఝాయన్తో పప్పోతి విపులం సుఖమ్. ౭

పమాదం అప్పమాదేన యదా నుదతి పణ్డితో,
పఞ్ఞాపాసాద మారుయ్హ అసోకో సోకినం పజం,
పబ్బతట్ఠో ఽవ భుమ్మట్ఠే ధీరో బాలే అవేక్ఖతి. ౮

అప్పమత్తో పమత్తేసు సుత్తేసు బహుజాగరో,
అబలఽస్సంఽవసీఘస్సోఽహిత్వా యాతి సుమేధసో. ౯

అప్పమాదేన మఘవా దేవానం సేట్ఠతం గతో,
అప్పమాదం పసంసన్తి పమాదో గరహితోసదా. ౧౦

అప్పమాదరతో భిక్ఖు పమాదే భయదస్సివా,
సంయోజనం అణుం థూలం డహం అగ్గిఽవ గచ్ఛతి.౧౧

అప్పమాదరతో భిక్ఖు పమాదే భయదస్సివా,
అభబ్బో పరిహానాయ నిబ్బాణస్సేవ సన్తికే. ౧౨

ఇతి అప్పమాదవగ్గో దుతీయో

౨ అప్రమాదవర్గము

ఒకప్పుడు బుద్ధుఁడు ఘోకబోధారామములోఁ దిరుగుచుఁ సోమరులగు కొందఱు భిక్షువులను జూచెను. చూచి వారల కప్రమాదమునుగూర్చి యిట్లుపన్యసించెను:

"ఓ భిక్షులారా! మనుజునకు సత్యవర్తనము నిర్వాణపుం
ద్రోవను జూపుచున్నది. ప్రమాదము మృత్యుసమీప
మునకుం గొంపోవుచున్నది. సత్యసంధు లెన్నఁటికిని నశిం
పరు. ప్రమాదమునకుం బాల్పడినవారు జీవన్మృతులు. ౧

శ్రద్ధయందు ముందుకుంబోవుచు దాని తత్త్వము బాగుగా
గుర్తించినవాఁడు సత్యానందము ననుభవించుచున్నాఁడు.
మఱియు నాతఁడు ప్రాచీనార్యులు కూర్చిపెట్టిన జ్ఞానామృ
తమునుగ్రోలి సుఖించుచున్నాఁడు. ౨

వీనిని ధ్యానించువారు, స్థిరచిత్తులు, ప్రజ్ఞావంతులు,
ధీమంతులు, శక్తిమంతులునైనవారు ఉత్తమోత్తమమైన
నిర్వాణపదమును జేరుచున్నారు. ౩

ప్రబుద్ధుఁడై జాగరూకతతో మెలఁగువాఁడు, పవిత్రమైన
చరిత్రగలవాఁడు, ఆలోచనాపరుఁడు, జితేంద్రియుఁడు,
ధర్మనియమముల ననుసరించువాఁడునైన ధర్మజీవికిఁ గీర్తి
యతిశయించును. ౪

శ్రద్ధాళుఁడు, జితేంద్రియుఁడు, అప్రమత్తుఁడు, స్థిరచిత్తుఁ
డునైనవాఁడు ఉత్కృష్టమైన ద్వీపమును గల్పించుకొను
చున్నాఁడు. భయంకరమైన క్లేశప్రవాహము దానిని ముం
చఁజాలదు. ౫

తళుకుబెళుకు వస్తువులఁజూచి మోహితుఁడై మూర్ఖుఁడు, అల్పబుద్ధి వానివెనువెంటఁ బరుగెత్తుచుండును. శ్రద్ధయే తనకు సర్వోత్కృష్టమైన ఆభరణమని బుద్ధిమంతుఁ డను కొనును. ౬

శ్రద్ధాళుఁడు, ఆలోచనాపరుఁడు, అనంతమైన ఆనంద ము ననుభవించును. కాన, తళుకుబెళుకు వస్తువుల వెం టఁ బరుగెత్తకుఁడు; గుడ్డివారలై విషయసుఖములకుఁ బాల్పడకుఁడు. ౭

సత్యప్రవృత్తివలన వివేకియైనవాఁడు మిథ్యాభిమాన మును బోఁద్రోలుచున్నాఁడు. అతఁడెపుడు నిత్యానందము ననుభవించును. పర్వతశిఖరము నెక్కినధీరుఁడు నేలమీఁ దనున్న బాలకునిఁ జూచినట్లు జ్ఞానప్రాసాద మధిష్ఠించిన యా వివేకి దుఃఖభూయిష్ఠమైన యీ లోకమును జూచు చుండును. ౮

నిద్రించువారిలో మేలుకొనియున్న వానివలెఁ బ్రమాదుల లో నప్రమాది మెలఁగుచుండును. ఉత్తమాశ్వము తట్టుగుఱ్ఱమును దాటిపోవునట్లు పండితుఁ డపండితుల దాటి పోవును. ౯

ప్రజలు ఋజువర్తనమును నుతింతురు. అనృతమును తెగ డుదురు. సత్యచింతనమువలననే మఘవుఁడు దేవాధిపతి

యయ్యెను. అప్రమాదములోఁ దన్మయుఁడై యుండు భిక్షుకుఁడు సోమరితనమునకుఁ బాల్పడఁడు.

ఇది కొంచెపుది, ఇది గొప్పది యనక యతఁడు అగ్నివలె బంధముల నన్నిటిని దహించి పావుకొనును. ౧౦

శ్రద్ధయందే పరమసుఖము కల దనుకొను భిక్షుకుఁడు అలసతకు భయపడుచుండును. అతఁడు పతితుఁడై మూర్ఖుఁ డనిపించుకొనఁడు. దాదాపుగా నతఁడు నిర్వాణపదముఁ జేరియుండును. ౧౧

## చిత్తవగ్గో తతీయో

ఫన్దనం చపలం చిత్తం దురక్ఖం దున్నివారయం,
ఉజుం కరోతి మేధావీ ఉసుకారోఽవ తేజనం. ౧

వారిజోఽవ థలే ఖిత్తో ఓకమోకత ఉబ్భతో,
పరిఫన్దతిఽదం చిత్తం మారధేయ్యం పహాతవే. ౨

దున్నిగ్గహస్స లహునో యత్థకామనిపాతినో,
చిత్తస్స దమథో సాధు చిత్తం దన్తం సుఖావహం. ౩

సుదుద్దసం సునిపుణం యత్థకామనిపాతినం,
చిత్తం రక్ఖేథ మేధావీ చిత్తం గుత్తం సుఖావహం, ౪

దూరఙ్గమం ఏకచరం అసరీరం గుహాసయం,
యేచిత్తం సఞ్ఞమేస్సన్తి మోక్ఖన్తి మారబన్ధనా. ౫

అనవట్ఠితచిత్తస్స సద్ధమ్మం అవిజానతో,
పరిప్లవ పసాదస్స పఞ్ఞా న పరిపూరతి. ౬

అనవస్సుతచిత్తస్స అనన్వాహతచేతసో,
పుఞ్ఞపాప విహీనస్స నత్థి జాగరతో భయం. ౭

కుమ్భూపమం కాయమిమం విదిత్వా
నగరూపమం చిత్తమిదం ఠపేత్వా,
యోధేథ మారం పఞ్ఞాయుధేన
జితంచ రక్ఖే అనివేసనోసియా. ౮

అచిరం బత యం కాయో పఠవిం అధిసేస్సతి,
ఛుద్ధో అపేతవిఞ్ఞాణో నిరత్థంఽవ కళిఙ్గరం. ౯

దిసో దిసం యంతం కయిరా వేరీ వా పన వేరినం,
మిచ్ఛా పణిహితం చిత్తం పాపియో నం తతో కరే. ౧౦

నతం మాతా పితా కయిరా అఞ్ఞేవాపిచ ఞాతకా,
సమ్మాపణిహితం చిత్తం సేయ్యసో నం తతో కరే. ౧౧

ఇతి చిత్తవగ్గో తతీయో

3 చిత్తవర్గము

బుద్ధభగవానుఁ డొకనాఁడు నదీతీరమున శాంతచిత్తుఁడై కూర్చుండియుండెను. అప్పు డొకగృహస్థుఁడు ఏతెంచి "అయ్యా! జినదేవా! చంచలమైన చిత్తమును వశీకరించు టెట్లు? విషయముల నెట్లు నిరోధింపనగును? దానివలనఁ గలుగు లాభనష్టము లెవ్వి? తెలుపవేఁడెదను" అనెను. బోధిసత్త్వుఁ డిట్లనెను.

"చిత్తముచంచలమైనది.ఒక్కచోఁ గుదురుకొనియుండదు. దాని నిరోధించుట కఠినమైనకార్యము. అయితే వింటిని నిర్మించువాఁడు నేదుఱును దనయిచ్ఛవచ్చినట్లు వంచుకొనురీతిని బుద్ధిమంతుఁడు చిత్తమును దన యిచ్ఛవచ్చినట్లు త్రిప్పుకొనును. ౧

మత్స్యములు వానియునికిపట్టైన జలమునుండి యెత్తి మెట్టపైఁ బెట్టినప్పుడు గిలగిల కొట్టుకొనునట్లు మారునివలనుండి తప్పించుకొనుటకు మనచిత్తముగూడఁ బరితపించుచుండును. ౨

మనమును వశీకరించుకొనుట సర్వోత్కృష్టమయినది. చంచలమైన మనము నెవరు కష్టపడి వశీకరించుకొందురో వారి యిచ్ఛానుసార మది వర్తించుచుండును. వశ్యమైన మనము సౌఖ్యమును గల్పించును. ౧

బుద్ధిమంతుఁడు సూక్ష్మమార్గమునఁ బ్రవర్తించునది, కుటిలమైనది, స్వేచ్ఛావ్యాపారము గలది యైన మనమును దప్పుదారిని బోనీక రక్షించుకొనవలెను. సురక్షితమైన చిత్తము సుఖముల నిచ్చును. ౪

మనము మిగుల భ్రాంతికిఁ బాల్పడుచుండును; ఒంటరిగాఁ దిరుగుచుండును. దానికి రూపములేదు. అది హృదయకుహరములో నడఁగియుండును. ఇట్టిమనమును వశీకరించు

కొనువాఁడు మారునివలలోనుండి బయలుపడు
చున్నాఁడు. ౩౭

చిత్తమును స్థిరీకరింపలేనివాఁడు, సద్ధర్మములఁ దెలిసికో
లేనివాఁడు, మనశ్శాంతిలేనివాఁడు, ఎన్నఁటికిని జ్ఞానపరి
పూర్ణుఁడు కాఁజాలఁడు. ౩౮

రాగములఁ దగులుకొననివాఁడు, చిత్తాందోళనములేని
వాఁడు, కీడుమేళ్లయందంటుకొననివాఁడు, శ్రద్ధాళుఁడు
నగువాని కెట్టిభయమును గలుగదు. ౩౯

ఈశరీరము కుండవలె క్షణములో నశించునదని తెలిసికొని
మానవుఁడు దిట్టమైన మనోదుర్గమును నిర్మించుకొని,
జ్ఞానశస్త్రమును జేఁపట్టి మారుని మార్కొనవలెను.
తిరిగి వానిని జేరరానీయకుండ జాగ్రత్తతో మెలఁగు టవ
సరము. ప్రమాదపడి దానిని నిర్లక్ష్యము సేయరాదు. ౪౦

అయ్యో! కాలమును వ్యర్థపరుపకుఁడు ఈశరీరము పృథ్వి
లో ఊలిపోయినకట్టెవలెఁ బనికిమాలినది, సద్విచారము
లులేనిది, అవమానితమైనది అయి నశించుచున్నది. ౪౧

ద్వేషి ప్రతిద్వేషికిఁ జేయు నపకారముకంటె వంకరటింకరగాఁబోవు చిత్తమే అధికముగా మనుజునకు హాని చేయును. ౧౦

సుశిక్షితమై చిత్తము మనుజునకు మేలుచేయునట్లు తండ్రిగాని తల్లిగాని బంధువర్గముగాని చేయలేదు." ౧౧

## పుప్ఫవగ్గో చతుత్థో

కో ఇమం పఠవిం విజేస్సతి
యమలోకంచ ఇమం సదేవకం
కో ధమ్మపదం సుదేసితం,
కుసలో పుప్ఫమివ పచేస్సతి. ౧

సేఖో పఠవిం విజేస్సతి,
యమలోకంచ ఇమం సదేవకం,
సేఖో ధమ్మపదం సుదేసితం
కుసలో పుప్ఫమివ పచేస్సతి. ౨

ఫేణూపమం కాయ మిమం విదిత్వా
మరీచిధమ్మం అభిసమ్బుధానో,
ఛేత్వాన మారస్స పపుప్ఫకాని
అదస్సనం మచ్చురాజస్స గచ్ఛే. 3

పుప్ఫాని హేవ పచినన్తం వ్యాసత్తమనసం నరం,
సుత్తంగామంమహోఘోఽవమచ్చు ఆదాయ గచ్ఛతి. ౪

ధమ్మపదము

పుప్ఫాని హేవ పచినన్తం బ్యాసత్తమనసం నరం,
అతిత్తం యేవ కామేసు అన్తకో కురుతే వసం. ౫

యథాఽపి భమరో పుప్ఫం వణ్ణగన్ధం అహేఠయం,
పలేతి రస మాదాయ ఏవం గామే ముని చరే. ౬

న పరేసం విలోమాని న పరేసం కతాకతం,
అత్తనోఽవ అవేక్ఖేయ్య కతాని అకతానిచ. ౭

యథాఽపి రుచిరం పుప్ఫం వణ్ణవన్తం అగన్ధకం,
ఏవం సుభాసితా వాచా అఫలా హోతి అకుబ్బతో. ౮

యథాఽపి రుచిరం పుప్ఫం వణ్ణవన్తం సగన్ధకం,
ఏవం సుభాసితా వాచా సఫలా హోతి సకుబ్బతో. ౯

యథాఽపి పుప్ఫరాసిమ్హా కయిరా మాలాగుణే బహూ,
ఏవం జాతేన మచ్చేన కత్తబ్బం కుసలం బహుం. ౧౦

న పుప్ఫ గన్ధో పటి వాత మేతి
[illegible] తగరం మల్లికా వా.

సతంచ గన్ధో పటివాత మేతి
సబ్బా దిసా సప్పురిసో పవాతి. ౧౧

చన్దనం తగరం వాపి ఉప్పలం అథ వస్సికీ,
ఏతేసం గన్ధ జాతానం సీలగన్ధో అనుత్తరో. ౧౨

అప్పమత్తో అయం గన్ధో యాయం తగర చన్దనీ,
యోచ సీలవతం గన్ధో వాతి దేవేసు ఉత్తమో. ౧౩

తేసం సమ్పన్న సీలానం అప్పమాద విహారినం,
సమ్మదఞ్ఞావిముత్తానం మారో మగ్గం నవిన్దతి. ౧౪

యథా సఙ్కారధానస్మిం ఉజ్ఝితస్మిం మహాపథే,
పదుమం యత్థ జాయేథ సూచిగన్ధం మనోరమం. ౧౫

ఏవం సఙ్కారభూతేసు అన్ధభూతే పుథుజ్జనే,
అతిరోచతి పఞ్ఞాయ సమ్మాసమ్బుద్ధ సావకో. ౧౬

ఇతి పుప్ఫవగ్గో చతుత్థో

## ౪ పుష్పవర్గము

వసంతఋతువు సౌభాగ్యవహముగానుండెను. అపుడు భిక్షువులు గురువుతోఁగూడి బింబిసారుని తోఁటలో వసించుచుండిరి. పుష్పములు పరిమళించుచుండెను. తేనెటీగలు ఒకపుష్పమునుండి మఱొకపుష్పముపై కెగయుచు మధుసంగ్రహము చేయుచుండెను. సూర్యభగవానుని నిర్మలతేజము తూర్పుదిశను వ్యాపించుచుండెను. ఆసమయమున బుద్ధదేవుఁడు శిష్యుల కిట్లుపదేశించెను:

"భూలోకమును, యమలోకమును, దేవలోకమును, జయింపఁగలవాఁడెవ్వఁడు? ఉపయుక్తములైన పుష్పములను వెదకి తెచ్చినట్లు సచ్ఛీలమునకుసూటియైన మార్గమును వెదకి కనుఁగొనఁగలవాఁడెవ్వఁడు? ౧

ముక్తసంగుఁడైన పురుషుఁడే పృథ్వీలోక యమలోక దేవలోకములను జయింపఁగలఁడు. కుశలుఁడు తనమనస్సునకెక్కిన మంచి పూవులను వెదకి తెచ్చునట్లాతఁడు సచ్ఛీలమునకుఁ జక్కని త్రోవఁదీయును. ౨

విజ్ఞాననేత్రమును విప్పిచూచి 'శరీరము నీటిబుడగవలె క్షణభంగురమైనది; మృగతృష్ణవంటిది' అని తెలిసికొన్న వాఁడు మారుని ప్రమోహములలోఁ గూలక అమృత పదముఁ జేరుచున్నాఁడు. 3

నిద్రించుచున్న గ్రామమును వెల్లువ ముంచివేయునట్లు, ఐహికేచ్ఛలను పూవులను సేకరించుటకే తంటాలు పడు చుండు చంచలచిత్తుని మృత్యువు గ్రహించును. ४

పూవులను వెదకువాఁడు, విషయపరాయణుఁడు, ఉన్మ త్తుఁడునైనవానికోర్కెలు సిద్ధింపకమున్నె వాఁడు మృత్యు దేవత వదనగహ్వరమునఁ బ్రవేశించుచున్నాఁడు. ౫

తేనెటీగ పుష్పములరంగుగాని సుగంధముగాని చెఱుప కుండ నెట్లు మధువును సంగ్రహించుచుండునో భిక్షు కుఁడు గ్రామములో అట్లు నివసింపలేఁడు. ౬

భిక్షుకుఁడు ఇతరులనైచ్యములను, పాపకృత్యములను, అకృత్యములను వెదకుచుండరాదు. అవి తనయందు లేకుం డునట్లు సదా శ్రద్ధాళుఁడై చూచుకొనుచుండవలెను. ౭

సుగంధములేని పుష్పము మంచిరంగు గలిగి మనోహరము గానున్నను వ్యర్థమైనట్లు తాను జెప్పినవి చేఁతలలోఁ జూపనివానిపలుకు లెంత మంచివైనను నిష్ప్రయోజనములు. ౮

సుగంధము, సుందరమునైన పుష్ప మట్లు సార్థకమై విరాజిల్లును చెప్పినట్లు చేయువాని వాక్యము. ౯

పుష్పరాశినుండి పూవులఁగొని మాలను గూర్చునట్లు మానవుఁడు జన్మముతో నున్నందుకు సుగుణముల నేర్చియేర్చి కూర్చుకొనవలెను. ౧౦

చందనము, తగరము, మల్లిక వీనిసుగంధము సుగంధము కాదు. పూవులతావి గాలి కెదురీద లేదు. సుజనుల యశఃపరిమళము ప్రచండవాయువునుగూడ ప్రయ్యాలాడుకొని యెదురేగును. అదియే సర్వవ్యాప్త మగునది.

చందనముతోఁ గాని, తగరకమలపుష్పములతోఁ గాని, ఇతరములగు నేసుగంధద్రవ్యముతోఁగాని తూఁచిచూచిన-చో సుజనసుగంధమే అతిశయించును. ౧౧

చందనాదుల సుగంధము తుచ్ఛమైనది. సజ్జనుని శీల సుగంధసంచయమే సర్వోత్కృష్టమైనది. అదియే దేవలోకమువఱకు వ్యాపించునది. ౧౩

సచ్చరిత్రులు, అప్రమాదులు, వివేకసంపన్నులు, సత్యమైన జ్ఞానధనము నార్జించుకొని బంధనములఁ ద్రెంచుకొనిన వారు నగు వారివద్దకైన మారుఁడును చేరఁజాలఁడు. ౧౪

బాటలోఁ బారవైచిన చెత్తచెదారపుఁ గుప్పలోఁ బుట్టిన నలినముగూడ సుగంధము గలదైనట్లు అజ్ఞానులు అసచ్చరిత్రులునైన సామాన్యమానవులలోఁ దిరుగాడుచున్నను బౌద్ధభిక్షువు తనసత్యమైన జ్ఞానప్రభావముచేత శోభించును.”

## బాలవగ్గో పఞ్చమో

దీఘా జాగరతో రత్తి దీఘం సన్తస్స యోజనం,
దీఘో బాలానం సంసారో సద్ధమ్మం అవిజానతం. ౧

చరంచే నాధిగచ్ఛేయ్య సేయ్యం సదిసమత్తనో,
ఏకచరియం దళ్హం కయిరా నత్థి బాలే సహాయతా. ౨

పుత్తా మత్థి ధనం మత్థి ఇతి బాలో విహఞ్ఞతి,
అత్తా హి అత్తనో నత్థి కుతో పుత్తా కుతో ధనం. 3

యో బాలో మఞ్ఞతి బాల్యం పణ్డితో వాపి తేన సో,
బాలో చ పణ్డితమానీ స వే బాలోతి వుచ్చతి.

యావజీవమ్పి చే బాలో పణ్డితం పయిరుపాసతి,
ఖిప్పం ధమ్మం విజానాతి దబ్బీ సూపరసం యథా ౫

ముహుత్తమపి చే విఞ్ఞూ పణ్డితం పయిరుపాసతి,
నసో ధమ్మం విజానాతి జివ్హా సూపరసం యథా. ౬

చరన్తి బాలా దుమ్మేధా అమిత్తేనేవ అత్తనా,
కరోన్తా పాపకం కమ్మం యం హోతి కటుకప్ఫలం. ౭

నతం కమ్మం కతం సాధు యంకత్వా అనుతప్పతి,
యస్స అస్సు ముఖో రోదం విపాకం పటిసేవతి. ౮

తంచ కమ్మం కతం సాధు యం కత్వా నానుతప్పతి,
యస్స పతీతో సుమనో విపాకం పటిసేవతి. ౯

మధు వా మఞ్ఞతీ బాలో యావ పాపం నపచ్చతి,
యదాచ పచ్చతీపాపం అథబాలో దుక్ఖం నిగచ్ఛతి. ౧౦

మాసే మాసే కుసగ్గేన బాలో భుఞ్జేథ భోజనం,
నసోసఙ్ఖత ధమ్మానం కలం అగ్ఘతి సోళసిం. ౧౧

నహి పాపం కతం కమ్మం సజ్జుఖీరంవ ముచ్చతి,
డహన్తం బాల మన్వేతి భస్మచ్ఛన్నోవ పావకో. ౧౨

యావదేవ అనత్థాయ ఞత్తం బాల స్సజాయతి,
హన్తి బాలస్స సుక్కంసం ముద్ధ మస్స విపాతయం. ౧౩

అసతం భావన మిచ్ఛేయ్య పురేక్ఖారంచ భిక్ఖుసు,
ఆవాసేసుచ ఇస్సరియం పూజా పరకులేసుచ. ౧౪

మమేవ కత మఞ్ఞన్తు గిహీ పబ్బజితా ఉభో,
మమేవ అతివసా అస్సు కిచ్చాకిచ్చేసు కిస్మిచి,
ఇతి బాలస్స సఙ్కప్పో ఇచ్ఛామానోచ వడ్ఢతి. ౧౫

అఞ్ఞాహి లాభూపనిసా అఞ్ఞా నిబ్బానగామినీ,
ఏవ మేతం అభిఞ్ఞాయ భిక్ఖు బుద్ధ స్సావకో;
సక్కారం నాభి నన్దేయ్య వివేక మనుబ్రూహయే. ౧౬

ఇతి బాలవగ్గో పఞ్చమో

## ౫ బాలవర్గము

ఆనందుఁడు శాక్యముని బుద్ధునితోఁ గూడ నున్నప్పుడిట్లు విన్నవించెను. "మహాత్ముఁడా, గురుస్వామీ! మూర్ఖుఁడన నెట్టివాఁడు? కేవలముగా జనులు ఒకఁడు నొకఁడిమాటల నేల మన్నింపక యితరుని మూర్ఖుఁ డనుచుందురు? సత్యముగా నీవాక్య మేయర్థమునందుఁ బ్రయోగింపఁ దగినది? కృపతో దీనినిఁ దెల్పి చెప్ప వేఁడెదను."

అంత బుద్ధదేవుఁడు

"ఆనందా! మేలుకొని యున్న రాత్రి బహుదీర్ఘమనిపించును గదోయీ! అలసి యున్న వానికొక యడుగు పెట్టుట కూడ దుస్సహమే. ధర్మమెఱుఁగని మూర్ఖునకు జీవిత కాలము బహుదుర్భరముగఁ గడచును. ౧

నెరువరికిఁ ద్రోవలోఁ దనకన్న దారి తెలిసినవాఁడు దొరకఁడనుకో; అప్పుడు వాఁడు ధైర్యముతో నొంటరిగనే ప్రయాణము చేయవలెఁగదా! అట్లే తనకన్న బుద్ధిమంతుఁడు దొరకనిచో మొదట నొంటరిగానే సత్పదయాత్ర సాగింపవలెను. మూర్ఖునితోఁగూడి మాత్రము పోవరాదు సుమా! ౨

'పిఁడు నాబిడ్డ, ఇది నాధనము' అనుకొనుచు మూర్ఖుఁడు వ్యసనపడుచుండును. వాని శరీరముగూడ వాస్తవములో వానిది కాదే. ఇఁక సంతానము, ధనము, ఎంతవఱకు వాని నంటఁబెట్టుకొని యుండును? 3

తన మూర్ఖత్వము గుర్తింపఁగలిగిన మూర్ఖుఁడే బుద్ధిమంతుఁడు. తన్నుఁదాను బుద్ధిమంతుఁడనుకొను మూర్ఖుఁడే నిశ్చయముగా మూర్ఖుఁడు. ౪

పప్పు కూరలలో నెప్పుడును నానుచుండియును తెడ్డువాని రుచిని తెలిసికొనలేనట్లు మూర్ఖుఁడు జీవితకాలమంత యును సజ్జనసాంగత్య మొనర్చినను ధర్మము నెఱుఁగఁ జాలఁడు. ౫

నాలుక రసములు దగిలినంతనే వానిరుచిని గ్రహించును. అట్లే, వివేకి యొకనిమిషమాత్రము సజ్జనసాంగత్య మొనర్చినను అతి శీఘ్రముగా సత్యపథమును గనుఁ గొనుచున్నాఁడు. ౬

అల్పబుద్ధికి వానిపహాఖ్యమే స్వయముగ శత్రువై వానిని దుర్గతిలోఁ ద్రోయుచున్నది. అది విషఫలితములైన కార్య ములఁ జేయించుచున్నది. ౭

కాన, ఏకార్యముఁ జేసినపిదపఁ గరములు గలుషము లగునో, ఏకార్యఫల మనుభవించవలసినప్పుడు కన్నీరు కార్చవలసివచ్చునో, అది నిజముగా శ్రేష్ఠమైనధర్మము కాదనవలెనుగదా ! ౮

ఏకార్యము చేసినపిదపఁ బశ్చాత్తాప ముదయింపదో, ఏకార్యఫలము ననుభవించునపుడు మహాదానందము గలుగునో అది శ్రేష్ఠమైనదిగదోయీ! ౯

దుష్కార్యములఫలము ప్రచురము గానంతవఱకు మూర్ఖుఁడు వానితీపు మరిగి, అదియే తేనెవట్టుగాఁ దలఁచి 'హాయిహాయి'అనుకొనుచుండును. ఆ కృత్యములు పండి పాపఫలముఁగట్టి కుడుపుచున్నప్పుడు వాఁడు తలమోదుకొనుచుఁ బశ్చాత్తాపపడును. ౧౦

మూర్ఖుఁడు త్యాగివలె నెలనెలకుఁ గుశాగ్రముతోఁ దిండి తినుచున్నను వాఁడు చక్కఁగా ధర్మపథమునఁ జరించు పురుషునకుఁ బదాఱవపాలుగూడ నీడు గాలేఁడు. ౧౧

అప్పుడే పిండినపాలు వెంటనే పెరుగు కానట్లు కుకర్మముల ఫలము వెంటనే యనుభవమునకు రాదు. నివురు గప్పిన నిప్పువలె నది దహించుచును. అది మూర్ఖుని వెన్నంటియే యుండును. ౧౨

మఱియుఁ గుకర్మముల పాపఫలము బయల్పడనంతవఱకు మూర్ఖుఁడు చింతచీకు లేకుండును. కాని తన యాదృష్టములఁగూడ మట్టిలోఁ గలుపుకొనుచున్నాఁడోయీ! దుఃఖములలోఁ జిక్కుకొని చితికి పోవుచున్నపుడు వానితల తిరుగుచున్నా! ౧౩

మూర్ఖుఁడు తనతల కుమించిన కీర్తికొఱకుఁ దంభాలు పలుకును. భిక్షువులలోఁ బెద్దఱికము సంపాదించుటకు వాఁడు తన్మయుఁడై పాటుపడును. వాఁడు మఠాధిపత్యమునకు వెంపరలాడును. ఇతరులచేతఁ బూజనొందుటకు వాఁడు తహతహలాడును. ౭౩

గృహస్థులలోఁగాని సన్న్యాసులలోఁగాని "ఈపని చేసితిని. ఇది చేయలేదు. వీరు నాయుత్తరువు నందుకొఱకు ననుసరించి నడచుకొందురు" అను తలంపు కలుగుటవలన మూర్ఖునకు అహంకార మతిశయించును. ౭౪

ఒకత్రోవ ధనము చేకూర్చును, మఱియొకత్రోవ నిర్వాణము నకుఁ గొనిపోవుచున్నది. వాని యాథార్థ్యమును గుర్తించిన బౌద్ధభిక్షువులు పేరుప్రతిష్ఠలకుఁ బాటుపడరు. సంసారబంధముల నుండి బయటఁబడుటకే వారు నిరంతరముఁ బ్రయత్నించెదరు."

---

## పణ్డితవగ్గో ఛట్ఠో

నిధీనంఽవ పవత్తారం యం పస్సే వజ్జదస్సినం,
నిగ్గయ్హవాదిం మేధావిం తాదిసం పణ్డితం భజే;
తాదిసం భజమానస్స సేయ్యో హోతి సపాపియో. ౧

ఓవదేయ్యానుసాసేయ్య అసబ్భాచ నివారయే,
సతంహి సో పియో హోతి అసతం హోతి అప్పియో. ౨

నభజే పాపకే మిత్తే నభజే పురిసాధమే,
భజేథ మిత్తే కల్యాణే భజేథ పురిసుత్తమే. ౩

ధమ్మపీతి సుఖం సేతి విప్పసన్నేన చేతసా,
అరియప్పవేదితే ధమ్మే సదా రమతి పణ్డితో. ౪

ఉదకం హి నయన్తి నేత్తికా
    ఉసుకారా నమయన్తి తేజనం,
దారుం నమయన్తి తచ్ఛకా
    అత్తానం దమయన్తి పణ్డితా.

సేలో యథా ఏకఘనో వాతేన నసమీరతి,

ఏవం నిన్దాపసంసాసు న సమిఞ్జన్తి పణ్డితా. ౬

యథాఽపి రహదో గంభీరో విప్పసన్నో అనావిలో,

ఏవం ధమ్మాని సుత్వాన విప్పసీదన్తి పణ్డితా. ౭

సబ్బత్థ వే సప్పురిసా చజని

న కామకామా లపయన్తి సన్తో,

సుఖేన ఫుట్ఠా అథవా దుఖేన

న ఉచ్చావచం పణ్డితా దస్సయన్తి. ౮

న అత్తహేతు నపరస్స హేతు

నపుత్తమిచ్ఛే నధనం రట్ఠం,

నఇచ్ఛే అధమ్మేన సమిద్ధిమత్తనో

ససీలవా పఞ్ఞవా ధమ్మికో సియా. ౯

అప్పకా తే మనుస్సేసు యే జనా పారగామినో,

అథాయం ఇతరా పజా తీరమేవానుధావతి. ౧౦

యేచ ఖో సమ్మదక్ఖాతే ధమ్మే ధమ్మానువత్తినో,
తే జనా పారమేస్సన్తి మచ్చుధేయ్యం సుదుత్తరం. ౧౧

కణ్హం ధమ్మం విప్పహాయ సుక్కం భావేథ పణ్డితో,
ఓకా అనోకం ఆగమ్మ వివేకే యత్థ దూరమం. ౧౨

తత్రాభిరతి మిచ్ఛేయ్య హిత్వా కామే అకిఞ్చనో,
పరియోదపేయ్య అత్తానం చిత్తక్లేసేహి పణ్డితో. ౧౩

యేసం సమ్బోధి అఙ్గేసు సమ్మా చిత్తం సుభావితం,
ఆదానపటినిస్సగ్గే అనుపాదాయ యే రతా,
ఖీణాసవా జుతీమన్తో తే లోకే పరినిబ్బుతా. ౧౪

ఇతి పణ్డిత వగ్గో ఛట్ఠో

## ౬ పండితవర్గము

బుద్ధుఁడొకనాఁడు మహాసభలోఁ గూర్చుండియుండఁగా నొకబ్రాహ్మణుఁడు వచ్చి నమస్కరించి "పరివ్రాజక ప్రవరా! పండితుని, జ్ఞానిని గూర్చి కొంచె ముపన్యసించి మమ్ముఁ బవిత్రీకరింప వేఁడెదను. వీరి నేలక్షణములు

వలనఁ దెలిసికొనవలెను? జ్ఞానమార్గము నెట్లెఱుఁగ వలెను." అని యడిగెను.

అంత భగవానుఁ డిట్లనెను:

"బుద్ధిమంతునితో స్నేహముగలిగెనేని యది సత్యపదముఁ జేరుటకు దారిఁదీయును. మనుజుఁడు మానుకొనవలసిన యలవాటుల నెత్తిచూపుచుఁ దాను వానికి లొంగకుండు జ్ఞానిని సేవింపుఁడు. వాని యనుసరణము శ్రేయస్కరము; హాని గలిగింపదు. ౧

నిన్ను తిరస్కరించు సత్యములను జూపుఁడు; వాని యుపదేశములను వినుఁడు; మీలో దీనదశలో నొకఁడు దోషముకు లున్నచో వానిని సరిదిద్దుకొనుఁడు. మంచివారు వీని నిట్లు ప్రేమించెదరు. చెడ్డవారు వీనిని సహింపక ప్రేమతో సత్కరించరు. ౨

దురాచారులతోఁ జెలిమి చేయకుము. అట్టి నీచులను నీతోఁ గలియనీయకుము. సత్పురుషులతోఁగూడ మైత్రి నెఱపుము. సర్వోత్కృష్టులైన వారినే నీతోఁ గలియనిమ్ము. 3

జ్ఞానానందముతో నుబ్బి తబ్బిబ్బు లగుచుండువానికిఁ జిత్తము నిలుకడఁగానుండును. వాఁడే నిర్విచారముగా సుఖించుచున్నాఁడు. ఆర్యులు త్రొక్కిచూచి వినిపించిన యుపదేశములే పవిత్రమైనవి. అట్లు నడచుకొను మునులు పరమానందము ననుభవించుచున్నారు. ౪

కాలువ త్రవ్వుకొన్నవాఁడు వాని యిచ్చవచ్చినట్లు నీరును త్రిప్పుకొని పోవుచున్నాఁడు. విల్లుచేయువాఁడు తనయిచ్ఛ వచ్చినరీతి వెదురుకఱ్ఱలను వంచుకొనుచున్నాఁడు. వడ్రంగి కొయ్యను సవరించుకొనుచున్నాఁడు. అట్లె బుద్ధిమంతుఁడు తన్నుఁ దా వశీకరించుకొనుచున్నాఁడు. ౫

పెద్దకొండ సుడిగాలికిఁగూడఁ జలింపక నిలుచునట్లు బుద్ధిమంతుఁడు నిందాస్తుతులకుఁ జలింపఁడు.

పండితుఁడు ధర్మోపదేశములు వినినపిదప, గంభీరము, నిశ్చలము, నిర్మలమునైన సరోవరమువలె ప్రశాంతుఁడై యుండును. ౭

సత్పురుషులు విషయసుఖములనుండి వెనుదిరుగుటకుఁ బ్రయత్నింతురు. ఎన్నివిఘ్నము లెదుర్కొన్ననుసరే

వారు వారి కార్యములను విడువక కొనసాగించుచుందురు. వారు కొంగజపములు జేయరు. సుఖసారము ననుభవించుచున్నవారు వారే సుమీ! జ్ఞాని సుఖమునకు గర్వింపడు; దుఃఖమునకు నుద్వేగమొందడు. ౮

స్త్రీని, సంతానమును, ధనమును, ఐశ్వర్యమును, అభిలషింపనివాడు, అనౌచిత్యముగా ఉన్నతుడగుటకు కువ్విళ్లూరనివాడు ఎవ్వడో వాడు సాధువు, జ్ఞాని, ధర్మవేత్త.

లోకములో భవపారావారము దాటి అర్హత్ (పరిపూర్ణజ్ఞాన)పదముజేరినవారు అరుదుగా నున్నారు. పెక్కుమంది సంసారసాగరపు టీద్దరిని గొట్టుకొనుచున్నవారే.

కనుక ధర్మరహస్యము నెఱిగి దాని ననుసరించువారు దుస్తరమైన యమ లోకమును గూడ దాటిపోవుచున్నారు. ౧౧

జ్ఞాని సాధారణమైన కృష్ణధర్మ (కాయదుశ్చరిత) మను సాధారణదశతో బట్టుబోసికొనుటను మాని ప్రకాశవంతమైన శుక్లధర్మము (కాయసుచరితము) నాశ్రయించి జీవయాత్ర సాగింపవలెను. భిక్షుకవృత్తిని స్వీకరించినపుడు

హాఁ డేకాంతమునందుఁగూర్చుండి పరిపూర్ణానందస్వరూ
పమును భావించుకొనుచుండవలెను. సర్వవిధములైన
సంసారసుఖములను బాపుకొని యిల్లులేనివారికిఁ దన
యింటి నొసంగి ప్రాపంచిక సుఖములఁ బరిత్యజించి అనంత
మైన సుఖమునిచ్చెడి యేకాంతవాసమొసఁగుచున కించ
నుఁడై పంచవిధక్లేశములను బాపుకొని, దేని నాసింపక
తన్ను దాను దరింపఁజేసికొనుటనుగూర్చియే చింతించు
చుండవలెను. ౧౨

ఎవని హృదయక్షేత్రమున సంబోధితత్త్వము లేదును
నాటుకొని వికసించునో, ఎవరు ఏవస్తువునందును ఆస
క్తులుగాక నిర్వృతినే సుఖదాయినిగాఁ దలంచువారో,
వారు విషయవికారములను జయించినవారు; వారు పరి
పూర్ణజ్ఞానము గలవారు; వారుగదా లోకములో జీవన్ము
క్తులు!” ౧౩

## అరహన్తవగ్గో సత్తమో

గతద్ధినో విసోకస్స విప్పముత్తస్స సబ్బధి,
సబ్బగన్థప్పహీనస్స పరిళాహో న విజ్జతి. ౧

ఉయ్యుఞ్జన్తి సతీమన్తో న నికేతే రమన్తి తే,
హంసాఽవ పల్లలం హిత్వా ఓకమోకం జహన్తి తే. ౨

యేసం సన్నిచయో నత్థి యే పరిఞ్ఞాతభోజనా,
సుఞ్ఞతో అనిమిత్తో చ విమోక్ఖో యస్స గోచరో;
ఆకాసేఽవ సకున్తానం గతి తేసం దురన్నయా. 3

యస్సాసవా పరిక్ఖీణా ఆహారే చ అనిస్సితో,
సుఞ్ఞతో అనిమిత్తో చ విమోక్ఖో యస్స గోచరో;
ఆకాసేఽవ సకున్తానం పదం తస్స దురన్నయం. ౪

యస్సిన్ద్రియాని సమథం గతాని
అస్సా యథా సారథినా సుదన్తా,
పహీణమానస్స అనాసవస్స
దేవాఽపి తస్స పిహయన్తి తాదినో. ౫

పఠవీ సమో నో విరుజ్ఝతి
ఇన్దఖీలూపమో తాది సుబ్బతో,
రహదోవ అపేతకద్దమో
సంసారా న భవన్తి తాదినో. ౬

సన్తం తస్స మనం హోతి సన్తా వాచా చ కమ్మ చ,
సమ్మదఞ్ఞా విముత్తస్స ఉపసన్తస్స తాదినో. ౭

అస్సద్ధో అకతఞ్ఞూ చ సన్ధిచ్ఛేదో చ యో నరో,
హతావకాసో వన్తాసో స వే ఉత్తమపోరిసో. ౮

గామే వా యది వారఞ్ఞే నిన్నే వా యది వా థలే,
యత్థారహన్తో విహరన్తి తం భూమిం రామణేయ్యకం.

రమణీయాని అరఞ్ఞాని యత్థ న రమతీ జనో,
వీతరాగా రమిస్సన్తి న తే కామగవేసినో.

ఇతి అరహన్తవగ్గో సత్తమో

## ౭. అర్హతవగ్గము

ఒకనాఁడు సూర్యాస్తమయ మగుచుండఁగా బుద్ధుఁడొక గ్రామమునకుఁ బోయెను. అక్కడి ప్రజలు భగవానుని ఉపదేశమును విను కుతూహలముతో గుమిగూడిరి. అతఁడానాఁడు కొంచె మెక్కుడగా నడచినట్లాతని ముఖవైఖరి తెలుపుచుండెను. జనము శ్రద్ధతో నాతని పాదములఁ బ్రక్షాళించిరి. ఆతఁడు కరములను వదనమును ప్రక్షాళనము చేసికొనకముం దిట్లుపన్యసించెను:

"ఈ లోకయాత్రను (సాంసారికయాత్రను) ముగించుకొన్నవారు, చింతలఁ బాపుకొన్నవారు, సర్వవిధముల నాత్మను వశీకరించుకొన్నవారు, సర్వబంధముల సడలించుకొన్నవారు, కష్టములఁగడచి గట్టుకెక్కుచున్నారు. ౧

వారు సంసారమున సారము (సుఖము) లేదని దృఢముగా నిశ్చయించుకొని రాజహంసము బురదమడుగును విడిచి పోవునట్లు గృహమును త్యజించుచున్నారు. ౨

ధనముఁ గూర్చుకొనక దేహరక్షణకొఱకు పరు లొసంగెడు సామాన్యమైన యాహారమును మాత్రము కొద్దిగా భుజించుచు, అనఁగా—జీవధారణము కొఱకుమాత్రమే

తినవలెఁగాని తిండికొఱకే బ్రతుకరాదను భావముగల వాఁడై కాలము పుచ్చుచుండువాఁ డెవఁడో వాఁడు సమగ్రముగా నాత్మను వశీకరించుకొని నిర్వాణముఁ జేరుచున్నాఁడు. ఆకాశమునఁ దిరుగుచుండు పక్షిగమనమట్లు వానివ్యాపారముగూడ దురూహ్యము.

ఆసవచతుష్టయము నడఁచుకొన్నవాఁడు, భోగముల ననుభవించుటలోఁ బ్రొద్దు పుచ్చుచుండనివాఁడు ఎవఁడో వాఁడు చిత్తమును జిక్కఁబట్టి నిర్వాణముఁ జేరుచున్నాఁడు. గాలిలోఁ దిరుగు పక్షిగమనమట్లు వాని వ్యాపారముగూడ దురూహ్యము. ౪

రౌతు గుఱ్ఱమును సుశిక్షితముగఁ జేయునట్లు యింద్రియములను స్వాధీనపఱచుకొన్నవానితో, అభిమానము నడఁచుకొన్నవానితో, కోరికల దూరీకరించుకొన్న వానితో దేవతలుగూడ స్పర్ధించి నిలువఁ జాలరు. ౫

దీక్షతో నిట్లాచరించునరుఁడు భూదేవియట్లు సహనశీలమున కలవాటుపడును. నిర్మలసరోవరమట్లాతఁడు నిరంతరము ప్రశాంతుఁడై యుండును. పునర్జన్మమునకు వాఁడు పాల్పడఁడు. ౬

వానిచిత్తము, వాక్కులు, కృత్యములు ప్రశాంతము
లైనవి. అవి పరులను బాధింపవు. నిక్కమయిన జ్ఞానము
వలన పాపములను బాపుకొన్న స్వాతంత్ర్యపురుషుని యనఁ
బడును. ౭

వెఱ్ఱినమ్మకము లేనివాఁడు, సృష్టి కతీతమయిన వస్తువును
నిర్వాణమును గుర్తించినవాఁడు, సర్వకర్మ బంధములను
సడలించుకొనినవాఁడు, విలాసము లన్నియు విసర్జించిన
వాఁడు, కోరికలన్నియు దూరీకరించినవాఁడు ఎవఁడో
వాఁడుకదా సర్వోన్నతుఁడగు మానవుఁడు! ౮

గ్రామమైననేమి? వనమైననేమి? జలమైననేమి? స్థల
మైననేమి? ముక్తుఁడగు పురుషుఁ డెక్కడ వసించునో యా
చోటే ఆనందసంధాయకము; ఆచోటే సుందరమణీయము.

సంసారములఁ దిరుగాడువారికిఁ బ్రియములుగాని అరణ్య
ప్రదేశములే నిర్వికారులకు సుఖావహస్థలములు. నిర్వికార
పురుషులు బాహ్యసుఖముల నపేక్షించనివారుకదా! కాన
నే వారు గహనప్రదేశములను బ్రేమింతురు."

## సహస్సవగ్గో అట్ఠమో

సహస్సమపి చే వాచా అనత్థపదసంహితా,
ఏకం అత్థపదం సేయ్యో యం సుత్వా ఉపసమ్మతి. ౧

సహస్సమపి చే గాథా అనత్థపదసంహితా,
ఏకం గాథాపదం సేయ్యో యం సుత్వా ఉపసమ్మతి. ౨

యో చ గాథాసతం భాసే అనత్థపదసంహితా;
ఏకం ధమ్మపదం సేయ్యో యం సుత్వా ఉపసమ్మతి. ౩

యో సహస్సం సహస్సేన సఙ్గామే మానుసే జినే;
ఏకంచ జేయ్య మత్తానం స వే సంగామజుత్తమో. ౪

అత్తా హవే జితం సేయ్యో యా చాయం ఇతరా పజా;
అత్తదన్తస్స పోసస్స నిచ్చం సఞ్ఞత చారినో. ౫

నేవ దేవో న గన్ధబ్బో న మారో సహ బ్రహ్మునా,
జితం అపజితం కయిరా తథారూపస్స జన్తునో. ౬

మాసే మాసే సహస్సేన యో యజేథ సతం సమం,
ఏకంచ భావితత్తానం ముహుత్తమపి పూజయే;
సాఏవ పూజనా సేయ్యో యఞ్చే వస్ససతం హుతం. ౭

యోచ వస్ససతం జన్తు అగ్గిం పరిచరే వనే,
ఏకంచ భావితత్తానం ముహుత్తమపి పూజయే;
సాయేవ పూజనా సేయ్యో యఞ్చే వస్ససతం హుతం.౮

యం కిఞ్చి యిట్ఠం వ హుతంవ లోకే
సంవత్సరం యజేథ పుఞ్ఞపేక్ఖో,
సబ్బంపి తం న చతుభాగమేతి
అభివాదనా ఉజ్జుగతే సుసేయ్యో. ౯

అభివాదనసీలస్స నిచ్చం బద్ధాపచాయినో,
చత్తారో ధమ్మా వడ్ఢన్తి ఆయు వణ్ణో సుఖం బలం.౧౦

యోచ వస్ససతం జీవే దుస్సీలో అసమాహితో,
ఏకాహం జీవితం సేయ్యో సీలవన్తస్స ఝాయినో. ౧౧

యోచ వస్ససతం జీవే దుప్పఞ్ఞో అసమాహితో,
ఏకాహం జీవితం సేయ్యో పఞ్ఞావన్తస్స ఝాయినో.౧౨

యోచ వస్ససతం జీవే కుసీతో హీనవీరియో,
ఏకాహం జీవితం సేయ్యో విరియ మారభతో దళ్హం.

యోచ వస్ససతం జీవే అపస్సం ఉదయవ్యయం,
ఏకాహం జీవితం సేయ్యో పస్సతో ఉదయవ్యయం. ౧౪

యోచ వస్ససతం జీవే అపస్సం అమతం పదం,
ఏకాహం జీవితం సేయ్యో పస్సతో అమతం పదం. ౧౫

యోచ వస్ససతం జీవే అపస్సం ధమ్మ ముత్తమం,
ఏకాహం జీవితం సేయ్యో పస్సతో ధమ్మ ముత్తమం.

## ౮. సహస్రవర్గము

బుద్ధుఁడు ఒకపెద్ద విహారములో నుండఁగా భిక్షుకులు కొందఱు దూరదేశములనుండికూడ నక్కడకువచ్చి వాసముచేయుచుండిరి. బుద్ధుని ఉపదేశములను వినఁగోరి గృహస్థులుగూడఁ గొందఱు వచ్చుచుండిరి. బుద్ధుఁడును నియమితకాలమునం దిట్లుపన్యసించెను.

"ఉపదేశమున సహస్రపదములు ప్రయోగింపఁబడలేదే— అనఁగా దీర్ఘోపన్యాసమీయ లేదనుట. ఏలనో చూడుఁడు. అందు నిరర్థకములైన పదము లెన్నో యుండును. శ్రోతలకుఁ బ్రసన్నతఁ బ్రసాదించునది, బుద్ధశాసనముఁ దెలుపునది, అర్థపుష్టిగలది యగు నొకమాటను దూఁచిమాటలాడినఁ జాలును. అదిగదా శ్రేష్ఠతరమైనది. ౧

అనర్థపదజాలముతో నిండినగాథలు వేలకు వేలున్నవి. అవి గ్రుడ్డిగవ్వకుఁగూడఁ గొఱగావు. వినువారిలో నొక్కనికైన నవి శాంతిని సమకూర్పవలదా! అట్టి దొక్కటి యైనను శ్రేష్ఠతరమే. ౨

జనుఁడు సారములేని శబ్దజాలముతో నిండినగీతములను వేలకు వేలు పాడుచుండును. వానికంటె నొక్కమాటలో ధర్మము నిరూపించి శ్రోతకు శాంతి సాధింపఁగల గీతములే శ్రేష్ఠములైనవి. ౩

సహస్రసంగ్రామములలో భటసహస్రము నొక్కఁడే భంగపఱచినాఁ డనుకొనుఁడు. వాని జయ మేమిజయము? తన్నుఁదాను జయించినవాఁడే నిజమైన జేత. ౪

పరులను జయింపఁ బరుగులెత్తుటకంటెఁ దన్ను దాను జయించుకొనుట యుత్కృష్టమైన కార్యము. ౫

దేవగంధర్వదానవులుగూడ బ్రహ్మసహాయముతో వచ్చి యెదిర్చినను దన్నుఁ దాజయించుకొన్నవానిని, నియమబద్ధుని జయింపలేరు. ౬

నెలనెలకు వేలకువేలు వెచ్చించుచు వేయేండ్లు యజ్ఞములొనర్చుటకంటె దృఢవిశ్వాసముతో నొక్కక్షణమైనను స్థితప్రజ్ఞునిఁ దలఁచి తలఁచి తన్మయత్వమున వానిని బూజించు టుత్తమము. ౭

వనవాసము చేయుచు వేయేండ్లు అగ్ని నారాధించుచుండుటకంటె నొక్కక్షణమైనను స్థితప్రజ్ఞునిఁ దలఁచుకొని తన్మయుఁడై పూజించు టుత్తమము. ౮

ఐహికములైన యజ్ఞయాగాదు లెన్నిచేసినను నిష్కలంకుఁడైన స్థితప్రజ్ఞుని గౌరవించుటతో శతాంశమైన సరిపోలవు. ౯

పెద్దలను ప్రేమతో నాదరించువారికి, సదా నమస్కరించుచుండువారికి సంపదలు నాల్గు పెంపొందును. ఆయువు, సౌందర్యము, సుఖము, బలము అనునవా సంపదలు.౧౦

భిక్షులారా! గృహమేధులారా! ఆత్మను హద్దుపద్దులలో ఆపుకొనలేనివారు, దుశ్శీలురు, అనిపించుకొనకుఁడు మీరు. అట్లు నూఱేండ్లు నిండార బ్రతుకుటకంటె మంచిచెడ్డలు తెలిసినవాఁడు, శీలవంతుఁడు అనిపించుకొని ఒక్కనాఁటితో మీజీవితముఁ వెళ్లవార్చుకొన్న నుత్తమము. ౧౧

అజ్ఞాని, అసంయమి, అనిపించుకొనుచు నూఱేండ్లు బ్రతుకుటకుఁ గోరకుఁడు. దానికంటె వివేకి, స్థితప్రజ్ఞుఁడు, అనిపించుకొని యొక్కపూటలోఁ బాలిసినను మేలే సుఁడీ! ౧౨

సోమరులు,దుర్బలులునై నూఱేండ్లు బ్రతుకఁదలఁపకుఁడు. దృఢవీర్యులు, జాగరూకులు నై యొక్కదినము జీవించి నను జాలును. ౧౩

వృద్ధిక్షయములయంతరము గుర్తింపలేక నూఱేండ్లు నిండ
నుండవలెనని యాసింపకుఁడు. వానిఁగూర్చి సద్విచారము
సేయుచు నొక్కదినము మనినను శుభమే. ౧౪

అమృతపద మందుకొనలేక మీరు హతభాగ్యులై పోవ
లదు. కొండచిలువవలె వేయేండ్లు పడియుండుటకంటె
నిర్వాణసుఖ మనుభవించుచు నొక్కదినము జీవించినను
బాగు. ఊర్జితమైన జీవిత మది. అది సుండీ శ్లాఘ్య
మైనది. ౧౫

పవిత్రములైన బౌద్ధధర్మములు పరిగణింపనివాని బ్రదు
కేటికి పదటికా? ఆధర్మములను దీక్షతో ననుసరించువాఁ
డొక్కదినము జీవించినఁ జాలును."

## పాపవగ్గో నవమో

అభిత్థరేథ కల్యాణే పాపా చిత్తం నివారయే,
దన్ధం హి కరోతో పుఞ్ఞం పాపస్మిం రమతీ మనో. ౧

పాపంచే పురిసో కయిరా నతం కయిరా పునప్పునం,
నతమ్హి ఛన్దం కయిరాథ దుక్ఖో పాపస్స ఉచ్చయో. ౨

పుఞ్ఞం చే పురిసో కయిరా కయిరాథేతం పునప్పునం,
తమ్హి ఛన్దం కయిరాథ సుఖో పుఞ్ఞస్స ఉచ్చయో. ౩

పాపోఽపి పస్సతి భద్రం యావ పాపం నపచ్చతి,
యదా చ పచ్చతి పాపం అథ పాపో పాపాని పస్సతి. ౪

భద్రోపి పస్సతి పాపం యావ భద్రం న పచ్చతి,
యదా చ పచ్చతి భద్రం అథ భద్రో భద్రాని పస్సతి. ౫

మాఽవమఞ్ఞేథ పాపస్స న మం తం ఆగమిస్సతి,
ఉదబిందునిపాతేన ఉదకుమ్భోఽపి పూరతి;
పూరతి బాలో పాపస్స థోకథోకంఽపి ఆచినం. ౬

మాఽవమఞ్ఞేథ పుఞ్ఞస్స న మం తం ఆగమిస్సతి,
ఉదబిన్దునిపాతేన ఉదకుమ్భోఽపి పూరతి;
పూరతి ధీరో పుఞ్ఞస్స థోకథోకఽంపి ఆచినం. ౭

వాణిజోఽవ భయం మగ్గం అప్పసత్థో మహద్ధనో,
విసం జీవితుకామోఽవ పాపాని పరివజ్జయే. ౮

పాణిమ్హి చే వణో నాస్స హరేయ్య పాణినా విసం,
నాబ్బణం విస మన్వేతి నత్థి పాపం అకుబ్బతో. ౯

యో అప్ప దుట్ఠస్స నరస్స దుస్సతి
సుద్ధస్స పోసస్స అనఙ్గణస్స;
తమేవ బాలం పచ్చేతి పాపం
సుఖుమోరజో పటివాతంఽవ ఖిత్తో. ౧౦

గబ్భ మేకే ఉప్పజ్జన్తి నిరయం పాపకమ్మినో,
సగ్గం సుగతినో యన్తి పరినిబ్బన్తి అనాసవా. ౧

న అన్తలిక్ఖే నసముద్ద మజ్ఝే
నపబ్బతానం వివరం పవిస్స,

న విజ్జతీ సో జగతిప్పదేసో
యత్రట్ఠితో ముఞ్చేయ్య పాపకమ్మా. ౧౨

న అన్తలిక్ఖే నసముద్దమజ్ఝే
నపబ్బతానం వివరం పవిస్స,
నవిజ్జతీ సో జగతిప్పదేసో
యత్రట్ఠితం నప్పసహేథ మచ్చు. ౧౩

ఇతి పాపవగ్గో నవమో

## ౯. పాపవర్గము

బుద్ధునికుమారుఁడు చిరంజీవి రాహులుఁడు పండ్రెండేండ్ల వాఁడై యుండఁగాఁ బూజ్యుఁడైన బుద్ధదేవుఁ డీ శ్లోక దేశించెను:

"శుభకర్మములఁ జేయ నాతురపడువాఁడు తొలుదొల్తఁ దనయూహలఁ గప్పియున్న మోసపు ముసుఁగును దొలఁగింపవలెను. శుభకర్మముల నంటియునంటని శ్లాఁడువాని మనస్సు దుష్కృతులలో సుఖమున్నదనుకొని వానిఁ దగుల్కొనును. ౧

మనుజుఁడు పాపకృత్యమున కొక్కతూరి పాల్పడినఁ జాలు
ను; దానిఫలముఁ గుడిపింపక యది విడువదు సుమా!
కనుకఁ బాపముల మరగకుము. దుఃఖము దుష్కర్మ
ముల ఫలము గదోయీ! ౨

తన పాపకృత్యముల ఫల మనుభవమునకు రానంతవఱకు
వానిలో సుఖమున్న దనుకొని పాపి భ్రాంతిపడుచుండును.
పట్టికుడుపుచున్నప్పుడుగదా పాపఫలప్రభావము నాతఁడు
తెలిసికొనును! అప్పుడుగదా ఆతఁడు పండితుఁ డగును. ౩

మనుజుఁడు సుకర్మముల నాచరింపవలెను. తనజీవితము
నంతయు సుకర్మాచరణముననే కడపుటకుఁ గుతూహల
ము గలిగియుండవలెను. ఆనందమే సుకర్మములకు
ఫలము. ౪

సుకృత్యముల శుభఫలము ప్రచురము గానంతవఱకు
సత్కృత్యములఁ జేసి, యప్పటికప్పు డానందించువారిఁ జూచి
సత్పురుషునకుఁ గూడ మనసు మావంకకుఁ బోవుచుండును.
వానిపుణ్యము పండినపుడుగదా వాఁడు సుఖించును! ౫

'పలుబయెడ మన మెట్లు ప్రవర్తింతుమో మనల వారట్లు
మర్యాదచేయుదురు' అని తలఁచుచు బుద్ధిమంతుఁడు

పరిహాసములోఁగూడ మాయమర్మముల ముట్టఁ దల
పెట్టఁడు. కుండలో నొక్కొక్క నీటిబొట్టు పడఁగాఁ బడఁ
గా నది నిండునట్లు మూఢుఁడు దుష్కృత్యములను గొలఁది
కొలఁదిగాఁ గూడఁ బెట్టుకొనుచు తుదకు నిలువెల్ల
వానిచే నింపుకొనుచున్నాఁడు. ౬

'ఈపనిఁ జేసిన మన కేమిలాభము ?' అని కర్మములతో
బేరమాడువారు అజ్ఞానులు. ఇట్టి లేఁతబుద్ధివలన వారు
సత్ఫలమును సమీపింపలేరు. కుండలో నీ రొక్కొక్క
బొట్టు పడుచుండఁగా నది నిండునట్లు మంచితనమును
కొంచెము కొంచెముగాఁ గూడఁబెట్టుకొనుచుఁ తుదకు
మాధుర్యముతో నిండిపోవుచున్నాఁడు సాధుజనుఁడు. ౭

అనుచరు లధికముగ లేకుండ ధనముఁ గొనిపోవు సార్థ
వాహుఁడు దారిదోపిడీగాండ్రకుఁ దల్లడిల్లును. దేహము
పైఁ దీపుగలవాఁడు విషముఁ జూచి వెఱఁగుపడును. అట్లే
పాపములకు భయమొందవలెను మనుజుఁడు. ౮

చేతియందు వ్రణములేనివాఁడు చేతితోఁ దాఁకి విషమును
విఱుచుచున్నాఁడు. పుండున్నవాఁడినిగదా విషము పొలి
యించును! అట్లే నీయందుఁ బాపపుఁబుండును మాపుకొను
మన్నా! విషయవిషము నిన్ను వికారింపదు. ౯

ఎవఁడేని నిర్దోషులను, సత్పురుషులను బీడించుచుండు నేని
వానిపాప మెదురుతిరిగి వానినే పీడించును. గాలిమీఁదఁ
జిమ్మిన దుమ్ము చిమ్మినవాని ముఖముమీఁద నేకదా
పడును! ౧౦

జననమరణముల చక్రమునఁ జిక్కుకొని క్రిందుమీఁదు
లగుచు గిజుకొనుచున్నాఁడు భోగాభిలాషి. నరకలోక
మునకు నడుచుచున్నాఁడు పాపి. స్వర్గలోకమునకుఁ జను
చున్నాఁడు సజ్జనుఁడు. సంసారమందలి కోర్కెలను నశి
లించుకొన్నవాఁడు నిర్వాణపదమునకు నిర్గమించు
చున్నాఁడు. ౧౧

ప్రపంచ మంతయు గాలించిచూచినను బాపఫలము
గుడువకుండఁ దప్పించుకొనుటకుఁ దగిన తావు లేదోయీ!
అట్లే మృత్యువువాతఁ బడకుండఁ దలఁదాఁచుకొనఁదగిన
యిరవు లేదురా కుఱ్ఱా!" ౧౩

## దణ్డవగ్గో దసమో

సబ్బే తసన్తి దణ్డస్స సబ్బే భాయన్తి మచ్చునో,
అత్తానం ఉపమం కత్వా న హనేయ్య న ఘాతయే. ౧

సబ్బే తసన్తి దణ్డస్స సబ్బేసం జీవితం పియం,
అత్తానం ఉపమం కత్వా న హనేయ్య న ఘాతయే. ౨

సుఖకామాని భూతాని యో దణ్డేన విహింసతి,
అత్తనో సుఖమేసానో పేచ్చ సో న లభతే సుఖం. ౩

సుఖకామాని భూతాని యో దణ్డేన న హింసతి,
అత్తనో సుఖమేసానో పేచ్చ సో లభతే సుఖం. ౪

మాఽవోచ ఫరుసం కఞ్చి వుత్తా పటివదేయ్యు తం,
దుక్ఖా హి సారమ్భకథా పటిదణ్డా ఫుసేయ్యు తం. ౫

సచే నేరేసి అత్తానం కంసో ఉపహతో యథా,
ఏస పత్తోఽసి నిబ్బానం సారమ్భో తే న విజ్జతి. ౬

యథా దణ్డేన గోపాలో గావో పాచేతి గోచరం,
ఏవం జరాచ మచ్చుచ ఆయుం పాచేన్తి పాణినం. ౭

అథ పాపాని కమ్మాని కరం బాలో న బుజ్ఝతి,
సేహి కమ్మేహి దుమ్మేధో అగ్గిదడ్ఢోఽవ తప్పతి. ౮

యో దణ్డేన అదణ్డేసు అప్పదుట్ఠేసు దుస్సతి,
దసన్న మఞ్ఞతరం ఠానం ఖిప్పమేవ నిగచ్ఛతి. ౯

వేదనం ఫరుసం జానిం సరీరస్సచ భేదనం,
గరుకం వాఽపి ఆబాధం చిత్తక్ఖేపంఽవ పాపుణే. ౧౦

రాజతో వా ఉపసగ్గం అబ్భక్ఖానంఽవ దారుణం,
పరిక్ఖయంవ ఞాతీన భోగానంవ పభఙ్గురం. ౧౧

అథవాఽస్స అగారాని అగ్గి డహతి పావకో,
కాయస్స భేదా దుప్పఞ్ఞో నిరయం సో ఉపపజ్జతి. ౧౨

న నగ్గచరియా న జటా న పఙ్కా
నానాసకా థణ్డిలసాయికా వా,

రజోచ జల్లం ఉక్కుటికప్పధానం
సోధేన్తి మచ్చం అవితిణ్ణ కఙ్ఖం. ౧౩

అలఙ్కతో చేపి సమం చరేయ్య
సన్తో దన్తో నియతో బ్రహ్మచారీ,
సబ్బేసు భూతేసు నిధాయ దణ్డం
సో బ్రాహ్మణో సో సమణో సభిక్ఖు. ౧౪

హిరీ నిసేధో పురిసో కోచి లోకస్మిం విజ్జతి,
యోనిన్దం అప్పబోధతి అస్సో భద్రో కసా మివ. ౧౫

అస్సో యథా భద్రో కసానివిట్ఠో
ఆతాపినో సంవేగినో భవాథ,
సద్ధాయ సీలేన చ వీరియేన
చ సమాధినా ధమ్మవినిచ్ఛయేన చ,
సమ్పన్న విజ్జాచరణా పతిస్సతా
పహాస్సథ దుక్ఖమిదం అనప్పకం. ౧౬

ఉదకం హి నయన్తి నేత్తికా
ఉసుకారా నమయన్తి తేజనం,

దారుం నమయన్తి తచ్ఛకా
అత్తానం దమయన్తి సుబ్బతా. ౧౭

ఇతి దండవగ్గో దసమో

## ౧౦. దండవర్గము

ఒకనాఁడు దండనాధికారముగల రాజోద్యోగి యొకఁడు భిక్షుకసంఘములోనికి వచ్చెను. భిక్షుకులుకుశలప్రశ్నాదు లడిగినపిమ్మట వానికి అహింసనుగూర్చి యుపదేశించిరి. పిదప వాఁడు దండమునుగూర్చి యుపదేశింపుఁడని కోరఁ వారందఱు ఆరాజోద్యోగిని దీసికొని బుద్ధదేవు నొద్దకుఁ బోయి అడిగిరి. బుద్ధుఁ డంత ని ట్లుపదేశించెను:

"జనుఁడా! లోకము దండమునకును మృత్యువునకును భీతిల్లుచున్నది. కాన ప్రాణిని నీవు పట్టి బాధింపకుము; హింసింపకుము. నీవు గూడఁ బరునివంటివాఁడవేసుమా! ఈ మాట మఱువకుము. ౧

ప్రాణములపైఁ దీపిలేని ప్రాణి లేదు. కాన దండమునకు లోకము తాళుకొనలేదన్నా! నీవుగూడ నితరునిఁ బోలిన వాఁడవే అనుమాట మనమున నుంచుకొని పరుల

బాధింపకుము. బాధకుఁ గారణభూతుఁడవు గూడఁ గాకుము. ౨

తనసుఖముకొఱకుఁ బరుల దండించుచుఁ బరుల వధించు వాఁడు తాఁ జచ్చినపిదప శాంతి నొందఁజాలఁడు. ౩

శాశ్వతసుఖముఁ గోరుకొను జనుఁడు పరుల బాధింపఁడు; వధింపఁడు. మృతుఁడైనవాఁడు స్వర్గమునకుఁ బోవును. ౪

ఎవ్వరినిగూడ నొవ్వనాడకుము. కల్యాణమును గాంక్షించువాఁడా! వారుగూడ నిన్నట్లు దూఱురోయీ! సిగ్గుపట్లు తెచ్చిపెట్టుమాటల నొకటిఁగూడ నాడకుము. పిదప నది పీడించునుసుమా! గ్రుద్దకుము; గ్రుద్దఁబడెదవు. అది నీ వనుభవించవలసిన దే. ౫

పరులు నిన్నుఁ బ్రేరేచినఁగూడ నీవు నోరు జారకుము. పగిలినగంట వాయించినను మ్రోగదు. నీవుగూడ నట్లుండవలెను. అసూయ నణఁచుకొనుము; నీకు నిర్వాణ మందుపాటులో నుండును. ౬

గొల్లఁడు కఱ్ఱఁబట్టుకొని పశువుమందనదలించుచు వెంటఁ దిరుగునట్లు మృత్యువు జరాదండమును జేతఁబట్టి జీవములను వెంటాడి మరలించుచుండును జుమా! ౭

అవివేకి తానుచేయు చెడుపనులను దెలియఁ జాలఁడు. ఆమందునిఁ దుద కవి యగ్నివలె నాహుతిఁగొనునోయీ! నిర్దోషులను బీడించువాఁడు పది పాపములలో నొకదాని ఫలమునకు గుఱియై పీడింపఁబడును. ౯

ఆపాపఫలము లివి : దుర్భరశరీరపీడ, శరీరశోషణము, దుర్భరమగు మనోవ్యథ, మనోవైకల్యము, రాజదండనము, అపకీర్తి, ప్రియజనవియోగము, సర్వస్వనాశనము, అగ్నిచేఁగాని పిడుగుచేఁగాని ఇల్లుకాలుట, చచ్చి నరకమునఁ గూలుట, ఈపదింటిలో నొక్కదానికిఁ బరుల నకారణముగ బాధించువాఁడు గుఱియగును. ౧౦-౧౨

వనవాసము, జటాధారణము, ఉపవాసము, స్థండిలశయనము, భస్మోద్ధూళనము, మౌనము, తపశ్చర్య తృష్ణను జయింపలేనివానిని బవిత్రునిఁజేయఁజాలవు. ౧౩

వేషము శుభ్రముగనున్నమాత్రమున శుచి గానేరఁడు. దానికిఁదోడు, శాంతమూర్తి, స్థిరచిత్తుఁడు, జితేంద్రియుఁడు, నియమబద్ధుఁడు, పవిత్రుఁడునై యుండవలెను. వాఁడే నిశ్చయమైనబ్రాహ్మణుఁడు; వాఁడే శ్రమణకుఁడు; వాఁడే భిక్షువు. వానికిఁ బరుల విమర్శించుస్వభావ ముండదు. ౧౪

చురుకుగలదియు, సాధువు నైన గుఱ్ఱము కొరడాదెబ్బను దిననట్లు వినయసంపన్నుఁడు జితేంద్రియుఁడు నైన జనుఁడు మాటపడఁడు. ౧౫

చురుకైనగుఱ్ఱము కొరడాదెబ్బ తినినపుడు చిందులుత్రొక్కుచు నుత్సాహముతోఁ బరువెత్తునట్లు, శ్రద్ధ, విశుద్ధ వర్తనము, ధ్యానము, ధర్మజ్ఞానము లనుసాధనములతో నుత్సాహివై దుఃఖములఁ దొలఁగించుకొనుము. జ్ఞానముతోఁగూడ నాచరణనై పుణ్యము నార్జించుకొనుము. సర్వోత్తమములైన యీ నియమములను మఱువకుము.

కర్షకులు నీటిని వలసినచోటికిఁ బ్రవహింపఁజేయుదురు. విండ్లనుజేయువారు వింటికొఱకు వెదుఱును వంచుకొందురు. వడ్రంగులు కఱ్ఱను దమయిచ్చవచ్చిన ట్లుపయోగించుకొందురు. అట్లే బుద్ధిమంతులు ఆత్మను వశీకరించుకొని తమయిష్టమువచ్చినట్లు త్రిప్పుకొని నడుపుచున్నారు.౧౭

## జరావగ్గో ఏకాదసమో

కో ను హాసో కిమానన్దో నిచ్చం పజ్జలితే సతి
అన్ధకారేన ఓనద్ధా పదీపం న గవేస్సథ. ౧

పస్స చిత్తకతం బిమ్బం అరుకాయం సముస్సితం,
ఆతురం బహుసఙ్కప్పం యస్స నత్థి ధువం ఠితి. ౨

పరిజిణ్ణమిదం రూపం రోగనిడ్డం పభఙ్గురం,
భిజ్జతి పూతిసన్దేహో మరణన్తం హి జీవితం. 3

యానిమాని అపత్థాని అలాబూనేవ సారదే,
కాపోతకాని అట్ఠీని తాని దిస్వాన కా రతి. ౪

అట్ఠీనం నగరం కతం మంసలోహితలేపనం
యత్థ జరా చ మచ్చు చ మానో మక్ఖో చ ఓహితో. ౫

జీరన్తి వే రాజరథా సుచిత్తా
అథో సరీరమ్పి జరం ఉపేతి,
సతఞ్చ ధమ్మో న జరం ఉపేతి
సన్తో హవే సబ్భి పవేదయన్తి.

అప్పస్సుతాఽయం పురిసో బలివద్దోఽవజీరతి,
మంసాని తస్స వడ్ఢన్తి పఞ్ఞా తస్స న వడ్ఢతి. ౭

అనేకజాతిసంసారం సన్ధావిస్సం అనిబ్బిసం,
గహకారకం గవేసన్తో దుక్ఖా జాతి పునప్పునం. ౮

గహకారక! దిట్ఠోఽసి పున గేహం న కాహసి,
సబ్బా తే ఫాసుకా భగ్గా గహకూటంవిసఙ్ఖతం,
విసఙ్ఖారగతం చిత్తం తణ్హానం ఖయమజ్ఝగా. ౯

అచరిత్వా బ్రహ్మచరియం అలద్ధా యొబ్బనే ధనం,
జిణ్ణకోఞ్చాఽవ ఝాయన్తి ఖీణమచ్ఛేఽవ పల్లలే. ౧౦

అచరిత్వా బ్రహ్మచరియం అలద్ధా యొబ్బనే ధనం,
సేన్తి చాపాతి ఖీణాఽవ పురాణాని అనుత్థునం. ౧౧

ఇతి జరావగ్గో ఏకాదసమో

## ౧౧. జరావర్గము

బుద్ధుఁడు ఒకనాఁడు ఆనందుఁడను ప్రియశిష్యునితో మాట
లాడుచుండ యువభిక్షువొకఁడు ముసలివానివలెఁ జేయిపట్టి

వేసవిని బారవైచిన సొరకాయవంటిది తెల్లనియెముకల ప్రోవగు నీశరీరము. దానినిఁ జూచిన నీకు సంతోష మెట్లుగునో నీలో నీవు కొంచె మాలోచించి చూడుము. ౪

అస్థులచే నిర్మింపఁబడిన దీదేహ మనునగరము. రక్త మాంసములు దానిపైపూఁతలు. ముదిమి, మృత్యువు, అభిమానము, కపటము నందుఁ బుట్టి యచటనే కాపురము చేయుచుండును. ౫

చక్కఁగా నలంకరింపఁబడి తళతళ లాడుచున్న చక్రవర్తిరథమువలెఁ గ్రమముగ మానవశరీరము వార్ధక్య బాధకు లోనయి శిథిలమగును. సత్పురుషుల సద్ధర్మము లేనాఁటికిని సడలిపోవు. ఇట్లొక సజ్జనుఁ డొకనితోఁ జెప్పెను. ౬

క్రమశిక్షణము లేనివానికి జ్ఞానము కుదురుకొనదన్నా! వానియొడలునిండఁ గండపుష్టి మిసమిస లాడుచుండును. బలిసిన ఆంబోతువలె నాతఁడు తిరిగితిరిగి తుదకు ముదిమి వాతఁ గూలుచున్నాఁడు గదోయీ! ౭

ఎన్నియో జన్మముల నెత్తితిని; మృత్యువుపా లయితిని. ఈ సంసారవాహినియొక్క తుదమొదళ్లు తెలియఁజాల

నైతిని. జన్మములెత్తుట మిక్కుటముగఁ గష్టములఁ గుడు
చుటకొఱకే యగుచున్నది. ౮

దేహధారీ! ఇపుడు నిన్నుఁ గనుఁగొంటిని. నా మాటల
సారమును గ్రహింపుము. ఇట్టి దేహముకొఱకు దేవులాడ
కుము. వాసములు విరిగినవి. దూలము చీలిపోయినది.
అనిత్యమైన శరీరమున కాధారభూతమగు పరికరమంతయు
నశించినది. ఇఁక మనోదుర్వాంఛితములు దూరములు
కాఁగాఁ బ్రశాంతము, శాశ్వతము నగు నిర్వాణతీరముఁ
జేయుము. ౯

తనకులధర్మములను నిర్వహింపనివాఁడు, వయసు చెల్లక
ముందే ధర్మధనముఁ గూర్చి దాఁచుకొననివాఁడు, చేఁపలు
లేని పచ్చికపడియయందుఁ గొంగవలె నశించును. ౧౦

తన కులధర్మమును నిర్వహింపనివాఁడు, వయసు చెల్లక
ముందే ధర్మధనమునుగూర్చి దాఁచుకొననివాఁడు దుర్ద
శకుఁ బాల్పడినపుడు విఱిగిన ప్రాఁతవిల్లువలెఁ దనపూర్వ
స్థితిని దలఁచుకొని పరితపించును.” ౧౧

## అత్తవగ్గో ద్వాదసమో

అత్తానం చే పియం జఞ్ఞా రక్ఖేయ్య నం సురక్ఖితం,
తిణ్ణ మఞ్ఞతరం యామం పటిజగ్గేయ్య పణ్డితో. ౧

అత్తానమేవ పఠమం పటిరూపే నివేసయే,
అథఞ్ఞ మనుసాసేయ్య నకిలిస్సేయ్య పణ్డితో. ౨

అత్తానం చే తథా కయిరా యథఽఞ్ఞ మనుసాసతి,
సుదన్తో వత దమేథ అత్తా హి కిర దుద్దమో. ౩

అత్తా హి అత్తనో నాథో కో హి నాథో పరో సియా,
అత్తనా హి సుదన్తేన నాథం లభతి దుల్లభం. ౪

అత్తనాఽన కతం పాపం అత్తజం అత్తసంభవం,
అభిమన్థతి దుమ్మేధం వజిరం వఽహ్మమయం మణిం. ౫

యస్స అచ్చన్త దుస్సీల్యం మాలువా సాలమివోత్థతం,
కరోతి సో తథత్తానం యథా నం ఇచ్ఛతీ దిసో. ౬

సుకరాని అసాధూని అత్తనో అహితానిచ,
యంవే హితంచ సాధుంచ తంవే పరమ దుక్కరం. ౭

యో సాసనం అరహతం అరియానం ధమ్మజీవినం,
పటికోసతి దుమ్మేధో దిట్ఠిం నిస్సాయ పాపికం.
ఫలాని కట్ఠకస్సేవ అత్తఘఞ్ఞాయ ఫల్లతి. ౮

అత్తనావ కతం పాపం అత్తనా సంకిలిస్సతి,
అత్తనా అకతం పాపం అత్తనావ విసుజ్ఝతి,
సుద్ధి అసుద్ధి పచ్చత్తం నాఞ్ఞో అఞ్ఞం విసోధయే. ౯

అత్తదత్థం పరత్థేన బహునాపి నహాపయే,
అత్తదత్థ మభిఞ్ఞాయ సదత్థపసుతో సియా. ౧౦

అత్తవగ్గో ద్వాదసమో

## ౧౨. ఆత్మవర్గము

పడుచువాడు డోకభిక్షుకుడు డోకనాడు బుద్ధునొద్దకు వచ్చి నమస్కరించి వినయముతో నిట్లు పల్కెను. "దేవా! ఇతరులను మంచి మార్గమున నడిపింపగల యాత్మవశీ

కరణమును నాకు నేర్పి యుపకారము సేయఁ గోరెద" నని. భగవానుఁ డిట్లు చెప్పెను:

"తన్నుఁ దాను బాగుచేసికొనవలె ననుచో జనుఁడు శ్రద్ధ గలిగి జాగరూకతతో మెలఁగవలెను. దశాత్రయమున నొక్కదానియందైన నప్రమత్తుఁడై యుండవలెను. ౧

ప్రతిమనుజుఁడును దొలుతఁ దా నాచరించి పదపడి యితరులకు బోధింపవలెను. అట్లు చేయు వివేకిని గష్టము లంటవు. ౨

ప్రతిమానవుఁడు ఇతరులకుఁ జెప్పఁబోవుదానిని ముందుగాఁ దా నాచరింపవలెను. తన్ను దాను వశముచేసికొనవలెను. అట్టివానికిఁ బరులు దమంతఁ దాము వశులగుదురు. వాని నెవ్వరు జయింపఁ జాలరు. 3

తన్నుఁ దాను పాలించుకొనవలెను. ఇతరులు తనకుఁ బ్రభువులు గారు. అహంకారము నడఁచుకొని జీవితముఁ గడపువానినిఁ బ్రభువులే వచ్చి ప్రార్థించెదరు. ౪

తాను జేసిన పాపము, వజ్రము ఇతరరత్నములను బగులఁ గొట్టునట్లు లవివేకి నడఁగార్చును. ౫

తీగ చెట్టునిండఁ బ్రాఁకి దాని కొమ్మలను వంచివేయు నట్లు దుస్స్వభావము నానాఁటఁ బెరిగి మనుజుని నెత్తి కెక్కి వాని నణఁచివేయును. అపుడుగదా మనుజుఁడు దానిని శత్రువని తెలిసికొనును. ౬

అపాయకరము లగు చెడుపనులఁ జేయుట సులభ మేసుమా! కళ్యాణకరములగు మంచిపనులను జేయుట కొండలు వంగదోయీ! ౭

అర్హాతులు, ధర్మరతులు, ఆర్యులు, సజ్జనులునైన పెద్దల సదుపదేశములను ద్రోసిపుచ్చు వక్రబుద్ధివి గాఁబోయె దవుసుమా; వెదురు పంటతో నశించునట్టు లా పాపఫల మున నీవు నశించెదవోయీ ! ౮

మనుజుఁడు స్వయముగఁ దాను నాటుకొనిన అకృత్య బీజములఫలమును దానే యనుభవించును. కావున తన దుస్స్వభావమును దానే విడువవలెను. తన్నుఁదాను బవి త్రీకరించు కొనవలెను. మనుజుఁడు దుష్టుఁడగుటయు, శిష్టుఁడగుటయుఁ దన చేతిలోనిపనియే. పరులు వానిని బవిత్రునిఁ జేయఁజాలరన్నా! ౯

పరుల ధర్మము లెంతమంచివైనను వానినిబట్టి ప్రాకులాడకుము. వానివలన నీకుఁ బ్రయోజనము లేదు. స్వీయధర్మములను విడువకుము. అవి యనంతశ్రేయోదాయకములు. వానిని నీవు నిర్వహింపుమోయీ, మేలును గాంచెదవు!" ౧౦

## లోకవగ్గో తేరసమో

హీనం ధమ్మం న సేవేయ్య పమాదేన న సంవసే,
మిచ్ఛాదిట్ఠిం న సేవేయ్య న సియా లోకవడ్ఢనో. ౧

ఉత్తిట్ఠే నప్పమజ్జేయ్య ధమ్మం సుచరితం చరే,
ధమ్మచారీ సుఖం సేతి అస్మిం లోకే పరమ్హి చ. ౨

ధమ్మం చరే సుచరితం నతం దుచ్చరితం చరే,
ధమ్మచారీ సుఖం సేతి అస్మిం లోకే పరమ్హి చ. ౩

యథా బుబ్బులకం పస్సే యథా పస్సే మరీచికం,
ఏవం లోకం అవేక్ఖంతం మచ్చురాజా న పస్సతి. ౪

ఏథ పస్సథిమం లోకం చిత్తం రాజరథూపమం,
యత్థ బాలా విసీదన్తి నత్థి సంగో విజానతం. ౫

యో చ పుబ్బే పమజ్జిత్వా పచ్ఛా సో నప్పమజ్జతి,
సోఽమం లోకం పభాసేతి [illegible] చన్దిమా.

యస్స పాపం కతం కమ్మం కుసలేన పిధీయతి,
సోఽమం లోకం పభాసేతి అబ్భా ముత్తోవ చన్దిమా. ౭

అన్ధభూతో అయం లోకో తనుకేఽత్థ విపస్సతి,
సకున్తో జాలముత్తోఽవ అప్పో సగ్గాయ గచ్ఛతి. ౮

హంసాఽదిచ్చపథే యన్తి ఆకాసే యన్తి ఇద్ధియా,
నీయన్తి ధీరా లోకమ్హా జేత్వా మారం సవాహినిం. ౯

ఏకం ధమ్మం అతీతస్స ముసావాదిస్స జన్తునో,
వితిణ్ణ పరలోకస్స నత్థి పాపం అకారియం. ౧౦

న వే కదరియా దేవలోకం నజన్తి
బాలా హవే నప్పసంసన్తి దానం,
ధీరోచ దానం అనుమోదమానో
తేనేవ సోహోతి సుఖి పరత్థ. ౧౧

పథవ్యా ఏకరజ్జేన సగ్గస్స గమనేనవా,
సబ్బ లోకాధిపచ్చేన సోతాపత్తిఫలం వరం. ౧౨

ఇతిలోకవగ్గో తేరసమో.

## ౧౩. లోకవర్గము

ధనికుఁడగు వర్తకుఁ డొకఁడు బుద్ధుని సద్గుణములను వినెను. ఆమహాత్ముని జ్ఞానోపదేశముఁ గాంచఁగోరి తన యింటికి భిక్షకొకనాఁడు రాఁ బ్రార్థించెను. వర్తకుని భాగ్యవిశేషమువలన బుద్ధుఁ డందు కంగీకరించి యాతని యింటికిఁ బోయెను. భోజనానంతర మావర్తకుఁడు మిత్రులతోఁ గూడి బుద్ధభగవానుని జ్ఞానోపదేశముఁ జేయుఁడని ప్రార్థించెను. బుద్ధుఁ డిట్టులమూల్యోపదేశమును గావించెను:

"మానవుఁడా! పాపకృత్యముల పాలుపడకుము; దురూహల నంటుకొని దుడుకుపోకలఁ బోకుము; దుర్మతములకు దూరముగా నుండుము; జననమరణాది వికారములకుఁ దావైన యైహికమునుండి బుద్ధిని మరల్పుము. ౧

లే లెమ్ము; అలసత్వమును వీడుము. సన్మార్గమున బొమ్ము. సన్మార్గమును వీడనివాఁడుగదోయీ ఇహపరముల సుఖమును బొందువాఁడు! ౨

సద్గుణ నియమములను బాలింపుము; పాపపంకములో నడుగు వెట్టకుము. సద్గుణములు గలవాఁడుగదోయీ ఇహపరముల సుఖమును గాంచువాఁడు! ౩

ఈలోకము నీటి బుడగవంటిది, మఱియు నెండమావులు వంటిది, అను విషయమును మఱువకుము. ఈలోకము నిస్సారమని యెఱుఁగు వాని వంకకు యముఁడు తన దృష్టినైన మఱల్పఁజాలఁడు సుమా! ౪

చక్రవర్తి స్యందనమువలెఁ బళితళ లాడుచున్నది యీ భవసాగర మదిగో చూడుము. అందుఁ బాలి మందులు గింజుకొనుచున్నారన్నా; జ్ఞానులు దానిచెంతకైనఁ జేరరోయీ! ౫

తొలుత నవివేకియై యుండి పిదప జ్ఞానమార్జించుకొన్న వాఁడు మేఘమును వెలువడిన చంద్రునివలె లోకమును వెలుఁగొందఁ జేయును. ౬

తొలుత నపకారమును గావించి పశ్చాత్తప్తుఁడై మఱల మేలు నొనరించువాఁడు మేఘమునుండి వెలువడిన చంద్రునివలె లోకమును వెలుఁగొందఁ జేయును. ౭

నాయనా! యీ జగమంతయు నంధకారమయ మైనది. దానిలోఁ దగుల్కొనిన వానికిఁ గన్ను పొడుచుకొనినను గానరాదు. దానినుండి తప్పించుకొనినవాఁడు వేఁట

కాని యుచ్చులనుండి తప్పించుకొనిన పక్షివలె స్వేచ్ఛ
ననుభవించునోయీ ! ౮

హంసలు ఆకాశమునఁ జరించునట్లు వివేకవంతులీ
లోకమును వీడి యద్భుతశక్తితో సూర్యమార్గమున
నెగురుచుందురు. అట్టివారు మృత్యువును సపరివారము
గా జయించి వెలయుదురు. ౯

ధర్మము నించుకయేని దప్పినవాఁడు, అసత్యము లాడు
వాఁడు, పరలోకముఁ బరిహసించువాఁడు, ఘోరమగు
నెట్టి పాపకృత్యమునైనఁ జేయుట కేవగించుకొనఁడు ౧౦

ఔదార్యములేనివాఁ డధముఁడు. స్వర్గమునకు వాఁడు
చనఁజాలఁడు. కేవల మూఢుఁడు దాతృత్వమును నిందిం
చును. దాని ప్రభావము వానికేమి యెఱుక? ౧౧

అది బుద్ధిమంతునిసొమ్ము. అతఁడు దాని కానందించును.
దాని మూలమున నాతఁడు స్వర్గమును జేరి సుఖించును.
భూమండలమున కెల్ల రాజగుటకంటె, స్వర్గలోకసుఖ
మును జూఱకొనుటకంటె స్రోతాపన్నుఁడగుట (నిర్వా
ణపదముయొక్క నిచ్చెనపై మొదటిమెట్టెక్కుట) శ్రేష్ఠ
మైనదోయీ !" ౧౨

## బుద్ధవగ్గో చతుద్దసమో

యస్స జితం నావజీయతి
　　జిత మస్స నోయాతి కోచి లోకే,
తం బుద్ధ మనన్తగోచరం
　　అపదం కేన పదేన నేస్సథ. ౧

యస్స జాలినీ విసత్తికా
　　తణ్హా నత్థి కుహిఞ్చి నేతవే,
తం బుద్ధ మనన్తగోచరం
　　అపదం కేన పదేన నేస్సథ ౨

యే ఝానపసుతా ధీరా నేక్ఖమ్మూపసమే రతా,
దేవాఽపి తేసం పిహయన్తి సమ్బుద్ధానం సతీమతం. ౩

కిచ్ఛో మనుస్సపటిలాభో కిచ్ఛం మచ్చాన జీవితం,
కిచ్ఛం సద్ధమ్మసవణం కిచ్ఛో బుద్ధానం ఉప్పాదో. ౪

సబ్బ పాపస్స అకరణం కుసలస్స ఉపసమ్పదా,
సచిత్త పరియోదపనం ఏతం బుద్ధానసాసనం. ౫

ఖన్తీ పరమం తపో తితిక్ఖా
　　నిబ్బాణం పరమం వదన్తి బుద్ధా,
నహి పబ్బజితో పరూపఘాతీ
　　సమణో హోతి పరం విహేఠయన్తో. ౬

అనూపవాదో అనూపఘాతో పాతిమోక్ఖే చ సంవరో,
మత్తఞ్ఞుతా చ భత్తస్మిం పన్తంచ సయనాసనం,
అధిచిత్తేచ ఆయోగో ఏతం బుద్ధానసాసనం. ౭

నకహాపణవస్సేన తిత్తి కామేసు విజ్జతి,
అప్పస్సాదా దుక్ఖా కామా ఇతి విఞ్ఞాయ పణ్డితో. ౮

అపి దిబ్బేసు కామేసు రతిం సో నాఽధిగచ్ఛతి,
తణ్హాక్ఖయరతో హోతి సమ్మాసమ్బుద్ధసావకో. ౯

బహుం వే సరణం యన్తి పబ్బతాని వనానిచ,
ఆరామ రుక్ఖచేత్యాని మనుస్సా భయతజ్జితా. ౧౦

నేతం ఖో సరణం ఖేమం నేతం సరణ ముత్తమం,
నేతం సరణ మాగమ్మ సబ్బదుక్ఖా పముచ్చతి. ౧౧

యోచ బుద్ధంచ ధమ్మంచ సంఘంచ సరణం గతో,
చత్తారి అరియసచ్చాని సమ్మప్పఞ్ఞాయ పస్సతి. ౧౨

దుక్ఖం దుక్ఖసముప్పాదం దుక్ఖస్సచ అతిక్కమం,
అరియంచట్ఠఙ్గికం మగ్గం దుక్ఖూపసమగామినం. ౧౩

ఏతం ఖో సరణం ఖేమం ఏతం సరణ ముత్తమం,
ఏతం సరణ మాగమ్మ సబ్బదుక్ఖా పముచ్చతి. ౧౪

దుల్లభో పురిసాజఞ్ఞో న సో సబ్బత్థ జాయతి,
యత్థ సో జాయతి ధీరో తం కులం సుఖమేధతి. ౧౫

సుఖో బుద్ధానం ఉప్పాదో సుఖా సద్ధమ్మ దేసనా,
సుఖా సంఘస్స సామగ్గి సమగ్గానం తపో సుఖో. ౧౬

పూజారహే పూజయతో బుద్ధే యది వ సావకే,
పపఞ్చ సమతిక్కన్తో తిణ్ణసోకపరిద్దవే. ౧౭

తే తాదిసే పూజయతో నిబ్బుతే అకుతోభయే,
న సక్కా పుఞ్ఞం సఙ్ఖాతుం ఇమేత్త మపి కేనచి. ౧౮

ఇతి బుద్ధవగ్గో చతుద్దసమో

## ౧౪. బుద్ధవర్గము

ఒకనాఁడు భిక్షుకులు విహారమునఁ గూర్చుండి బుద్ధత్వ మునుగూర్చి చర్చించుకొనుచుండిరి. అపుడు బుద్ధభగ వానుఁ డచటకు వచ్చెను. భిక్షుకులందఱు లేచి నమస్క రించి వినయముతో నిలుచుండిరి. అంత నానందుఁడను భిక్షుకుఁడు "దేవా, బుద్ధత్వమునుగూర్చి మాలో మేము చర్చించుకొనుచుంటిమి. మీరు మాయందు దయ యుంచి దానింగూర్చి చక్కఁగా వివరింపవేఁడెద" మన బుద్ధదేవుఁ డిట్లనెను:

"భిక్షుకులారా! బుద్ధుఁడు సర్వజ్ఞుఁడు; రాగద్వేషాది జనన మరణకారణ మార్గదూరుఁడు; ప్రబుద్ధుఁడు; పరాజితుఁడు కానిజేత; ఇతరులకు సులువుగ నందరాని సత్పథమునఁ జరియించువాఁడు. అట్టిసుకృతి నెట్లు కుమార్గమునఁ గొని పోవనగును? ౧

అతఁడు పాపవిషదిగ్ధము లగు నాశాబంధనములఁ దగు లొక్కఁడు.ఎల్లపుడును సత్పథమున జరియించుచుండును. అట్టి సుకృతి నెట్లు కుమార్గమునఁ గొనిపోవనగును? ౨

జ్ఞానులు, నియతచిత్తులు, ధ్యానశీలురు, నిర్వాణసుఖము నాసించువారు నగువారు ప్రబుద్ధులు. వారు దేవతలకును సహింపరానివారు. 3

మానవుడై పుట్టుట కష్టము. అది పుణ్యవశమునఁగాని కలుగదు. లోకమున సుజీవితమును గడపు టంతకంటెఁ గష్టము. సత్యధర్మముల నెఱుఁగుట దానికంటెఁ గష్టము. అన్నిటికంటెఁ గష్టము నుఁడీ బుద్ధుఁడగుట. ౪

"పాపకార్యములఁ జేయకుఁడు. పుణ్యకార్యములఁ బొనరింపుఁడు. మనస్సులోని మలినమును మాపుకొనుఁడు." ఇది బుద్ధులగువారు గావించు ప్రబోధము. ౫

క్షమయే యుత్కృష్టమైన తపము. కష్టసహనమే యుత్కృష్టమైన నిర్వాణము. పరులను బీడించువాఁడు సన్న్యాసికాఁడు. అన్యుల నవమానించువాఁడు తపస్వి (శ్రమణుఁడు) కాఁడు. ఇట్లు బుద్ధులు చెప్పెదరు. ౬

పరుల నిందింపకుఁడు; హింసింపకుఁడు; నియతులై ధర్మము ననుసరింపుఁడు; మితముగ భుజింపుఁడు; ఏకాంతముగ నిద్రింపుఁడు; ఒంటరిగా గూర్చుండుఁడు. ఇదియే బుద్ధుల ప్రబోధము.

బంగరువానగురిసినను తృష్ణ తీరదు. తృష్ణవలనఁ గలుగు సంతోష మత్యల్పము, క్షణికము; కష్ట మత్యధికము. దీని నెఱిఁగినవాఁడే వివేకవంతుఁడు. ౮

వాఁడు స్వర్గసుఖములను గూడ నిరసించును. తృష్ణను దొలఁగించుకొని యానందించును. అట్టివాఁడు బుద్ధధర్మనిష్ఠుఁడు. ౯

భీతులయి నరులు పర్వతములను, వనములను, నికుంజములను, వృక్షములను, ఆశ్రయింతురు. ౧౦

ఈ ఆశ్రయములు క్షేమకరములు గావు. ఉత్కృష్టములు గావు. వీని యాశ్రయమువలన దుఃఖపటలము దూలిపోవదు. ౧౧

సమ్యక్ జ్ఞానియై బుద్ధుని, ధర్మమును, సంఘమును శరణు చొచ్చునది. దుఃఖము, దుఃఖోత్పత్తి, దుఃఖనివారణము, దుఃఖనివారకము లగు ఆర్యాష్టాంగమార్గములను నార్యసత్యముల నాల్గిటిని లెస్సగాఁ దెలియునది. ౧౨-౧౩

ఈఆశ్రయమే క్షేమంకరమైనది; ఇదియే ఉత్తమమైనది. దీనివలన నేసుఁడీ సర్వదుఃఖఫలము దూలిపోవునది. ౧౪

బుద్ధుఁడు దుర్లభుఁడు. అతఁ డన్ని దేశముల జన్మింపఁడు. ఆపవిత్రమూర్తి జన్మించిన దేశము, వంశము, కడు ధన్యములు. ౧౫

లోకకల్యాణముకొఱకు బుద్ధు లుదయింతురు. వారి ధర్మోపదేశములు సకల సుఖదాయకములు. బుద్ధసంఘైకమత్యము క్షేమదాయకము. ప్రశాంతమైన వారిజీవనము లోకమున కభ్యుదయము నొసఁగును. ౧౬

బుద్ధులును, తదనుచరులును, పూజార్హులు. వారు దుఃఖసముద్రమును దాఁటినవారు. దుష్టలోకమునకు దూరమయినవారు. ౧౭

ముక్తసంగులు, భయవిరహితులు నగునట్టి ప్రబుద్ధులను బూజించువాని పుణ్య మింతింత యనరానిది." ౧౮

## సుఖవగ్గో పణ్ణరసమో

సుసుఖం వత జీవామ వేరినేసు అవేరినో,
వేరినేసు మనుస్సేసు విహరామ అవేరినో. ౧

సుసుఖం వత జీవామ ఆతురేసు అనాతురా,
ఆతురేసు మనుస్సేసు విహరామ అనాతురా. ౨

సుసుఖం వత జీవామ ఉస్సుకేసు అనుస్సుకా,
ఉస్సుకేసు మనుస్సేసు విహరామ అనుస్సుకా. ౩

సుసుఖం వత జీవామ యేసం నో నత్థి కించనం,
పీతిభక్ఖా భవిస్సామ దేవా ఆభస్సరా యథా. ౪

జయం వేరం పసవతి దుక్ఖం సేతి పరాజితో,
ఉపసన్తో సుఖం సేతి హిత్వా జయపరాజయం. ౫

నత్థి రాగసమో అగ్గి నత్థి దోససమో కలి,
నత్థి ఖన్ధాదిసా దుక్ఖా నత్థి సన్తిపరం సుఖం. ౬

జిఘచ్ఛా పరమా రోగా సఙ్ఖార పరమా దుఖా,
ఏతం ఞత్వా యథాభూతం నిబ్బాణం పరమం సుఖం.౭

ఆరోగ్య పరమా లాభా సన్తుట్ఠిపరమం ధనం,
విస్సాసపరమా ఞాతి నిబ్బాణం పరమం సుఖం. ౮

పవివేకరసం పీత్వా రసం ఉపసమస్సచ,
నిద్దరో హోతి నిప్పాపో ధమ్మపీతిరసం పిబం. ౯

సాధు దస్సన మరియానం సన్నివాసో సదా సుఖో,
అదస్సనేన బాలానం నిచ్చమేవ సుఖీ సియా. ౧౦

బాలసఙ్గత చారీ హి దీఘ మద్ధానం సోచతి,
దుక్ఖో బాలేహి సంవాసో అమిత్తేనేవ సబ్బదా,
ధీరోచ సుఖసంవాసో ఞాతీనంఽవ సమాగమో. ౧౧

తస్మాహి
ధీరంచ పఞ్ఞంచ బహుస్సుతంచ
ఘోరయ్హసీలం వతవన్త మరియం,
తం తాదిసం సప్పురిసం సుమేధం
భజేథనక్ఖత్తపథంఽవ చన్దిమా. ౧౨

ఇతి సుఖవగ్గో పణ్ణరసమో.

## ౧౫. సుఖవర్గము

భిక్షువులలో నిద్దఱు జగడమాడుకొనిరి. వారికి మనస్తాప మధికముగ నుండెను. బుద్ధుఁ డది తెలిసికొని వారి కూఱట గలుగునట్లును, ఇతరభిక్షువులయుల్లములు పల్లవించు నట్లును భిక్షుసంఘమున నిలిచి యి ట్లుపదేశించెను:

“మనలను ద్వేషించినవారిని మనము ద్వేషింపక యానందింపవలెను. మన మనురాగము గలిగి ద్వేషించినవారిలో మెలఁగవలెను. ౧

రోగులనడుమ నీరోగులమై జీవింపవలెను. అనారోగ్యవంతులలో నారోగ్యముతో మెలఁగవలెను. అప్పుడే మనము సుఖింతుము. ౨

లోభులలో లోభమునకు లొంగకుండవలెను. ఆశాబద్ధులలో ఆశావిముఖులమై కలసిమెలసి మెలఁగవలెను. అట్లున్న మనకు మేలుకలుగును. ౩

‘నాయది’ అనునది యేదియు లేదని మనము తెలిసికొనవలెను. అపుడుగదా మనము స్వయంప్రకాశులగు దేవతలట్లు శాశ్వతసౌఖ్యానందము ననుభవించునది! ౪

జయము వైరమును గలిగించును. పరాజయము దుఃఖ
మును దెచ్చిపెట్టును. జయపరాజయ విదూరులై శాంతు
లై యుండువారుగదా సుఖము ననుభవించువారు. ౫

విషయసుఖములఁబోలిన అగ్ని లేదు. ద్వేషమట్లు మను
జుని దిగమ్రింగు మహాభూత మేదియు లేదు. శరీరమట్లు
దుఃఖములకుఁ బుట్టినిల్లగు పదార్థ మింకొకటి లేదు. శాంతి
కంటె సుఖమిచ్చునది వేఱొకటి లేదు. ౬

ఆకలికంటె మిక్కుటమైన రోగము లేదు. దేహధారణ
మునకంటె నధికమైన దుఃఖము లేదు. ఇది సత్యమని
యెఱుంగుఁడు. అపుడు నిర్వాణమునుమించిన సౌఖ్యము
లేదని తెలియును. ౭

సర్వోత్తమ మారోగ్యలాభము; సంతుష్టి సర్వాతిశాయి
యగు సంపద; విశ్వాసపాత్రుఁడు అనుఁగుఁజుట్టము; నిర్వా
ణ ముత్కృష్టసుఖసంధాయకము. ౮

ఏకాంతసౌఖ్యము ననుభవించువాఁడు, శాంతిని జవిచూ
చువాఁడు, నిర్భయుఁడై, నిష్పాపుఁడై నిర్వాణామృతపాన
మును గావించును. ౯

ఆర్యులదర్శన మానందకరము. ఎల్లపుడు వారితోఁగూడి యుండుట మేలు నొనగూర్చును. అవివేకులదర్శన మెప్పుడును గావింపకుండు టన్నిటికంటె సౌఖ్యమును గూర్చునది. ఇది సత్యము. ౧౦

అవివేకులతోఁ దిరుగువాఁడు చిరకాలము దుఃఖము ననుభవించుచుండును. శత్రువులఁ జేరఁదీసినట్లులే వారిని జేరి మనుట. అది ఎడతెగనికష్టములఁ దెచ్చిపెట్టును. సజ్జనసహవాసము సంతతానందదాయకము; అది ప్రియబంధువుతోఁ గూడియుండుటవంటిది సుఁడీ! ౧౧

కావున వివేకి, మేధావి, పండితుఁడు, శాంతుఁడు, కార్యదక్షుఁడు నగుసజ్జనుని అడుగులబడి నక్షత్రపథము వెంటఁ జంద్రుఁడువలె నడుచుకొనుట మేలు." ౧౨

## పియవగ్గో సోళసమో

అయోగే యుఞ్జమత్తానం యోగస్మించ అయోజయం,
అత్థం హిత్వా పియగ్గాహీ పిహేతఽత్తాను యోగినం. ౧

మా పియేహి సమాగఞ్ఛి అప్పియేహి కుదాచనం,
పియానం అదస్సనం దుక్ఖం అప్పియానంచ దస్సనం. ౨

తస్మా పియం నకయిరాథ పియాపాయో హి పాపకో,
గన్థా తేసం నవిజ్జన్తి యేసం నత్థి పియాప్పియం. 3

పియతో జాయతీ సోకో పియతో జాయతీ భయం,
పియతో విప్పముత్తస్స నత్థి సోకో కుతో భయం. ౪

పేమతో జాయతీ సోకో పేమతో జాయతీ భయం,
పేమతో విప్పముత్తస్స నత్థి సోకో కుతో భయం. ౫

రతియా జాయతీ సోకో రతియా జాయతీ భయం,
రతియా విప్పముత్తస్స నత్థి సోకో కుతో భయం. ౬

కామతో జాయతీ సోకో కామతో జాయతీ భయం,
కామతో విప్పముత్తస్స నత్థి సోకో కుతో భయం. ౭

తణ్హాయ జాయతీ సోకో తణ్హాయ జాయతీ భయం,
తణ్హాయ విప్పముత్తస్స నత్థి సోకో కుతో భయం. ౮

సీలదస్సనసమ్పన్నం ధమ్మట్ఠం సచ్చవాదినం,
అత్తనో కమ్మ కుబ్బానం తం జనో కురుతే పియం. ౯

ఛన్దజాతో అనక్ఖాతే మనసా చ ఫుటో సియా,
కామేసు చ అప్పటిబద్ధచిత్తో ఉద్ధం సోతోఽతి వుచ్చతి. ౧౦

చిరప్పవాసిం పురిసం దూరతో సోత్థి మాగతం,
ఞాతిమిత్తా సుహజ్జా చ అభినన్దంతి ఆగతం. ౧౧

తథేవ కతపుఞ్ఞంఽపి అస్మా లోకా పరం గతం,
పుఞ్ఞాని పటిగణ్హన్తి పియం ఞాతీఽవ ఆగతం. ౧౨

ఇతి పియవగ్గో సోళసమో

బాల్పడని మనస్సుగలవాఁడు 'ఊర్ధ్వస్రోతుఁ' డనఁబడు చున్నాఁడు. ౧౦

దూర దేశములకుఁ బోయి చిరకాలమునకు సురక్షితుఁడై వచ్చినవానిని ప్రియులు, మిత్రులు, బంధువులు సత్కరించెదరు. ౧౧

అట్లే యీలోకమునఁ గావించిన సత్కర్మములు మానవునికిఁ బరలోకమున స్వాగతమును జెప్పును." ౧౨

## కోధవగ్గో సత్తరసమో

కోధం జహే విప్పజహేయ్య మానం
సంయోజనం సబ్బ మతిక్కమేయ్య,
తం నామరూపస్మిం అసజ్జమానం,
అకించనం నానుపతన్తి దుక్ఖా. ౧

యో వే ఉప్పతితం కోధం రథం భన్తంవ ధారయే,
తమహం సారథిం బ్రూమి రస్మిగ్గాహో ఇతరో జనో. ౨

అక్కోధేన జినే కోధం అసాధుం సాధునా జినే,
జినే కదరియం దానేన సచ్చేన అలికవాదినం. ౩

సచ్చం భణే న కుజ్ఝేయ్య దజ్జాప్పస్మింపి యాచితో,
ఏతేహి తీహి ఠానేహి గచ్ఛే దేవాన సన్తికే. ౪

అహింసకా యే మునయో నిచ్చం కాయేన సంవుతా,
తే యన్తి అచ్చుతం ఠానం యత్థ గన్త్వా న సోచరే. ౫

సదా జాగరమానానం అహోరత్తానుసిక్ఖినం,
నిబ్బానం అధిముత్తానం అత్థం గచ్ఛన్తి ఆసవా. ౬

పోరాణ మేతం అతులం నేతం అజ్జతనా మివ,
నిన్దన్తి తుణ్హీ మాసీనం నిన్దన్తి బహుభాణినం,
మితభాణినంఽపి నిన్దన్తి నత్థి లోకే అనిన్దితో. ౭

నచాహు నచ భవిస్సతి న చేతరహి విజ్జతి,
ఏకన్తం నిన్దితో పోసో ఏకన్తం వా పసంసితో. ౮

యం చే విఞ్ఞూ పసంసన్తి అనువిచ్చ సువే సువే,
అచ్ఛిద్ద వుత్తిం మేధావిం పఞ్ఞాసీల సమాహితం. ౯

నేక్ఖం జమ్బోనదస్సేవ కోతం నిన్దితు మరహాసి,
దేవాఽపి నం పసంసన్తి బ్రహ్మునాఽపి పసంసితో. ౧౦

కాయప్పకోపం రక్ఖేయ్య కాయేన సంవుతో సియా,
కాయదుచ్చరితం హిత్వా కాయేన సుచరితం చరే. ౧౧

వచీపకోపం రక్ఖేయ్య వాచాయ సంవుతో సియా,
వచీదుచ్చరితం హిత్వా వాచాయ సుచరితం చరే. ౧౨

మనోపకోపం రక్ఖేయ్య మనసా సంవుతో సియా,
మనో దుచ్చరితం హిత్వా మనసా సుచరితం చరే. ౧౩

కాయేన సంవుతా ధీరా అథో వాచాయ సంవుతా,
మనసా సంవుతా ధీరా తే వే సుపరిసంవుతా. ౧౪

ఇతి కోధవగ్గో సత్తరసమో

## ౧౭. క్రోధవర్గము

రాహులుఁడను భిక్షుకుఁ డొకనాఁడు క్రోధావిష్టుఁడై వేఱొక భిక్షుకుని దుర్భాషలాడెను. ఆవిషయము బుద్ధునకుఁ దెలిసెను. అతఁ డొకప్పుడు యువభిక్షుకులందఱుఁ దనయుపదేశములను వినుటకై విహారమునఁ గూడి యుండ రాహులునకు బుద్ధి వచ్చున ట్లుపన్యసించెను:

“కోపమును జయింపుము; గర్వమును దూరమునఁ ద్యజింపుము. అట్లే బంధముల నన్నిటిని సడలించికొనుము. నామరూపములయందు మనస్సును జేరనీయకుము. దేనిని ‘నాయది’ అనుకొనకుము. అపుడుగదన్నా నీకష్టములు గట్టెక్కునది ? ౧

అరదము నిమ్మకొని యిచ్చవెంటఁ బరుగిడు హయముల నాఁపునట్లు పైపై నలముకొనుచున్న కోపము నాఁపఁ గలవాఁడుకదోయీ నిక్కముగ సారథి యనఁదగినవాఁడు!

ఇతరులూ [illegible] పగ్గములను జేతఁబట్టి అలంకారముగ నొగ లపైఁ గూర్చుండు వారు సుమా! ౨

క్రోధమును ప్రేమచేతఁ గూలఁద్రోయవలెను. చెడుగును మంచితనమున నడఁగఁద్రొక్కవలెను. లోభి నౌదార్యముచే లొంగఁదీయవలెను. అసత్యమును సత్యముచేత సంహరింపవలెను. 3

నిక్కమును బలుకుము. కోపమునకు గుఱిగాకుము. కోరినవారికించుకయైన నిమ్ము. ఈమూఁడు ధర్మములను మెట్లెంటఁ జనియెదవేని దేవతాసందర్శనము నీకుఁ గలుగును. ౪

జీవహింస చేయక, ఆత్మనిగ్రహము నభ్యసించిన సిద్ధపురుషులు శోకమోహాదులకుఁ జోటులేని అమృతపదముఁ (నిర్వాణమును) గాంతురు. ౫

అప్రమత్తులయి అహోరాత్రములు సుజ్ఞానమును సంపాదించుకొనుచు నిర్వాణమును గాంచఁ బ్రయత్నించు వారివి విషయ వాంఛలన్నియు వీడిపోవును. ౬

అతులుఁడా, "జనులు మౌనియగు వానినిఁ దిట్టెదరు. అల్లె వదరుఁబోతును దిట్టెదరు. మితముగ మాటలాడు వానిని దిట్టెదరు. ఇఁక లోకమున మంచివాఁడు మందునకయిన దొరకడు" ఇది ఆర్యోక్తి; పురాతనమైనది. ఈనాఁటిది కాదోయీ! ౭

కేవలము నిందింపఁ బడువాఁడును, కేవలము స్తుతింపఁబడు వాఁడును, ఇపు డీ ప్రపంచమున నొక్కఁడు లేఁడు; ఇదివఱకుండ లేదు; ఇఁకమీఁద నుండఁబోఁడు. ఇది నిక్కము సుమీ! ౮

జ్ఞానశీలు రెవ్వానిఁ గళంక రహితునిగను, మేధావిఁగను, పండితునిగను, గుణవంతునిగను గుర్తెఱిఁగి కొనియాడు దురో అట్టి వానిని మేలిమి బంగరు నాణెమునువలె నెవ్వరును దూషింపఁజాలరు. దేవతలే కాదు, బ్రహ్మకూడ వానిని గొనియాడునుగదోయీ! ౯-౧౦

క్రోధమును నీ దేహమునఁ గుదురుకొన నీయకుము; దేహమును వశము గావించుకొనుము. దానిచేఁ జెడుకార్య ములను జేయింపకుము. మంచి పనులను జేయింపుము. ౧౧

నాలుకపైఁ గ్రోధముఁ గుదురుకొననీయకుము; నాల్కను నీవశమున నుంచుకొనుము. పాపపుఁ బలుకులను బలుక నీయకుము. మాటలతో మంచివాఁడవు కమ్ము. ౧౨

మనమునఁ గ్రోధమును గుదురుకొననీయకుము. మనస్సును వశము గావించుకొనుము. దుశ్చింతలలో దాని దూర నీయకుము. సచ్చింతనముతో జీవితమును గడపుము. ౧౩

ఇట్లు త్రికరణములను జయించినవారే జ్ఞానులు. సంయములు." ౧౪

మలవగ్గో అట్ఠారసమో

పణ్డుపలాసోఽవ దానీఽసి
యమ పురిసాఽపిచ తం ఉపట్ఠితా,
ఉయ్యోగముఖేచ తిట్ఠసి
పాథేయ్యంఽపిచ తే నవిజ్జతి. ౧

సో కరోహి దీప మత్తనో
ఖిప్పం వాయమ పణ్డితో భవ,
నిద్ధన్తమలో అనఙ్గణో
దిబ్బం అరియభూమి మేహిసి. ౨

ఉపనీతవయోచ దానీఽసి
సంపయాతోఽసి యమస్స సన్తికే,
వాసోఽపిచ తే నత్థి అన్తరా
పాథేయ్యంఽపిచ తే నవిజ్జతి. ౩

సో కరోహి దీప మత్తనో
ఖిప్పం వాయమ పణ్డితో భవ,

నిద్ధన్తమలో అనఙ్గణో
　　నపున జాతిజరం ఉపేహిసి. ౪

అనుపుబ్బేన మేధావీ థోకథోకం ఖణేఖణే,
కమ్మారో రజతస్సేవ నిద్ధమే మల మత్తనో. ౫

అయసాఽవ మలం సముట్ఠితం
　　తదుట్ఠాయ తమేవ ఖాదతి,
ఏవం అతిధోనచారినం
　　సానికమ్మాని నయన్తి దుగ్గతిం. ౬

అసజ్ఝాయ మలా మన్తా అనుట్ఠానమలా ఘరా,
మలం వణ్ణస్స కోసజ్జం పమాదో రక్ఖతో మలం. ౭

మలిత్థియా దుచ్చరితం మచ్ఛేరం దదతో మలం,
మలా వే పాపకా ధమ్మా అస్మిం లోకే పరమ్హిచ ౮

తతో మలా మలతరం అవిజ్జా పరమం మలం,
ఏతం మలం పహాత్వాన నిమ్మలా హోథ భిక్ఖవో. ౯

సుజీవం అహిరీకేన కాకసూరేన ధంసినా,
పక్ఖన్దినా పగబ్భేన సంకిలిట్ఠేన జీవితం. ౧౦

హిరీమతాచ దుజ్జీవం నిచ్చం సుచిగవేసినా,
అలీనేనఽప్పగబ్భేన సుద్ధజీవేన పస్సతా. ౧౧

యో పాణ మతిపాతేతి ముసావాదంచ భాసతి,
లోకే అదిన్నం ఆదియతి పరదారంచ గచ్ఛతి. ౧౨

సురామేరయపానం చ యోనరో అనుయుఞ్జతి,
ఇధేఽవమేసో లోకస్మిం మూలం ఖణతి అత్తనో. ౧౩

ఏవం భో పురిస జానాహి పాపధమ్మా అసఞ్ఞతా,
మాతం లోభో అధమ్మోచ చిరం దుక్ఖాయ రన్ధయు.

దదాతి వే యథాసద్ధం యథాపసాదనం జనో,
తత్థ యో మఙ్కుభవతి పరేసం పానభోజనే,
స సో దివా వా రత్తింవా సమాధిం అధిగచ్ఛతి. ౧౪

యస్సచేఽతం సముచ్ఛిన్నం మూలఘచ్చం సమూహతం,
సవే దివావా రత్తింవా సమాధిం అధిగచ్ఛతి. ౧౫

నత్థి రాగసమో అగ్గి నత్థి దోససమో గహో,
నత్థి మోహసమం జాలం నత్థి తహ్నాసమా నదీ. ౧౬

సుదస్సం వజ్జ మఞ్ఞేసం అత్తనో పనదుద్దసం,
పరేసం హి సో వజ్జాని ఓపుణాతి యథాభుసం,
అత్తనో పన ఛాదేతి కలింవ కితవా సఠో. ౧౮

పరవజ్జానుపస్సిస్స నిచ్చం ఉజ్ఝానసఞ్ఞినో,
ఆసవా తస్స వడ్ఢన్తి ఆరా సో ఆసవక్ఖయా. ౧౯

ఆకాసే పదం నత్థి సమణో నత్థి బాహిరే,
పపఞ్చాభిరతా పజా నిప్పపఞ్చా తథాగతా. ౨౦

ఆకాసే పదం నత్థి సమణో నత్థి బాహిరే,
సఙ్ఖారా సస్సతా నత్థి నత్థి బుద్ధాన మిఞ్జితం. ౨౧

ఇతి మలవగ్గో అట్ఠారసమో

## ౧౯. మలవర్గము

త్రాగుఁబోతును, వ్యభిచారియు నగువాఁడొకఁడు బుద్ధుని గుణోన్నతిని విని యాతని దర్శింపవలెనని మిగులఁ గుతూహలపడుచుండెను. వాఁడొక్కమారు బుద్ధుని విహారమునకు రాఁగా భిక్షుకులు వానిని లోనికిఁబోనీయరైరి. గాఢమగు బుద్ధదర్శనాభిలాషతో వాఁడు వాకిటఁ బెక్కు

దినములు వేచియుండెను. ఒక్కనాఁడు బుద్ధుఁడు భిక్షు వులతోఁగూడ వెలుపలికి వచ్చెను. అప్పుడా పతితుఁడు భగవానుని పాదములపై వ్రాలి "స్వామీ! యీపతితు నుద్ధరింపుఁ"డని ప్రార్థించెను. బుద్ధుఁడు వానినిఁ బ్రేమతో లేవనెత్తి ఆదరించి మఱొకనాఁటి సంజవేళ విహారము నకు రమ్మనియెను. అట్లే వేఱొకనాఁడు వాఁడు రాఁగా భగవానుఁడు భిక్షుకుల నందఱనుగూర్చి యిట్లుపన్య సించెను.

"పతితుఁడా! పండుటాకువలెఁ బరిపక్వస్థితిని బడసినాఁడవు. యమదూతలు నీచెంతకుఁ జేరి యున్నారు. (ఈలోకము నుండి) తరలుటకు సంసిద్ధుఁడవుగ నున్నావు. కాని యిం కను దారిబత్తెమును సంతరించుకొనకున్నావుగదోయీ!

కావున నోయీ, ద్వీపమువలె స్థిరుఁడవుకమ్ము! త్వరపడి గట్టిగాఁ బ్రయత్నింపుము. వివేకము సంపాదించుకొనుము. నీకలుషములన్నియుఁ గడకుఁ బోవును. పరిశుద్ధుఁడవై దివ్యమగు నార్యలోకములను జేరుదువు.

నీ జీవయాత్ర అంత మొందినది. నీవు యమునిపొంతకుఁ జేరియున్నావు. పరలోక మార్గమున నీకు విశ్రాంతిస్థానము

కూడ లేదుగదోయీ! దారి బత్తెమును సైతము సేకరించుకొనకుంటివి కదన్నా! ౩

కావున నీవు ద్వీపమువలె స్థిరుఁడవగుము. త్వరపడి గట్టిగాఁ బ్రయత్నింపుము. వివేకమును సంపాదించుకొనుము. నీ కలుషము లన్నియుఁ గడకుఁబోవును. పరిశుద్ధుఁడ వయ్యెదవు. జననమరణ జాలములోఁ దగుల్కొనవు. ౪

కంసాలి వెండియందలి మురికిని బోఁగొట్టునట్లు వివేకియగు పురుషుఁడు క్రమముగ ననుక్షణమును దనపాపమును గొంచెము కొంచెముగా మాపుకొనవలెను. ౫

చిలుము ఇనుమునఁ బుట్టి క్రమముగ నినుమునే తిని వేయుచున్నది. అట్లే సన్మార్గము నతిక్రమించిన వాని పాపకార్యములు వానినే నశింపఁజేయుచున్నవి. ౬

మంత్రములు పునశ్చరణ గావింపమిని మలినములగును; గృహము లెప్పటికప్పుడు బాగుచేయకున్న శిథిలము లగును. అలసత సురూపముయొక్క మాలిన్యము. అజాగరూకత కాపలికానికిఁ జేటు. ౭

మగువలకు వ్యభిచారము మచ్చ; దాతకు లోభము కళంకము; అధర్మాచరణము ఇహపరముల రెంటను దూష్యము.

కాఁబట్టి దోషములలో నుత్కృష్టమైన దోషము అజ్ఞానము. దానిని మించిన దోషము లేదు. భిక్షుకులారా! ఆదోషమును దూరముగఁ ద్రోసిపుచ్చి సుజ్ఞానులై సుఖింపుఁడు. ౯

సిగ్గుమాలినవాఁడు, కాకివలె దుస్సాహసి యగువాఁడు, పరులకుఁ జెరుపుచేయువాఁడు, పరుల నవమానించువాఁడు, ధూర్తుఁడు, పాపి అగువానికి జీవనము సులభము.

వినయశీలుఁడు, నిరంతరము పుణ్యముల నాచరించువాఁడు, ఆశలేనివాఁడు, ధూర్తుఁడుకానివాఁడు, కళంకరహితుఁడు, జ్ఞాని అగువానికి జీవితము దుర్లభము. ౧౧

ప్రాణిహింస గావించువాఁడు, అబద్ధములాడువాఁడు, ఈయనిదస్తువును గొనువాఁడు, ఒరుని కాంతను గూడువాఁడు, కల్లుద్రావువాఁడు ఇహముననే తన మేలుయొక్క కుదుకుఁ వేరును ద్రవ్వుకొనుచున్నాఁడు. ౧౨–౧౩

ఓ మానవుఁడా! చెడుత్రోవలనుండి మరలుట సులువు కాదని తెలిసికొనుము. కావున దురాశకు లొంగకుము. దుష్కర్మల నాచరింపకుము. అవి నిన్నెడతెగని దుఃఖములపాలు సేయునుగదోయీ! ౧౪

మానవులు శ్రద్ధాభక్తుల ననుసరించి యీవి నిచ్చెదరు. పరుల భోజన పానీయములనుగాంచి యోర్వలేనివారలు రాత్రింబగళ్లు అశాంతమానసులై చివికిపోవుచుందురు. ౧౫
ఎవ్వడు హృదయమునుండి యట్టి దురూహాశల్యమును పెల్లగించివైచునో అట్టివాడు అహోరాత్రములు ప్రశాంత మనస్కుడై యుండును.

కాఱుచిచ్చువలె విషయవాంఛ దహించును. పిశాచమట్లు ద్వేషము దిగమ్రింగును. పాశమట్లు మోహము బంధించును. నదివలె దురాశ ముంచివేయును. ౧౭

పరులదోషములు లెక్కింపగ పాండిత్య మక్కరలేదు. తన దోషములను దాను దెలియుట కష్టసాధ్యము. మనుజుడు పరులదోషములను పొట్టువలె దూరుపాఱబట్టునుగాని మోసగాడగు జూదరి పాచికనుబోలె తన దోషమును మాత్రము దాచికొనును. ౧౮

పరుల దోషముల వెదకుచు, పరులు దన్నవమానించిరని చిరచిరలాడు వానివిషయవికారములు వృద్ధినొందును. మఱియు నట్టి వానికి విషయవికారవినాశము మిగుల దూరమున నుండును. ౧౯

ఆకాశమున జాడకనుపడదు. బాహ్యప్రపంచమున శ్రమ
ణుఁ డుండఁడు. జనులు ప్రపంచవ్యాపారములఁ జిక్కి
పొక్కుచుందురు. తథాగతులు ప్రపంచవ్యాపార
రహితులు. ౨౦

ఆకాశమున జాడకనుపడదు. బాహ్యప్రపంచమున శ్రమ
ణుఁడుండడు. సర్వవ్యక్తులు నశాశ్వతములు. బుద్ధులు
శాశ్వతులు. ౨౧

## ధమ్మట్ఠవగ్గో ఏకూనవీసతిమో

న తేన హోతి ధమ్మట్ఠో యేనత్థం సహసా నయే;
యోచ అత్థం అనత్థంచ ఉభో నిచ్ఛేయ్య పణ్డితో. ౧

అసాహసేన ధమ్మేన సమేన నయతీ పరే,
ధమ్మస్స గుత్తో మేధావీ ధమ్మట్ఠోతి పవుచ్చతి. ౨

న తేన పణ్డితో హోతి యావతా బహుభాసతి,
ఖేమీ అవేరీ అభయో పణ్డితోతి పవుచ్చతి. ౩

న తావతా ధమ్మధరో యావతా బహు భాసతి,
యోచ అప్పంపి సుత్వాన ధమ్మం కాయేన పస్సతి;
స వే ధమ్మధరో హోతి యో ధమ్మం నప్పమజ్జతి. ౪

న తేన థేరో హోతి యేనస్స పలితం సిరో,
పరిపక్కో వయో తస్స మోఘజిణ్ణోతి వుచ్చతి. ౫

యమ్హి సచ్చంచ ధమ్మోచ అహింసా సఞ్ఞమో దమో,
స వే వన్తమలో ధీరో థేరోతి పవుచ్చతి. ౬

నవాక్కరణ మత్తేన వణ్ణ పోక్ఖరతాయవా,
సాధురూపో నరో హోతి ఇస్సుకీ మచ్ఛరీ సఠో. ౭

యస్స చేతం సముచ్ఛిన్నం మూలఘచ్ఛం సమూహతం,
స వన్తదోసో మేధావీ సాధురూపోఽతి వుచ్చతి. ౮

న ముణ్డకేన సమణో అబ్బతో అలికం భణమ్,
ఇచ్ఛాలోభసమాపన్నో సమణో కిం భవిస్సతి. ౯

యోచ సమేతి పాపాని అణుం థూలాని సబ్బసో,
సమితత్తా హి పాపానం సమణోఽతి పవుచ్చతి. ౧౦

న తేన భిక్ఖు సో హోతి యావతా భిక్ఖతే పరే,
విస్సం ధమ్మం సమాదాయ భిక్ఖు హోతి న తావతా. ౧౧

యోఽధ పుఞ్ఞంచ పాపంచ బాహేత్వా బ్రహ్మచరియవా,
సఙ్ఖాయ లోకే చరతి సవే భిక్ఖూఽతి వుచ్చతి. ౧౨

న మోనేన మునీ హోతి మూళ్హరూపో అవిద్దసు,
యోచ తులంఽవ పగ్గయ్హ వర మాదాయ పణ్డితో. ౧౩

పాపాని పరివజ్జేతి స మునీ తేన సో మునీ,
యో మునాతి ఉభో లోకే మునీ తేన పవుచ్చతి. ౧౪

న తేన అరియో హోతి యేన పాణాని హింసతి,
అహింసా సబ్బపాణానం అరియోఽతి పవుచ్చతి. ౧౫

న సీలబ్బత మత్తేన బాహుసచ్చేన వా పున,
అథవా సమాధిలాభేన వివిచ్చ సయనేన వా. ౧౬

ఫుసామి నేక్ఖమ్మ సుఖం అపుథుజ్జన సేవితం,
భిక్ఖు విస్సాసమాపాది అప్పత్తో ఆసవక్ఖయమ్. ౧౭

ఇతి ధమ్మట్ఠవగ్గో ఏకూనవీసతిమో

## ౧౯. ధర్మస్థ (న్యాయ) వర్గము

సోమదత్తుఁడను రాజకుమారుఁడు నిత్యము బుద్ధభగవానుని దర్శనము చేయుచుండెడివాఁడు. అతఁడుద్రేకస్వభావముగలవాఁడు. మిత్రులయెడ మాత్రము ప్రియుఁడై యుండెడివాఁడు. ఒకనాఁ డాతఁడు మిత్రులతో మాటలాడుచుండ నొకమిత్రుఁడు“సోమదత్తా!నీవు వెనుకటిసోమ

## పకిణ్ణకవగ్గో ఏకవీసతిమో

మత్తా సుఖపరిచ్చాగా పస్సే చే విపులం సుఖం,
చజే మత్తా సుఖం ధీరో సంపస్సం విపులం సుఖం. ౧

పరదుక్ఖూపదానేన అత్తనో సుఖ మిచ్ఛతి,
వేర సంసగ్గ సంసట్ఠో వేరా సో నపరిముచ్చతి. ౨

యంహి కిచ్చం అపవిద్ధం అకిచ్చం పన కయిరతి,
ఉన్నలానం పమత్తానం తేసం వడ్ఢన్తి ఆసవా. ౩

యేసంచ సుసమారద్ధా నిచ్చం కాయగతా సతి,
అకిచ్చం తే న సేవన్తి కిచ్చే సాతచ్చకారినో,
సతానం సమ్పజానానం అత్థం గచ్ఛన్తి ఆసవా. ౪

మాతరం పితరం హన్త్వా రాజానో ద్వేచ ఖత్తియే,
రట్ఠం సానుచరం హన్త్వా అనీఘో యాతి బ్రాహ్మణో. ౫

మాతరం పితరం హన్త్వా రాజానో ద్వేచ సోత్థియే,
వేయ్యగ్ఘ పఞ్చమం హన్త్వా అనీఘో యాతి బ్రాహ్మణో. ౬

సుప్పబుద్ధం పబుజ్ఝన్తి సదా గోతమ సావకా,
యేసం ది వాచ రత్తోచ నిచ్చం బుద్ధగతా సతి. ౭

సుప్పబుద్ధం పబుజ్ఝన్తి సదా గోతమసావకా,
యేసం దివాచ రత్తోచ నిచ్చం ధమ్మగతా సతి. ౮

సుప్పబుద్ధం పబుజ్ఝన్తి సదా గోతమ సావకా,
యేసం దివాచ రత్తోచ నిచ్చం సంఘగతా సతి. ౯

సుప్పబుద్ధం పబుజ్ఝన్తి సదా గోతమసావకా,
యేసం దివాచ రత్తోచ నిచ్చం కాయగతాసతి. ౧౦

సుప్పబుద్ధం పబుజ్ఝన్తి సదా గోతమసావకా
యేసం దివాచ రత్తోచ అహింసాయ రతో మనో. ౧౧

సుప్పబుద్ధం పబుజ్ఝన్తి సదా గోతమ సావకా,
యేసం దివాచ రత్తోచ భావనాయ రతో మనో. ౧౨

దుప్పబ్బజ్జం దురభిరమం దురావాసా ఘరా దుఖా,
దుక్ఖోఽసమానసంవాసో దుక్ఖానుపతితద్ధగూ,
తస్మా న చద్ధగూ సియా దుక్ఖానుపతితో సియా. ౧౩

సద్ధో సీలేన సంపన్నో యసో భోగసమప్పితో,
యం యం పదేసం భజతి తత్థ తత్థేవ పూజితో. ౧౪

దూరే సన్తో పకాసేన్తి హిమవన్తోఽవ పబ్బతో,
అసన్తోఽత్థ నదిస్సన్తి రత్తిఖిత్తా యథా సరా. ౧౫

ఏకాసనం ఏకసేయ్యం ఏకో చరమతన్దితో,
ఎకో దమయమత్తానం వనన్తే రమితో సియా. ౧౬

ఇతి పకిణ్ణకవగ్గో ఏకవీసతిమో

## ౨౧. ప్రకీర్ణక వర్గము

యోగ్యులైన బుద్ధశిష్యులలో నొకఁడగు సారిపుత్త్రుఁడను భిక్షుకుఁడు బుద్ధునిపవిత్రోపదేశములు ప్రచారము చేయుచు దేశములఁ దిరిగితిరిగి గండకీనదీతీరమును జేరెను. అద్భుతమగు నాతనిబోధలు మిగుల నాకర్షకములై యుండెను. సమీపగ్రామవాసు లాతని దర్శింప వచ్చి నమస్కరించి "అయ్యా! పూజ్యుఁడగు బుద్ధభగవానునిపవిత్రోపదేశములను మాకు వినుపించి మమ్ముఁ బునీతులఁ జేయుఁ" డని ప్రార్థించిరి. అంత సారిపుత్త్రుఁడు బుద్ధభగవానుని ఉప

దేశములను లోకమునఁ బ్రచారముచేయునపుడు సందర్భము ననుసరించి నేను వానికి వ్యాఖ్యానము చెప్పుచుందును. ఇపుడు బుద్ధదేవుని దివ్యవాణినుండి వెలువడిన యీ యుపదేశములను జెప్పెదను. సావధానముతో వినుఁడు" అని యిట్లు చెప్పెను:

"స్వల్పసుఖమును వీడుటవలన నధికసుఖము గలుగునని తెలిసికొందువేని వివేకివై స్వల్పసుఖమును బరిగణింపక శాశ్వతసౌఖ్యమునుబొందఁ బ్రయత్నముచేయుము. ౧

ఆత్మసౌఖ్యముకొఱకుఁ బరులకుఁ బీడగలిగించువాఁడు ద్వేషపుటురులలోఁ దగుల్కొని వానినుండి యెన్నఁటికిని విముక్తిని బొందఁజాలఁడు. ౨

చేయఁదగిన పనులను జేయక, చేయరానిపనులను జేయుచు, అహంకారమున నకృత్యములఁ జేయువారి నాశాపాశములు గట్టిగాఁజుట్టుకొనును. 3

శరీరమును స్వాధీనపఱుచుకొని నిరంతరమును జాగరూకతతోఁ బ్రవర్తించువారు, అకృత్యముల నాచరింపనివారు, ఆచరింపవలసినకృత్యములను దప్పక యాచరించు

వారునగు సప్రమత్తులైన ధీమంతు లాశాపాశములనుండి విముక్తు లగుదురు. ౪

దండ్రులను జంపి, పరాక్రమశాలురగు నిద్దఱురాజులను జంపి, ప్రజలతోఁగూడ రాజ్యమును నాశనముచేసినను బ్రాహ్మణుఁడు దండార్హుఁడు గానేరఁడు. ౫

*తల్లి నిజంపి, దండ్రి నిజంపి, నీతులగు నిద్దఱురాజులను, శ్రోత్రియుఁడగు బ్రాహ్మణుని జంపినను బ్రాహ్మణుఁడు దండార్హుఁడు గానేరఁడు. ౬

రాత్రింబవళ్లప్రమత్తులై బుద్ధుని ధ్యానించువారు సుప్రబుద్ధులగు గౌతమశిష్యులు. ౭

రాత్రింబవళ్లప్రమత్తులై ధర్మము ననుష్ఠించువారు సుప్రబుద్ధులగు గౌతమశిష్యులు. ౮

రాత్రింబవళ్లప్రమత్తులై సంఘమునుగూర్చి ధ్యానించువారు సుప్రబుద్ధులగు గౌతమశిష్యులు. ౯

రాత్రింబవళ్లప్రమత్తులై కాయమునుగూర్చి చింతించుచుండువారు సుప్రబుద్ధులగు గౌతమశిష్యులు ౧౦

---

* అనుబంధమును జూచునది.

రాత్రింబవళ్లప్రమత్తులై యహింసారతులై యుండువారు
సుప్రబుద్ధులగు గౌతమశిష్యులు. ౧౧

రాత్రింబవళ్లప్రమత్తులై ధ్యానరతులై యుండువారు
సుప్రబుద్ధులగు గౌతమశిష్యులు. ౧౨

సన్న్యసించి ఏకాకియైయుండుట కష్టము. సంసారయాత్ర
ను సాగించుటయుఁ గష్టము. అసమానులు, అననుకూలు
రునగు వారితో నివసించుటయుఁ గష్టము. జనన మరణ
మార్గమున నిరంతరముఁ దిరుగుచుండుటకష్టము. కావున
నామార్గమున సంచారమునుగావించి దుఃఖముల పాలు
గాకుమన్నా! ౧౩

శ్రద్ధాళువు, గుణవంతుఁడు, యశోవంతుఁడు, ధనికుఁడు
నగువాఁ డున్నచోటమాత్రమే గౌరవమును గాంచును.

సత్పురుషుఁడు (తపస్సంపన్నుఁడు) హిమవత్పర్వతమువలె
దూరమున నున్నను ప్రకాశించుచుండును. రాత్రివేళఁ
బ్రయోగించిన అమ్ములవలె నసత్పురుషులు కన్నులకుఁ
గానరారు. ౧౫

ఏకాంతముగ నివసించుచు, ఏకాంతముగ శయనించుచు,
అప్రమత్తతో నేకాంతముగఁ జరియించుచుఁ దనయాత్మ
ను వశీకరించుకొన్నవాఁడు నిర్జనవనమున సుఖించును."

## నిరయవగ్గో బావీసతిమో

అభూతవాదీ నిరయం ఉపేతి

యో వాఽపి కత్వా న కరోమీఽతి చాహ,

ఉభోపి తే పేచ్చ సమా భవన్తి

న హీనకమ్మా మనుజా పరత్థ. ౧

కాసావకణ్ఠా బహవో పాపధమ్మా అసఞ్ఞతా,

పాపా పాపేహి కమ్మేహి నిరయం తే ఉపపజ్జరే. ౨

సేయ్యో అయోగుళో భుత్తో తత్తో అగ్గిసిఖూపమో,

యఞ్చే భుఞ్జేయ్య దుస్సీలో రట్ఠపిణ్డం అసఞ్ఞతో. ౩

చత్తారి ఠానాని నరో పమత్తో

ఆపజ్జతి పరదారూపసేవీ,

అపుఞ్ఞలాభం న నికామసేయ్యం

నిన్దం తతీయం నిరయం చతుత్థం. ౪

అపుఞ్ఞలాభో చ గతిచ పాపికా

భీతస్స భీతాయ రతీచ థోకికా,

రాజాచ దణ్డం గరుకం పణేతి
తస్మా నరో పరదారం న సేవే. ౫

కుసోయథా దుగ్గహితో హత్థమేవానుకన్తతి,
సామఞ్ఞం దుప్పరామట్ఠం నిరయాయుపకడ్ఢతి. ౬

యం కిఞ్చి సిథిలం కమ్మం సంకిలిట్ఠంచ యం వతం,
సఙ్కస్సరం బ్రహ్మచరియం న తం హోతి మహాప్ఫలం. ౭

కయిరంచే కయిరాథేనం దళ్హమేనం పరక్కమే,
సిథిలో హి పరిబ్బాజో భియ్యో ఆకిరతే రజం. ౮

అకతం దుక్కతం సెయ్యో పచ్ఛా తపతి దుక్కతం,
కతంచ సుకతం సేయ్యో యం కత్వా నానుతప్పతి. ౯

నగరం యథా పచ్చన్తం గుత్తం సన్తరబాహిరం,
ఏవం గోపేథ అత్తానం ఖణో వే మా ఉపచ్చగా,
ఖణాతీతాహి సోచన్తి నిరయమ్హి సమప్పితా. ౧౦

అలజ్జితాయే లజ్జన్తి లజ్జితాయే న లజ్జరే,
మిచ్ఛాదిట్ఠిసమాదానా సత్తా గచ్ఛన్తి దుగ్గతిం. ౧౧

అభయే భయదస్సినో భయే చాఽభయదస్సినో,
మిచ్ఛాదిట్ఠి సమాదానా సత్తా గచ్ఛన్తి దుగ్గతిమ్. ౧౨

అవజ్జే వజ్జమతినో వజ్జే చాఽవజ్జదస్సినో,
మిచ్ఛాదిట్ఠి సమాదానా సత్తా గచ్ఛన్తి దుగ్గతిం. ౧౩

వజ్జంచ వజ్జతో ఞత్వా అవజ్జంచ అవజ్జతో,
సమ్మాదిట్ఠి సమాదానా సత్తా గచ్ఛన్తి సుగ్గతిమ్. ౧౪

ఇతి నిరయవగ్గో బావీసతిమో

## ౨౨. నిరయవగ్గము

బుద్ధుఁడొకనాఁటి సంధ్యాకాలమునఁ దన శిష్యుఁడు సారిపుత్రునితోఁగూడి గంగాతీరమునఁ గూర్చుండి యుండెను. గంగానది వేగముగఁ బ్రవహించుచుండెను. బుద్ధుఁడు చాలసేపు మౌనముతో నా నదివంకఁ జూచుచుండఁగా సారిపుత్రుఁడు బుద్ధుని శ్రద్ధతోఁ జూచుచుండెను. అట్లు కొంతసేపైన తరువాత భగవానుఁ డిట్లు చెప్ప సాగెను:

"అసత్యవాది నరకమునఁ గూలుచున్నాఁడు. తానొకకార్యమును జేసి, చేయలేదని చెప్పువాఁడును, నరకమునఁ గూలుచున్నాఁడు. దుష్కార్యముల నాచరించిన నీయిరువురును బరలోకమున సమానులు. ౧

కాషాయాంబర ధారులు నియమరహితులునగు దుష్టులు పెక్కురు గలరు. పాపులగువారును నరకమునఁ గూలుదురు. ౨

అయోగ్యుఁడై లోకులు పరుల కొసఁగినదాని నపహరించి పొట్టఁబోసుకొనుటకంటె నిప్పువలె నెఱ్ఱఁగఁగాలిన యినుపముద్దను మ్రింగుట శ్రేయము. ౩

ఒడలెఱుంగక యన్యకాంతాలాలసుఁడై విచ్చలవిడి మెలఁగు దుశ్శీలుఁడు, పాపము, నిద్రాఽభావము, అపకీర్తి, తుదకు నరకమునను నాల్గుదుర్గతులను పొందును. ౪

దుర్దశ, పాపగతి, బెదరిన యొడఁదలు గల స్త్రీ పురుషుల యత్యల్పానందము, మీఁదు మిక్కిలి దుర్భరమగు రాజదండనమును గలిగించు నన్యకాంతాసక్తిని మనుజుఁడు దూరముగఁ బరిత్యజింపవలెను. ౫

కుదిరికఁగాబట్టుకొనని దర్భ చేతినే చీరునట్లు నియమముతోఁ బాటింపని సన్న్యాసము మానవుని నరకము పాలుచేయును. ౬

అశ్రద్ధతోఁ జేసినపని, భంగమునొందిన వ్రతము, కలంకయుతమయిన బ్రహ్మచర్యము ఫలము నొసఁగఁజాలవు. ౭

ఏదేని కార్యమాచరింపవలసిన, సామర్థ్యముతో గట్టిగా నాచరింపవలెను. ప్రమత్తుఁడగు సన్న్యాసి రాగరజమును దట్టముగా విరఁజిమ్మును. ౮

దుష్కర్మములను జేయకుండుట మేలు. చేయుదువేని పిదపఁ బశ్చాత్తాపముఁ జెందుదువు. సుకర్మములు శుభకరములు. అనంతరము పశ్చాత్తాపమును గలిగింపవు. ౯

బాహ్యాభ్యంతరములనుండి రాష్ట్రమును నలువైపులఁ గాపాడునట్లు తన్నుఁ దారక్షించుకొనవలెను. క్షణమైనను ఉపేక్షింపరాదు. కాలమును వ్యర్థముగ గడపువారు నరకములఁబడి దుఃఖింతురు. ౧౦

లజ్జింపనక్కఱలేనివానియెడ లజ్జించుచు, లజ్జింపవలసిన వానియెడ లజ్జింపక కపటనియమముల నాచరించు వంచకు లధోగతిని జెందుదురు. ౧౧

భయముగొన నక్కఱలేనివానియెడ భయమును జెందుచు, భయమునొందవలసినచోట భయమును జెందక కపటాచారపరాయణులగువా రధోగతిపాలగుదురు. ౧౨

నిషేధింపరానివానిని నిషేధించుచు, నిషేధింపవలసిన వానిని నిషేధింపక దంభాచారపరాయణులగువా రధోగతిపాలగుదురు. ౧౩

చెడుగును, చెడుగుగను, మంచిని మంచిగను గుర్తించి సత్యాచారపరాయణులయి మెలగువారు సుగతిని బొందుదురు." ౧౪

## నాగవగ్గో తేవీసతిమో

అహం నాగోఽవ సఙ్గామే చాపాతో పతితం సరం,
అతివాక్యం తితిక్ఖిస్సం దుస్సీలో హి బహుజ్జనో. ౧

దన్తం నయన్తి సమితిం దన్తం రాజాభిరూహతి,
దన్తో సేట్ఠో మనుస్సేసు యోఽతివాక్యం తితిక్ఖతి. ౨

వరమస్సతరా దన్తా ఆజానీయా చ సిన్ధవా,
కుఞ్జరా చ మహానాగా అత్తదన్తో తతో వరం. ౩

న హి ఏతేహి యానేహి గచ్ఛేయ్య అగతం దిసం,
యథాత్తనా సుదన్తేన దన్తో దన్తేన గచ్ఛతి. ౪

ధనపాలకో నామ కుఞ్జరో
కటుకప్పభేదనో దున్నివారయో,
బద్ధో కబలం న భుఞ్జతి,
సుమరతి నాగవనస్స కుఞ్జరో. ౫

మిద్ధీ యదా హోతి మహగ్ఘసో చ
నిద్దాయితా సమ్పరివత్తసాయీ,
మహావరాహోవ నివాపపుట్ఠో
పునప్పునం గబ్భ ముపేతి మన్దో. ౬

ఇదం పురే చిత్త మచారి చారికం
యే నిచ్ఛకం యత్థకామం యథాసుఖమ్,
తదజ్జహం నిగ్గహేస్సామి యోనిసో
హత్థిప్పభిన్నం వియ అంకుసగ్గహో. ౭

అప్పమాదరతా హోథ సచిత్త మనురక్ఖథ,
దుగ్గా ఉద్ధరథత్తానం పఙ్కే సన్నోవ కుఞ్జరో. ౮

సచే లభేథ నిపకం సహాయం
సద్ధించరం సాధువిహారిధీరం,
అభిభుయ్య సబ్బాని పరిస్సయాని
చరేయ్య తేన త్తమనో సతీమా. ౯

నో చే లభేథ నిపకం సహాయం
సద్ధించరం సాధువిహారిధీరం,

రాజా౽వ రట్ఠం విజితం పహాయ
ఏకో చరే మాతఙ్గ౽రఞ్ఞే౽వ నాగో. ౧౦

ఏకస్స చరితం సేయ్యో నత్థి బాలే సహాయతా,
ఏకో చరే నచ పాపాని కయిరా
అప్పొస్సుక్కో మాతఙ్గ౽రఞ్ఞే౽వనాగో. ౧౧

అత్థమ్హి జాతమ్హి సుఖా సహాయా
తుట్ఠీ సుఖా యా ఇతరీతరేన,
పుఞ్ఞం సుఖం జీవితసఙ్ఖయమ్హి
సబ్బస్స దుక్ఖస్స సుఖం పహాణం. ౧౨

సుఖా మత్తేయ్యతా లోకే అథో పేత్తేయ్యతా సుఖా,
సుఖా సామఞ్ఞతా లోకే, అథో బ్రహ్మఞ్ఞతా సుఖా. ౧౩

సుఖం యావ జరా సీలం సుఖా సద్ధా పతిట్ఠితా,
సుఖో పఞ్ఞాయ పటిలాభో పాపానం అకరణం సుఖం. ౧౪

ఇతి నాగవగ్గో తేవీసతిమో

## ౨౩. నాగవర్గము

బౌద్ధసంఘము చాతుర్మాస్యమునుగడిపి ధర్మప్రచారము నుజేయుటకు బయలుదేరెను. వారికి బుద్ధుఁ డధిపతిగా నుండెను. వారంపఱు మార్గమున నొక నదీతీరమును జేరిరి. బుద్ధుని దర్శించుట కొకరాజు సపరివారుఁడై వచ్చి బుద్ధుఁడు భిక్షుకులతోఁ గూడ నేటిని దాటఁబోవు చున్నాఁడని తెలిసి తన యేనుఁగులతో నదికి వంతెన గట్టించెను. బుద్ధుఁడు భిక్షుకులతోఁ గూడ నా వంతెనమీఁదనుండి యేటినిదాఁటి పరావలియొడ్డుననున్న యారాజు తోఁటలో నొకమామిడిచెట్టుక్రింద విశ్రమించెను. అప్పుడు భగవానుని యుపదేశము వినఁగుతూహలముగలవార లనేకు లక్కడకు వచ్చిరి. వారినుద్దేశించి బుద్ధుఁ డిట్లుపన్యసించెను:

"ఏనుఁగు యుద్ధరంగమున వింటినుండి వెలువడి తనపైఁ బడిన బాణముల కోర్చుకొనునట్లు నేను లోకనింద కోర్చుకొనవలెను. లోకము దుస్స్వభావముగలది గదన్నా! ౧

గజమును స్వాధీనముచేసికొని రణరంగమునకుఁ గొని పోవుదురు. వశము గావించుకొనిన యాగజముపయి రాజు

గూర్చుండును. నిందావాక్యములను సరకుగొనని దాంతుఁడుగదన్నా మానవులలో నుత్తముఁడు. ౨

వశముగావించుకొనిన కంచరగాడిదలు, ఉత్తమజాతిసింధుదేశపుగుఱ్ఱములు, దీర్ఘదంతములుగల మహాగజములు నుత్తమములు. అన్నిటికంటె నుత్తముఁ డాత్మనిగ్రహము గలవాఁడు. 3

ఈమార్గములన్నియుఁ జేరశక్యముగాని స్థానము(నిర్వాణపదమును) జేర్పఁజాలవు. కాని ఆత్మవశీకరణమార్గమున నాస్థానమును జేరనగును.

మదోదకమును స్రవించు ధనపాలక మనుగజరాజముకట్టువడి యాహారమును గొననొల్లక నాగవనమును గూర్చిపోవఁదలఁచుచుండును. ౫

తిండిపోతయి కండను బెంచుకొని నిద్రామత్తుఁడయి యిటునటుదొరలుచునుండు నవివేకి చిత్తచెదారములఁ దిని బలిసిన పెనుబందివలె జననమరణచక్రమునఁ బడి యెడతెగక తిరుగుచుండును. ౬

ఈమనస్సు తొలుతఁ దనయిచ్ఛకువచ్చినట్లు సుఖముగ నెల్లెడలఁ దిరుగుచుండినది. మావటివాఁ డేనుఁగు నంకుశ మునఁ బొడిచి లోఁబఱుచుకొనునట్లు దాని నిప్పుడు శిక్షిం చి వశము గావించు కొనెదను. ౭

పట్టుదల కలిగియుండుము. చిత్తమును జక్కఁబట్టియుం డుము. బురదలోఁ బ్రుంగిన కరినివలె దుర్గతినుండి నిన్నుద్ధ రించుకొనుము. ౮

నేర్పరి, సత్శీలుఁడు, దృఢమనస్కుఁడు నగు సహచరి తోడుదొరకెనేని అపాయములను నరకుఁగొనక తదేక చిత్తుఁడవై సంతోషముతో నాతివెంటఁ జనుము. ౯

నేర్పరి, సత్శీలుఁడు దృఢమనస్కుఁడు నగు సహచరి తోడు దొరకఁడేని జయించిన రాష్ట్రమును బరిత్యజించిన రాజు వలెను, అరణ్యమునందలి గజమువలెను, ఏకాంతచారివి కమ్ము. ౧౦

మూర్ఖుల సహవాసముకంటె నొంటిగనుండు జీవితమును గడపుట మేలు. కాన నేకాకివై బ్రదుకుము. పాపములు పాలుగాకుము. వాంఛాదిహీనుఁడవై అరణ్యమున గజము వలె విచ్చలవిడినుండుము. ౧౧

అక్కఱకు ఆదుకొనుహితు లుత్తములు. సంతుష్టి యెట్టిదై నను సుఖసంధాయకము. జీవితాంతమునఁ గావించు పుణ్యము శ్రేయోదాయకము. సర్వదుఃఖపరిత్యాగ మానందకరము. ౧౨

మాతృత్వము సుఖము నిచ్చును; పితృత్వము సుఖము నిచ్చును; శ్రమణత్వము సుఖము నిచ్చును; అట్లే బ్రాహ్మణత్వమును సుఖము నిచ్చును. ౧౩

ముదిమివఱకు మంచినడవడి గలిగియుండుట మేలు. సుదృఢమైన శ్రద్ధ సుఖదాయకము. సుజ్ఞానప్రాప్తి సుఖమును గూర్చును. పాపములను గావింపకుండుట పరమానందకరము."

తణ్హావగ్గో చతువీసతిమో

మనుజస్స పమత్తచారినో
తణ్హా వడ్ఢతి మాలువా వియ,
సో ప్లవతి హురాహురం
ఫలమిచ్ఛం'వ వనస్మిం వానరో. ౧

యం ఏసా సహతి జమ్మీ తణ్హా లోకే విసత్తికా,
సోకా తస్స పవడ్ఢన్తి అభివడ్ఢం'వ బీరణం. ౨

యో చేతం సహతి జమ్మిం తణ్హం లోకే దురచ్చయం,
సోకా తమ్హా పపతన్తి ఉదబిన్దూ'వ పోక్ఖరా. 3

తం వో వదామి భద్దం వో యావన్తేత్థ సమాగతా,
తణ్హాయ మూలం ఖణథ ఉసీరత్థో'వ బీరణం;
మా వో నళం'వ సోతో'వ మారో భఞ్జి పునప్పునం. ౪

యథా'పి మూలే అనుపద్దవే దళ్హే
ఛిన్నో'పి రుక్ఖో పునరేవ రూహతి,

ఏవంఽపి తణ్హానుసయే అనూహతే
నిబ్బత్తతీ దుక్ఖ మిదం పునప్పునం. ౫

యస్స ఛత్తింసతీ సోతా మనాపసవనా భుసా,
వాహా వహన్తి దుద్దిట్ఠిం సంకప్పా రాగనిస్సితా. ౬

సవన్తి సబ్బధీ సోతా లతా ఉబ్భిజ్జ తిట్ఠతి,
తంచ దిక్ఖా లతం జాతం మూలం పఞ్ఞాయ ఛిన్దథ. ౭

సరితాని సినేహితానిచ
సోమనస్సాని భవన్తి జన్తునో,
తే సాతసితా సుఖేసినో,
తేవే జాతి జరూపగా నరా. ౮

తసినాయ పురక్ఖతా పజా
పరిసప్పన్తి ససోఽవ బాధితో,
సఞ్ఞోజన సఙ్గసత్తా
దుక్ఖముపేన్తి పునప్పునం చిరాయ. ౯

తసినాయ పురక్ఖతా పజా
పరి స్సప్పన్తి ససోఽవ బాధితో,

తస్మా తసినం వినోదయే
భిక్ఖు ఆకఙ్ఖీ విరాగ మత్తనో. ౧౧

యో నిబ్బనథో వనాధిముత్తో
వనముత్తో వనమేవ ధావతి,
తం పుగ్గలమేవ పస్సథ
ముత్తో బన్ధన మేవ ధావతి. ౧౧

న తం దళ్హం బన్ధన మాహు ధీరా
యదాయసం దారుజం బబ్బజంచ,
సారత్తరత్తా మణికుణ్డలేసు
పుత్తేసు దారేసుచ యా అపేక్ఖా ౧౨

ఏతం దళ్హం బన్ధన మాహు ధీరా
ఓహారినం సిథిలం దుప్పముఞ్చం,
ఏతంపి ఛేత్వాన పరిబ్బజన్తి
అనపేక్ఖినో కామసుఖం పహాయ. ౧౩

యే రాగరత్తానుపతన్తి సోతం
సయం కతం మక్కటకోవ జాలం,

ఏతంఽపి ఛేత్వాన వజన్తి ధీరా
అనపేక్ఖినో సబ్బదుఃఖం పహాయ. ౧౪

ముఞ్చ పురే ముఞ్చ పచ్ఛతో
మజ్ఝే ముఞ్చ భవస్స పారగూ,
సబ్బత్థ విముత్త మానసో
న పున జాతిజరం ఉపేహిసి. ౧౫

వితక్కపమథితస్స జన్తునో
తిబ్బరాగస్స సుభానుపస్సినో,
భియ్యో తణ్హా పవడ్ఢతి
ఏస ఖో దళ్హం కరోతి బన్ధనం. ౧౬

వితక్కూపసమే చ యో రతో
అసుభం భావయతి సదా సతో,
ఏస ఖో వ్యన్తి కాహితి
ఏస ఛేచ్ఛతి మారబన్ధనం. ౧౭

నిట్ఠంగతో అసన్తాసీ వీతతణ్హో అనఙ్గణో,
అచ్ఛిద్ద భవసల్లాని అన్తిమోఽయం సముస్సయో. ౧౮

వీతతణ్హో అనాదానో నిరుత్తిపదకోవిదో,
అక్ఖరానం సన్నిపాతం జఞ్ఞా పుబ్బాపరానిచ;
సవే అన్తిమసారీరో మహాపఞ్ఞో మహాపురిసోఽతి వుచ్చతి

సబ్బాభిభూ సబ్బవిదూఽహమస్మి
సబ్బేసు ధమ్మేసు అనూపలిత్తో,
సబ్బఞ్జహో తణ్హక్ఖయే విముత్తో
సయం అభిఞ్ఞాయ క ముద్దిసేయ్యం. ౨

సబ్బదానం ధమ్మదానం జినాతి
సబ్బం రసం ధమ్మరసో జినాతి,
సబ్బం రతిం ధమ్మరతీ జినాతి
తణ్హక్ఖయో సబ్బ దుక్ఖం జినాతి. ౩

హనన్తి భోగా దుమ్మేధం నో చే పారగవేసినో,
భోగతణ్హాయ దుమ్మేధో హన్తి అఞ్ఞేవ అత్తనం. ౪

తిణదోసాని ఖేత్తాని రాగదోసా అయం పజా,
తస్మాహి వీతరాగేసు దిన్నం హోతి మహప్ఫలం. ౫

తిణదోసాని ఖేత్తాని దోసదోసా అయం పజా,
తస్మాహి వీతదోసేసు దిన్నం హోతి మహప్ఫలం. ౨౪

తిణదోసాని ఖేత్తాని మోహ దోసా అయం పజా,
తస్మాహి వీతమోహేసు దిన్నం హోతి మహప్ఫలం. ౨౫

తిణదోసాని ఖేత్తాని ఇచ్ఛాదోసా అయం పజా,
తస్మాహి విగతిచ్ఛేసు దిన్నం హోతి మహప్ఫలం. ౨౬

ఇతి తణ్హావగ్గో చతువీసతిమో

## ౨౪. తృష్ణావర్గము

బుద్ధుఁడు వైశాలికి వచ్చుచున్నాఁడని విని వారినివాసము నకై ఆనగరవాసులు పెద్దమైదానమున డేరాలు వేయించిరి. బుద్ధుఁ డాసాయంకాలమునకు భిక్షాపాత్రమును జేతఁబట్టుకొని శిష్యులతోఁగూడ వచ్చుచుండెను. ఆతని మూర్తి దర్శనీయముగ నుండెను. ప్రజ లెదురేఁగి భగవానునిఁ దోడితెచ్చి యొకడేరాలో విడియించిరి. అచ్చట నమర్చియున్న యున్నతాసనముపైఁ గూర్చుండి చుట్టు

నున్న శ్రోతలనుగూర్చి మధురగంభీరస్వరముతో భగవానుఁడు దన ప్రేమసందేశము నిట్లు బోధించెను.

"అలసునిత్రృష్ణ తీగవలెఁ బెరుఁగును. పండ్లను బడయఁగోరి వానరము వనమున నొకకొమ్మనుండి మఱియొక కొమ్మకుఁ దుముకులాడునట్లు వాఁడు పుట్టువులపుట్టలోఁ బడి కొట్టుకొనుచుండును. ౧

విషతిక్తమైన తృష్ణకు వశుఁడవు కాకుము. అవురుగడ్డి అల్లుకొనురీతిని తృష్ణవలన శోకములు పెల్లయి నిన్ను నిరంతరము బాధించును. ౨

తీవ్రమగుతృష్ణ సహింపరానిది. దానిని సహించిన వానిని దామరాకును జలబిందువులువలె శోకము లంటవు. ౩

"సభాస్తారులారా! వట్టివేరు కాసించువాఁ డవురుగడ్డి నున్మూలించునట్లు మీరు తృష్ణను ద్రుంచివేయుఁడు. తీవ్రమగు నదీప్రవాహము జెల్లుగడ్డినివలె మృత్యువు మిమ్ముఁ బలుమారు మ్రింగనీయకుఁడు." ఇది నాచేయు మేలి యుపదేశము. ౪

చెట్టు నఱికి వేసినమాత్రమునఁ జావదు. వేళ్లతోఁ బెల్లగించివేయవలెను. లేకున్న మరలఁ జిగుర్చుచుండును. అట్లే తృష్ణాలేశము మిగిలియున్నను నది మఱల నభివృద్ధి నొంది పునర్జనన దుఃఖమును దెచ్చిపెట్టును. ౫

ముప్పదియాఱు స్రోతస్సులును మనుజుని సుఖమువంక కీడ్చుకొనిపోవును. రాగాదులను వెడలఁగ్రక్కుచున్న వానిభావములు అలలవలె వానిని దూరమునకుఁ గొట్టుకొనిపోయి ముంచివైచును. ౬

స్రోతస్సులు ఎల్లదిక్కులఁ బ్రవహించుచున్నవి. కాని తృష్ణాలత గట్టిగ వేళ్లు నాటుకొనును. ఆతీగ పైకిఁ బ్రాకి యల్లుకొనకమునుపే దానిని జ్ఞానలవిత్రముచేఁ ద్రుంచి వేయుము. ౭

మానవుని కోరికలు లెక్కలేనివి. నిరంతరము నవి వాని నంటియుండును. వానికి లోఁబడి సుఖమును బడయఁ గోరువాఁడు జననమరణచక్రమునఁ దగుల్కొని పరిభ్రమించుచుండును. ౮

వలను జిక్కి తప్పించుకొన నిటునటుఁ దిరుగుకుందేళ్లవలె మానవులు తృష్ణాపాశములఁ దగుల్కొని వానిఁ ద్రెంపఁ

జాలక చిరకాలము దుఃఖముల ననుభవించుచుందురు. ౯

వలనుజిక్కిన కుందేళ్లవలె మానవులు తృష్ణాపాశములఁ దగుల్కొని వానినిఁ ద్రెంపఁజాలక యిటునటు బరువులె త్తుచుందురు. కావున నాత్మవిముక్తిని గోరు భిక్షుకుఁడు విషయతృష్ణలను విడువవలెను. ౧౦

వనమునుండి వెలువడినవాఁడు మరల వనములోనికే పఱువెత్తునట్లు కామారణ్యమునుండి వెలువడి మరల నందే చిక్కుకొనువాఁడు విముక్తుఁడయ్యును మరల దుఃఖములపాలగుచున్నాఁడు! పరికింపుఁడు వాని. ౧౧

"మనుజుని గట్టిగాఁ గట్టిపెట్టఁజాలునవి ఇనుపగొలుసులు, కొయ్యబొండలు, త్రాళ్లును గావు. ఆలుబిడ్డలు, నగలు, రొక్కము మొదలగువానిపైఁగల యభిలాషయే చిర కాలము వానిని గట్టిగాఁ గట్టిపెట్టునవి" ఇట్లు పండితులు చెప్పుదురు. ౧౨

మఱియు వారిట్లు చెప్పుచున్నారు: "మోచికొనిపోఁదగినదయ్యు, వదులయినదయ్యు, విడిపించుకొన నసాధ్యమగు బంధమే నిక్కమయిన బంధము. ఈ బంధము (కామ

బంధము)ను ద్రెంచుకొని ఆశలనువీడి ప్రజ్ఞావంతులు చరి యింతురు." ౧౩

సాలీడు తానల్లినగూటిలోననే తిరుగుచుండునట్లు కామములకు లోగినవాఁడు తృష్ణాప్రవాహమునఁ బడి కొట్టుకొనిపోవును. ప్రజ్ఞావంతులు కామములను ఖండించి తృష్ణాప్రవాహము నెదురీది దుఃఖవిముక్తిని గాంతురు. ౧౪

భూత భవిష్య ద్వర్తమాన బంధనములను సడలించుకొనుఁడు. సంసారసముద్రమున కావలిగట్టు (నిర్వాణము) ను జేరుకొనుఁడు. సర్వవిముక్తులగు మీచెంతకు జనన మరణములు చేరఁజాలవు. ౧౫

సంశయాకులుఁడు, రాగానురక్తుఁడు, భోగాభిలాషియగువాఁడు తృష్ణను లెస్సగాఁ బెంచుకొని దానిచే గట్టిగాఁ గట్టఁబడుచున్నాఁడు. ౧౬

సంశయమును బాపుకొని యానందించుచు, దేహవికారములయెడ రోఁతను భావించువాఁడు మృత్యు(మార)పాశములను సడల్చుకొనఁగలఁడు. మఱియు వానినిఁ దునాతునకలుగఁ ద్రుంచివేయఁగలఁడు. ౧౭

గమ్యస్థానమును జేరినవాఁడు, భయవిరహితుఁడు, తృష్ణా దూరుఁడు, పాపవిముఖుఁడు నగువానికి, భవశల్యముల నేరి పారవైచినవానికిని నదియే కడపటి జన్మము. తరువాత వానికిఁ బుట్టువులేదు. ౧౮

ఆసను ద్రోసిపుచ్చి, కూటమిని గూల్చి, ధర్మతత్త్వవినతి యందు నిపుణుఁడయి, వర్ణముల పూర్వాపర సన్నిపాతమును జక్కఁగాఁ దెలిసి తెలిసిన వాఁడు ప్రజ్ఞాన ఘనుఁడు; వాఁడే మహాపురుషుఁడు. వాఁడు మఱలఁ బుట్టఁడుసుమా! వానికదియే కడపటిజన్మము. ౧౯

నే నన్నిటను గెలుపుగొన్నవాఁడను; నాకన్నియుఁ దెలియును; నేనెల్ల (శరీర)ధర్మములను దూరమునఁ విడనాడితిని; నేను దృష్ణను ద్రుంగఁజేసితిని. జ్ఞానినై స్వయముగ సర్వమును బరిత్యజించి ముక్తుఁడనైతిని. ఎవరినిఁ(గురువని) జెప్పఁగలన్నా! ౨౦

ధర్మదాన మన్నిదానములకన్న మిన్న. ధర్మరస మన్ని రసములకంటె రుచ్యము. ధర్మానంద మెల్ల యానందములలో మెల్ల. తృష్ణాక్షయము సర్వదుఃఖక్షయమున కంటె నుత్తమము. ౨౧

భోగభాగ్యములు బుద్ధిహీనుని బుగ్గిని గలుపును. కాని భవసాగరపారమును జేరఁబోవువాని కావంతయు వాని భయము లేదు. భోగాసక్తుఁడగు నవివేకి శత్రువవలెఁదానే తనకుఁ జేటు దెచ్చుకొనును. ౨౨

గడ్డిగాదముచేఁ జేను చెడిపోవును. రాగముచేఁ బ్రజలు పాడగుదురు. కావున విరాగుల కొసఁగినదాన మనంత ఫలదాయకము. ౨౩

గడ్డిగాదముచేఁ జేను చెడిపోవును. ద్వేషముచేఁ బ్రజలు దోషు లగుదురు. కావున వీతద్వేషుల కొసఁగిన దాన మనంతఫలదాయకము. ౨౪

గడ్డిగాదముచేఁ జేను చెడిపోవును. మోహముచేఁ బ్రజలు ముష్కరు లగుదురు. కావున వీతమోహుల కొసఁగిన దాన మనంతఫలదాయకము. ౨౫

గడ్డిగాదముచేఁ జేను చెడిపోవును. వాంఛచేఁ బ్రజలు వంచకు లగుదురు. కావున వాంఛారహితుల కొసఁగిన దాన మనంతఫలదాయకము." ౨౬

## తృష్ణా వర్గము

## భిక్ఖువగ్గో పంచవీసతిమో

చక్ఖునా సంవరో సాధు సాధు సోతేన సంవరో,
ఘానేన సంవరో సాధు సాధు జివ్హాయ సంవరో. ౧

కాయేన సంవరో సాధు సాధు వాచాయ సంవరో,
మనసా సంవరో సాధు సాధు సబ్బత్థ సంవరో;
సబ్బత్థ సంవుతో భిక్ఖు సబ్బదుక్ఖా పముచ్చతి. ౨

హత్థసఞ్ఞతో పాదసఞ్ఞతో
వాచాయ సఞ్ఞతో సఞ్ఞతుత్తమో,
అజ్ఝత్తరతో సమాహితో
ఏకో సన్తుసితో తమాహు భిక్ఖుం. 3

యో ముఖసఞ్ఞతో భిక్ఖు మన్తభాణీ అనుద్ధతో,
అత్థం ధమ్మంచ దీపేతి మధురం తస్స భాసితం. ౪

ధమ్మారామో ధమ్మరతో ధమ్మం అనువిచిన్తయం,
ధమ్మం అనుస్సరం భిక్ఖు సద్ధమ్మా నపరిహాయతి. ౫

సలాభం నాతి మఞ్ఞేయ్య నాఽఞ్ఞేసం పిహాయం చరే,
అఞ్ఞేసం పిహాయం భిక్ఖు సమాధిం నాధిగచ్ఛతి. ౬

అప్పలాభోఽపిచే భిక్ఖు సలాభం నాతి మఞ్ఞతి,
తంవే దేవా పసంసన్తి సుద్ధా జీవం అతన్దితమ్. ౭

సబ్బసో నామరూపస్మిం యస్స నత్థి మమాయితం,
అసతాచ నసోచతి సవే భిక్ఖూఽతి వుచ్చతి. ౮

మేత్తా విహారీ యోభిక్ఖు పసన్నో బుద్ధసాసనే,
అధిగచ్ఛే పదం సన్తం సఙ్ఖారూపసమం సుఖం ౯

సిఞ్చ భిక్ఖు ఇమం నావం సిత్తా తే లహు మేస్సతి,
ఛేత్వా రాగంచ దోసంచ తతో నిబ్బాణ మోహిసి. ౧౦

పఞ్చ ఛిన్దే పఞ్చ జహే పఞ్చ చుత్తరి భావయే,
పఞ్చ సఙ్గాతిగో భిక్ఖు ఓఘతిణ్ణోఽతి వుచ్చతి. ౧౧

ఝాయ భిక్ఖు మాచ పమాదో
మాతే కామగుణే భమస్సు చిత్తం,

మా లోహగుళం గిలీ పమత్తో
మా కన్ది దుక్ఖ మిదన్తి డయ్హమానో. ౧౨

నత్థి ఝానం అపఞ్ఞస్స పఞ్ఞా నత్థి అఝాయతో,
యమ్హి ఝానంచ పఞ్ఞంచ సవే నిబ్బాణసన్తికే. ౧౩

సుఞ్ఞాగారం పవిట్ఠస్స సన్తచిత్తస్స భిక్ఖునో,
అమానుసీ రతీ హోతి సమ్మా ధమ్మం విపస్సతో. ౧౪

యతో యతో సమ్మసతి ఖన్ధానం ఉదయబ్బయం,
లభతి పీతిపామోజ్జం అమతం తం విజానతం. ౧౫

తత్రాయ మాది భవతి ఇధ పఞ్ఞస్స భిక్ఖునో,
ఇన్ద్రియ గుత్తి సన్తుట్ఠీ పాతిమోక్ఖేచ సంవరో;
మిత్తే భజస్సు కల్యాణే సుద్ధాజీవే అతన్దితే. ౧౬

పటిసన్థార వుత్తస్స ఆచారకుసలో సియా,
తతో పామోజ్జ బహులో దుక్ఖస్సన్తం కరిస్ససి. ౧౭

వస్సికావియ పుప్ఫాని మద్దవాని పముఞ్చతి,
ఏవం రాగంచ దోసంచ విప్పముఞ్చేథ భిక్ఖవో. ౧౮

సన్తకాయో సన్తవాచో సన్తమనో సుసమాహితో,
వన్తలోకామిసో భిక్ఖు ఉపసన్తోఽతి వుచ్చతి. ౧౯

అత్తనా చోదయఽత్తానం పటిమాసే అత్త మత్తనా,
సో అత్తగుత్తో సతిమా సుఖం భిక్ఖు విహాహిసి. ౨౦

అత్తాహి అత్తనో నాథో అత్తాహి అత్తనో గతి,
తస్మా సఞ్ఞమ యత్తానం అస్సం భద్రంఽవ వాణిజో. ౨౧

పామోజ్జ బహులో భిక్ఖు పసన్నో బుద్ధసాసనే,
అధిగచ్ఛే పదం సన్తం సఙ్ఖారూప సమం సుఖం. ౨౨

యో హవే దహరో భిక్ఖు యుఞ్జతి బుద్ధసాసనే,
సో ఇమం లోకం పభాసేతి అబ్భా ముత్తోఽవ చన్దిమా.

ఇతి భిక్ఖువగ్గో పఞ్చవీసతిమో

## ౨౫ భిక్షువర్గము

ఇక్ష్వాకు వంశపురాజులిద్దఱు లోకనాథుఁడు భిక్షుకత్వము స్వీకరింపఁగోరి బుద్ధునొద్దకువచ్చిరి. అపుడు బుద్ధభగవానుఁడు వారికిట్లుపదేశించెను:

"చక్షుశ్శ్రోత్ర జిహ్వాఘ్రాణములను నింద్రియముల యొక్క వికారములను త్రోసిపుచ్చుట మేలు. ౧

వాఙ్మనఃకాయములు వశముగావించుకొని తద్వికారములకు లోనుగాకుండుట, సర్వవిషయ నిగ్రహము లెస్స. విషయ విముఖుఁడగు భిక్షుకుఁడు దుఃఖములచే బాధ నొందఁడు. ౨

వాక్పాణిపాదములను వశపఱచుకొని అధ్యాత్మనిరతుఁడు, శాంతుఁడు, నిత్యసంతుష్టుఁడు, ఏకాకియు నగు యోగ్యు వానిని భిక్షువందురు. 3

నోటిని అదుకొని, వీతగర్వుఁడై బౌద్ధమంత్రముల వక్కాణించుచుఁ దదర్థధర్మములను జక్కఁగా వివరించి యుపన్యసించు భిక్షుకుని వాక్కులు కడుమధురములు. ౪

ధర్మనిష్ఠుఁడై, ధర్మాసక్తి గలిగి ధర్మమునే పర్యాలోచించుచు, ధర్మము ననుసరించి ధర్మము నాచరించుభిక్షుకుఁడు సద్ధర్మమార్గచ్యుతుఁ డెన్నఁటికిని గానేరఁడు. ౫

భిక్షుకుఁడు తనకు లభించినదానిని దిరస్కరింపఁ జనదు. పరులకు లభించినదానికై యసూయఁ జెందఁజనదు. ఇతర భిక్షుకులనుగూర్చి యసూయపడువాఁడు మనశ్శాంతిని బొందఁజాలఁడు. ౬

దొరకినదానిని దృణీకరింపక స్వీకరించి తృప్తిఁజెంది అల్పుఁడుకాక పరిశుద్ధజీవనుఁడై ప్రవర్తించు భిక్షుకుని దేవతలు సైతముఁ గొనియాడుదురు? ౭

నామరూపములయందు 'ఇది నేను, ఇది నాయది' యను నభిమానము నెప్పుడు నుంచక నశించువానికొఱకు వ్యసనమును జెందకుండువాఁడెన్న భిక్షుకుఁడు! ౮

భూతకోటియెడ మైత్రి గలిగి బుద్ధానుశాసనమున దిట్టమైన భిక్షుకుఁడు ప్రశాంతకామాదిదోషమై సుఖదమై యొప్పు శాంతిపదమును జేసుకొనుచున్నాఁడు. ౯

ఓ భిక్షూ! ఈశరీరమనుపడవలో నిండిన విషయవికారములను నీటి నెగఁజల్లివేయుము. నీటిబరువుతగ్గినయెడల పది తేలికయై సంసారవాహినియందు వేగముగఁ బోవఁగలదు. రాగద్వేషములను రూపు మాపుదువేని నిర్వాణమును బొందెదవు. ౧౦

ఐదిటిని రూపుమాపుము. ఐదిటిని బరిత్యజింపుము. ఐదిటి నుత్తరింపుము. ఐదుసంగములనుండి విముక్తుఁడైన భిక్షుకుఁడన్నా (సంసార)వాహినిని దాఁటినవాఁడు. ౧౧

భిక్షుకుఁడా! ధ్యానముఁజేయుము. సోమరివి కాకుము. నీమనస్సును గామవికారములచేఁ గలఁతఁ జెందనీయకుము. అన్నా! ప్రమత్తుఁడవై నరకకూపమునఁ గూలి కాలుచున్న ఇనుపముద్దలను మ్రింగకుము! అట్లు మ్రింగుచు 'అయ్యో! ఓర్వజాల నీఘోరబాధ' నని యేడ్వకుము!

జ్ఞానహీనునికి ధ్యానము గుదురదు. ధ్యానహీనునికి జ్ఞానముగుదురదు. జ్ఞానధ్యానములుగలవాఁడన్నా నిర్వాణపదమునకుఁ జేరువనుండువాఁడు. ౧౩

శూన్యగృహమును బ్రవేశించినవాఁడు, ప్రశాంతచిత్తుఁడును, ధర్మతత్త్వమును జక్కఁగా నెఱిఁగినవాఁడు నగు భిక్షుకునకు నలౌకికానందము గలుగును. ౧౪

భూతముల ఉదయక్షయములను గుర్తెఱిఁగిన మనుజునివి సంతోషసౌఖ్యములు. వాని కవియే అమృతము.౧౫

ఈ లోకమున వివేకియగు భిక్షుకుని జీవయాత్రాప్రారంభమున కింద్రియనిగ్రహము, సంతుష్టి, ధర్మము ననుసరించిన నియమము, సాధువులు, అప్రమత్తులు సచ్చరిత్రులు నగు మిత్రులతో సహవాసము ననునవి ముఖ్యములు.

స్నేహభావము గలవాఁడవుకమ్ము. ధర్మమార్గము ననుసరించి నడచుకొనుము. అంత నానందాతిశయమునొందినవాఁడవై దుఃఖముల నంతము నొందింపఁగలవు. ౧౬

మల్లెతీగె వాడువాఱిన పూవులను రాల్చునట్లు భిక్షుకులారా! రాగద్వేషములను బరిత్యజింపుఁడు. ౧౭

ప్రశాంతవాఙ్మనఃకాయుఁడై, సమాధినిష్ఠుఁడై, ప్రాపంచిక విషయములనెల్లఁ బరిత్యజించినభిక్షువుగదోయీ శాంతుఁడనఁదగినవాఁడు. ౧౮

నిన్ను నీవే పురికొల్పుకొనుము. నిన్ను నీవే పరీక్షించి చూచుకొనుము. ఇట్లు అప్రమత్తుఁడవై, సురక్షితుఁడవై యుండుము. నీవు సుఖముగఁ గాలమును గడపఁగలవు. ౨౦

నీకు నీవే ప్రభువవు. నీకు నీవే ఆశ్రయుఁడవు. కావున రౌతు ఉద్రేకించిన గుఱ్ఱమును వశపఱచుకొనునట్లు నిన్ను నీవు వశపఱచుకొనుమన్నా ! ౨౧

భిక్షుకుఁ డధికానందము ననుభవించుచు బౌద్ధధర్మాచరణపరాయణుఁడై విషయవికారదూరమును, సుఖసంధాయకమును, ప్రశాంతమును నగు నిర్వాణపదమును జేరుకొనుచున్నాఁడు." ౨౨

బౌద్ధధర్మములను బూర్ణవిశ్వాసముతో నాచరించు భిక్షుకుఁడు పిన్నవాఁడయ్యును మబ్బుమఱుఁగునుండి వెలువడిన చంద్రునివలె నీలోకమును ప్రకాశవంతముగఁ జేయుచున్నాఁడు." ౨౩

## బ్రాహ్మణవగ్గో ఛబ్బీసతిమో

ఛిన్ద సోతం పరక్కమ్మ కామే పనుద బ్రాహ్మణ,
సఙ్ఖారానం ఖయం ఞత్వా అకతఞ్ఞూఽసి బ్రాహ్మణ. ౧

యదా ద్వయేసు ధమ్మేసు పారగూ హోతి బ్రాహ్మణో,
అథఽస్స సబ్బే సంయోగా అత్థం గచ్ఛన్తి జానతో. ౨

యస్స పారం అపారం వా పారాపారం నవిజ్జతి,
వీతద్దరం విసంయుత్తం తమహం బ్రూమి బ్రాహ్మణం. ౩

ఝాయిం విరజ మాసీనం కతకిచ్చం అనాసవం,
ఉత్తమత్థం అనుప్పత్తం తమహం బ్రూమి బ్రాహ్మణం. ౪

దివా తపతి ఆదిచ్చో రత్తిం ఆభాతి చన్దిమా,
సన్నద్ధో ఖత్తియో తపతి ఝాయీ తపతి బ్రాహ్మణో;
అథ సబ్బ మహోరత్తం బుద్ధో తపతి తేజసా. ౫

బాహితపాపోఽతి బ్రాహ్మణో
సమచరియా సమణోఽతి వుచ్చతి,

పబ్బాజయ మత్తనో మలం
తస్మా పబ్బజితోఽతి వుచ్చతి. ౬

నబ్రాహ్మణస్స పహరేయ్య నాస్స ముఞ్చేథ బ్రాహ్మణో,
ధీ బ్రాహ్మణస్స హన్తారం తతో ధీ యస్స ముఞ్చతి. ౭

న బ్రాహ్మణ స్సేత దకిఞ్చి సేయ్యో
యదా నిసేధో మనసో పియేహి,
యతో యతో హింస మనో నివత్తతి
తతో తతో సమ్మతి మేవ దుక్ఖం. ౮

యస్స కాయేన వాచాయ మనసా నత్థి దుక్కటం,
సంవుతం తీహి ఠానేహి తమహం బ్రూమి బ్రాహ్మణం.౯

యమ్హా ధమ్మం విజానేయ్య సమ్మాసం బుద్ధదేసితం,
సక్కచ్చం తం నమస్సేయ్య అగ్గిహుత్తంఽవ బ్రాహ్మణో.

నజటాహి నగోత్తేన నజచ్చా హోతి బ్రాహ్మణో,
యమ్హి సచ్చంచ ధమ్మోచ సోసుచీ సోచ బ్రాహ్మణో.

కింతే జటాహి దుమ్మేధ కింతే అజిన సాటియా,
అబ్భంతరం తే గహనం బాహిరం పరిమజ్జసి. ౧౨

పంసు కూలధరం జన్తుం కిసం ధమనిసన్థతం,
ఏకం వనస్మిం ఝాయన్తం తమహం బ్రూమి బ్రాహ్మణం.

న చాహం బ్రాహ్మణం బ్రూమి యోనిజం మత్తిసంభవం,
భోవాదీ నామ సో హోతి సచే హోతి సకిఞ్చనో;
అకిఞ్చనం అనాదానం తమహం బ్రూమి బ్రాహ్మణం. ౧౪

సబ్బసంయోజనం ఛేత్వా యో వే న పరితస్సతి,
సంగాతిగం విసఞ్ఞుత్తం తమహం బ్రూమి బ్రాహ్మణం. ౧౫

ఛేత్వా నద్ధిం వరత్తంచ సన్దానం సహానుక్కమం,
ఉక్ఖిత్త పళిఘం బుద్ధం తమహం బ్రూమి బ్రాహ్మణం. ౧౬

అక్కోసం బద్ధ బన్ధంచ అదుట్ఠో యో తితిక్ఖతి,
ఖన్తీబలం బలానీకం తమహం బ్రూమి బ్రాహ్మణం. ౧౭

అక్కోధనం వతవన్తం సీలవన్తం అనుస్సదం,
దన్తం అన్తిమసారీరం తమహం బ్రూమి బ్రాహ్మణం. ౧౮

వారి పోక్ఖర పత్తేఽవ ఆరగ్గేరివ సాసపో,
యో నలిమ్పతి కామేసు తమహం బ్రూమి బ్రాహ్మణం. ౧౯

యోదుక్ఖస్స పజానాతి ఇధేవఖయ మత్తనో,
పన్నభారం విసఞ్ఞుత్తం తమహం బ్రూమి బ్రాహ్మణం. ౨౦

గంభీరపఞ్ఞం మేధావిం మగ్గామగ్గస్స కోవిదం;
ఉత్తమత్థం అనుప్పత్తం తమహం బ్రూమి బ్రాహ్మణం. ౨౧

అసంసట్ఠం గహట్ఠేహి అనాగారేహి చూభయం,
అనోకసారిం అప్పిచ్ఛం తమహం బ్రూమి బ్రాహ్మణం. ౨౨

నిధాయ దండం భూతేసు తసేసు థావరేసుచ,
యోనహన్తి నఘాతేతి తమహం బ్రూమి బ్రాహ్మణం. ౨౩

అవిరుద్ధం విరుద్ధేసు అత్తదణ్డేసు నిబ్బుతం,
సాదానేసు అనాదానం తమహం బ్రూమి బ్రాహ్మణం. ౨౪

యస్స రాగోచ దోసోచ మానో మక్ఖోచ పాతితో,
సాసపోరివ ఆరగ్గా తమహం బ్రూమి బ్రాహ్మణం. ౨౫

అకక్కసం విఞ్ఞాపనిం గిరం సచ్చం ఉదీరయే,
యాయ నాభిసజేకిఞ్చి తమహం బ్రూమి బ్రాహ్మణం. ౨౬

యోఽధదీఘం రస్సం వా అణుం థూలం సుభా సుభం,
లోకే అదిన్నం నాదియతి తమహం బ్రూమి బ్రాహ్మణం.

ఆసా యస్స న విజ్జన్తి అస్మిం లోకే పరమ్హి చ,
నిరాసయం విసఞ్ఞుత్తం తమహం బ్రూమి బ్రాహ్మణం. ౨౮

యస్సాలయా సవిజ్జన్తి అఞ్ఞాయ అకథం కథీ,
అమతోగధంఅనుప్పత్తంతమహంబ్రూమి బ్రాహ్మణం. ౨౯

యోఽధ పుఞ్ఞంచ పాపంచ ఉభో సఙ్గం ఉపచ్చగా,
అసోకం విరజం సుద్ధం తమహం బ్రూమి బ్రాహ్మణమ్. 3౦

చన్దంఽవ విమలం సుద్ధం విప్పసన్న మనావిలం,
నన్దీభవపరిక్ఖీణం తమహం బ్రూమి బ్రాహ్మణమ్. 3౧

యో ఇమం పళిపథం మగ్గం సంసారం మోహ మచ్చగా,
తిణ్ణో పారగతో ఝాయీ అనేజో అకథంకథీ;
అనుపాదాయ నిబ్బుతో తమహం బ్రూమి బ్రాహ్మణం. 3౨

యోఽధ కామే పహత్వాన అనాగారో పరిబ్బజే,
కామభవ పరిక్ఖీణం తమహం బ్రూహి బ్రాహ్మణం. 33

యోధతణ్హాం పహాత్వాన అనాగారో పరిబ్బజే,
తణ్హాభవపరిక్ఖీణం తమహం బ్రూమి బ్రాహ్మణం. ౩౪

హిత్వా మానుసకం యోగం దిబ్బం యోగం ఉపచ్చగా,
సబ్బయోగ విసఞ్ఞుత్తం తమహం బ్రూమి బ్రాహ్మణం. ౩౫

హిత్వా రతించ అరతించ సీతిభూతం నిరూపధిం,
సర్వలోకాభిభుం వీరం తమహం బ్రూమి బ్రాహ్మణం. ౩౬

చుతిం యో వేది సత్తానం ఉపపత్తించ సబ్బసో,
అసత్తం సుగతం బుద్ధం తమహం బ్రూమి బ్రాహ్మణం. ౩౭

యస్స గతిం న జానన్తి దేవా గన్ధబ్బమానుసా,
ఖీణాసవం అరహన్తం తమహం బ్రూమి బ్రాహ్మణం. ౩౮

యస్స పురేచ పచ్ఛాచ మజ్ఝేచ నత్థి కిఞ్చనం,
అకిఞ్చనం అనాదానం తమహం బ్రూమి బ్రాహ్మణం. ౩౯

ఉసభం పవరం వీరం మహేసిం విజితావినం,
అనేజం నహాతకం బుద్ధం తమహం బ్రూమి బ్రాహ్మణం. ౪౦

పుబ్బే నివాసం యో వేది సగ్గాపాయంచ పస్సతి,
అథో జాతిక్ఖయం పత్తో అభిఞ్ఞా వోసితో మునీ;
సబ్బ వోసిత వోసానం తమహం బ్రూమి బ్రాహ్మణం.౪౧

ఇతి బ్రాహ్మణవగ్గో ఛబ్బీసతిమో

ఇతి ధమ్మపదం నిట్ఠితం

యమకే వీసతీ గాథా, అప్పమాదమ్హి ద్వాదస,
ఏకాదసా చిత్తవగ్గే, పుప్ఫవగ్గమ్హి సోళస. ౧

బాలే సత్తరసా గాథా, పణ్డితమ్హి చతుద్దస,
అరహన్తే దసా గాథా, సహస్సే హోన్తి సోళస. ౨

తేరసా పుప్ఫవగ్గమ్హి, దణ్డమ్హి దససత్తచ,
ఏకాదసా జరావగ్గే అత్తవగ్గమ్హి ద్వాదస. 3

ద్వాదసా లోకవగ్గమ్హి, బుద్ధవగ్గమ్హి సోళస,
సుఖేనపియవగ్గేచ, గాథా యోహోన్తి ద్వాదస. ౪

చుద్దసా కోధవగ్గమ్హి మలవగ్గేకవీసతి,
సత్తరసాచ ధమ్మట్ఠే, మగ్గవగ్గమ్హి సోళస. ౫

పకిణ్ణే సోళసోగాథా, నిరయే నాగే చతుద్దస,

ద్వావీసా తణ్హావగ్గమ్హి, తేవీసా భిక్ఖువగ్గకా;
చత్తాలీసా చగాథాయో బ్రాహ్మణే వగ్గ ముత్తమే. ౬

గాథాసతాని చత్తారి తేవీసాచ పునాపరే,
ధమ్మపదే నిపాతమ్హి దేసితా దిచ్చ బన్ధునా. ౭

## ౨౬. బ్రాహ్మణవగ్గము

జటాధారి యగు విష్ణుమిత్రుఁ డను ముని కుమారుఁడు తండ్రియాజ్ఞననుసరించి యజ్ఞముకొఱకు సమిధలను గొనితెచ్చుటకు అడవికిఁ బోయెను. అచట నొకచో నాసీనుఁడైయున్న బౌద్ధభిక్షుని నొకనిని గాంచెను. యాజ్ఞికుఁ డగు తనతండ్రి—హరిమిత్రుఁడు—చెప్పఁగా విన్నది గూర్చి వినియుండెనే కాని బౌద్ధభిక్షుకుల నెన్నఁడును జూచియుండలేదు. విష్ణుమిత్రుఁడు భిక్షుకునిఁ గాంచి తన నాశ్చర్యముతో తలనున్నగా గొరిగించుకొనియున్నాఁడు; పచ్చనిబట్టను గట్టియున్నాఁడు. పరమశాంతమూర్తి; ఆతఁడెవఁ డగునో యని తనలోఁ దాను వితర్కించుకొనుచుండెను. భిక్షుకుఁడు ధ్యాననిమగ్నుఁడై యుండెను. విష్ణుమిత్రుఁడు భిక్షుకుని సర్వాంగకూర్పునే యోచించుచుండెను. తనతండ్రి ఆర్యావర్తము నలుమూలలు వ్యాపించిన కీర్తిగల

బుద్ధునిమహిమను గూర్చి చెప్పిన విషయమంతయు నొక
మాటాతనిమనమునకుఁ బొడగట్టగా నాతనిఁ బౌద్ధభిక్షు
కుఁ డని తెలిసికొనెను. ఇంతలో నాభిక్షుకుఁడు ధ్యానము
నుఁ జాలించి కనులు తెఱచి చెంతనున్న మునికుమారుని జూ
చెను. ఆతనివిలక్షణమగుమూర్తినిగని కడు ప్రసన్నుఁడై కొం
త సేపాతనితో నిష్టాలాపములు చేయుచుండెను. విష్ణుమిత్రుఁ
డు బుద్ధభగవానుని దర్శింపఁ గోరెను. నాఁ డాతఁ
డాశ్రమమునకుఁ బోయి తండ్రి యాజ్ఞనుగొని మహానామ
భిక్షుకునితోఁ గూడ బుద్ధాశ్రమమునకుఁ బోయెను. అప్పు
డు బుద్ధభగవానుఁడు అనాథపిండికవిహారమున నుండెను.
వారు మార్గాయాసముఁ దీర్చుకొనినపిదప ఉన్నతాసన
మునఁ బ్రసన్నవదనముతోఁ గూర్చుండి శ్రోతలకు ధర్మోప
దేశమును గావించుచున్న భగవానునిదర్శించి కృతప్రణా
ములై కూర్చుండిరి. అపుడు భగవానుఁ డుపదేశించిన
అమృతమయవాక్కు లివి :

"బ్రాహ్మణుఁడా! విషయవికారప్రవాహమును వీరుఁడవై
అడ్డగింపుము. కామములను గడఁగాఁ ద్రోయుము. ఉత్ప
త్తిగల వస్తువులన్నియు నశించునవియేయని తెలిసికొను
ము. అంత నీ వనుత్పన్నమగు నమృతపదమును దెలియఁ
గలవోయీ! ౧

ధ్యానసంయమములను రెండుధర్మములతత్త్వమును గుర్తెఱింగి జ్ఞానియైన బ్రాహ్మణునివగు సర్వబంధములు సడలిపోవును. ౨

పారాపారములు అను భేదమును వెలియక, నిర్భయుండును నిఖిలబంధవినిర్ముక్తుండునునగు పురుషశ్రేష్ఠుని నేను బ్రాహ్మణుఁడందును. ౩

ధ్యాని, దోషరహితుండు, కర్తవ్యపరాయణుండు, విషయవికారదూరుండు, ఉత్తముండు నగువానిని నేను బ్రాహ్మణుఁ డందును. ౪

సూర్యుండు పగలు ప్రకాశించును; చంద్రుండు రాత్రి ప్రకాశించును. రాజు కవచధారణమునఁ బ్రకాశించును; బ్రాహ్మణుండు ధ్యానమునఁ బ్రకాశించును; బుద్ధుండహోరాత్రములు గడు తేజస్వియై ప్రకాశించును. ౫

పాపములను బారఁద్రోలినవాఁడు బ్రాహ్మణుఁడు. శాంతి సమచిత్తుఁడగువాఁడు శ్రమణుఁడు. మాలిన్యమును మట్టుపెట్టినవాఁడు ప్రవ్రజితుఁడు (సన్న్యాసి.) ౬

బ్రాహ్మణునిఁ గొట్టరాదు. బ్రాహ్మణుఁడును దన్నుఁ గొట్టినవానిపైఁ గోపింపరాదు. ఛీ! బ్రాహ్మణహంతకుఁడు పరా

భవమును జెందును. వాని దూషించిన బ్రాహ్మణుఁ
డంతకంటె నధికముగఁ బరాభవమును జెందును. ౭

ప్రియవస్తువులనుండి మనస్సును మరల్చుకొనునేని
బ్రాహ్మణుఁ డధిక లాభమును జెందును. పరులను బాధ
లకుఁ బాల్పడఁ జేయకుండునేని తన బాధలు నుపశ
మిల్లును. ౮

మనోవాక్కాయములను త్రికరణములచేతఁ దుష్కర్మ
ముల నాచరింపక యా త్రికరణములను నిగ్రహించుకొనిన
వానిని నేను బ్రాహ్మణుఁ డనెదను. ౯

బుద్ధభగవానుఁ డనుగ్రహించిన సద్ధర్మములను లెస్సగ
నుపదేశింపఁగలవాఁడు, బ్రాహ్మణుఁ డగ్నిహోత్రము
నారాధించునట్టు లారాధింపఁ దగినవాఁడు. ౧౦

జడల(వేషము)చేతను, జాతిచేతను, జన్మముచేతను బ్రా
హ్మణుఁడు కానేరఁడు. సత్యధర్మములఁ దెలిసినవాఁడు,
పవిత్రుఁడునగువాఁడు గదన్నా బ్రాహ్మణుఁడు! ౧౧

జడుఁడా! జడలు దాల్చిననేమి? కృష్ణాజినము గట్టిననేమి?
వానివలనఁ ప్రయోజనము లేదోయీ! నీహృదయసీమను

దృష్ణయను కాఱడవి పెరుగుచుండ నీవు బాహ్యశుద్ధి
కొఱకుఁ బ్రాకులాడుచున్నావు. ౧౨

మలినవస్త్రములనుగట్టి, ప్రేవులప్రోవవలెఁ గృశమైన శరీ
రము గలవాఁడయి వనమున నేకాంతముగ ధ్యానము
చేయువానిని నేను బ్రాహ్మణుఁ డందును. ౧౩

జాతినిబట్టిగాని, తల్లినిబట్టిగాని మానవుని బ్రాహ్మణుఁడని
నేనను. వాఁడు ఉద్ధతుఁడును, ఐశ్వర్యవంతుఁడును నగుఁ
గాక! నిర్ధనుఁడు, వాంఛారహితుఁడు నగు వానిని నేను,
బ్రాహ్మణుఁ డందును. ౧౪

సర్వబంధనముల సడల్చుకొని నిర్భయుఁడై సంగముల నతి
క్రమించిన యాతని నేను బ్రాహ్మణుఁ డందును. ౧౫

క్రమముగఁ ద్రాటిని, దోలుపట్టను, గొలుసును ద్రెంచి
గడియమ్రాను తీసి ప్రబుద్ధుఁడై పరగిన వానిని నేను బ్రాహ్మ
ణుఁ డందును. ౧౬

తా నేతప్పిదము చేయకున్నను దన్నుఁ గూర్చిన తిట్లను,
కొట్లను, కట్లను ఓర్చుకొనువాఁడును, సహనమే రక్షక
సైన్యముగా గలవాఁడును నగు మనుజుని నేను బ్రాహ్మ
ణుఁ డందును. ౧౭

క్రోధము లేనివాఁడు, వ్రతశీలుఁడు, సచ్చరిత్రుఁడు, ఆశావి
హీనుఁడు, వశి, పునర్జననరహితశరీరధారి అగువాఁడు
బ్రాహ్మణుఁ డని నే నందును. ౧౮

తామరాకునందు నీటిబొట్టువలెను, సూదిమొనపై నావ
గింజవలెను, ఐహికసుఖంబులందగులని యుత్తమపురుషుని
నేను బ్రాహ్మణుఁ డందును. ౧౯

ఇహముననే దుఃఖములతుదను గనుఁగొన్నవాఁడును,
(కామ)భారమును గడకుఁద్రోసినవాఁడును,బంధవినిర్ముక్తుఁ
డును నగు మానవుని నేను బ్రాహ్మణుఁ డందును. ౨౦

జ్ఞాని, మేధావి, మంచిచెడ్డల మర్మమును దెలిసినవాఁడు
ఉత్తమోత్తమస్థానము నలంకరించినవాఁడు నగు మనుజుని
నేను బ్రాహ్మణుఁ డందును. ౨౧

గృహస్థులను, భిక్షుకులను సమానదృష్టితోఁ బరికించుచు,
నాయుభయులతోడను గలియక, ఇల్లిల్లు దిరిగి తిరిప మె
త్తక, అల్పము లభించినమాత్రముననే సంతుష్టి చెందువా
నిని నేను బ్రాహ్మణుఁ డందును. ౨౨

స్థావరములు జంగమములు నగు భూతములయెడ దండ
మును బ్రయోగింపక, తాను జీవహింస చేయక, ఒరులచేఁ
జేయింపక యుండువానిని నేను బ్రాహ్మణుఁడందును. ౨౩

విరోధులయెడ నవిరోధి, కోపనులయెడఁ బ్రసన్నుఁడు,
ఐహికవిషయాసక్తుల యెడ ననాసక్తుఁడు నగువానిని నేను
బ్రాహ్మణుఁ డందును. ౨౪

సూదిమొనపయి నావగింజ నిలువనట్లు రాగము, ద్వేష
ము, అభిమానము, మాత్సర్యము లెవనియందు నిలువ
వో వానిని నేను బ్రాహ్మణుఁ డందును. ౨౫

మధురముగను, హితముగను సత్యమును బలుకుచుఁ
బరుల కించుకయైన నవమతి గావింపనివానిని నే బ్రాహ్మ
ణుఁడందును. ౨౬

పొడవయినదిగాని కుఱుచైనదిగాని, అల్పముగాని అధిక
ముగాని, మంచిదిగాని చెడ్డదిగాని, ఏదియైనను దన
కొసఁగఁబడనిదానినిఁ గైకొనని యాతని నేను బ్రాహ్మణుఁ
డందును. ౨౭

ఇహపరలోక సుఖములను వేనినిఁ గోరక నిష్కాముఁడు
బంధవిముక్తుఁడునైనవానిని నేను బ్రాహ్మణుఁడందును. ౨౮

తృష్ణారహితుఁడు, సత్యమును గుర్తెఱిఁగి "ఎట్లు? ఎందుకు?" అను సంశయములకుఁ బాలుగాక నిర్వాణముయొక్క తత్త్వమును దెలిసినవానిని నేను బ్రాహ్మణుఁడందును. ౨౯

ఇహలోకమునఁ బుణ్యపాపములను, వానిసంబంధమును నతిక్రమించి శోకరహితుఁడు నిర్మలుఁడు నైయొప్పువానిని బ్రాహ్మణుఁ డందును. ౩౦

చంద్రునివలె నిర్మలుఁడు, శుద్ధుఁడు, సుప్రసన్నుఁడు, కళంకరహితుఁడు నయి సాంసారిక సుఖములలోఁ జిక్కుకుండువానిని నేను బ్రాహ్మణుఁ డందును. ౩౧

మోహపంకిలమగు దుర్గమసంసారమార్గమునఁ ద్రొక్కుట బడి సంసారసాగరపు టావలియొడ్డును జేరి ధ్యాననిష్ఠుఁడు, నిర్భయుఁడు, సంశయరహితుఁడు, సంతుష్టుఁడు, ప్రశాంతుఁడు నగు వానిని నేను బ్రాహ్మణుఁ డందును. ౩౨

ఆశలనడఁగార్చి, గృహమును బరిత్యజించి సన్న్యాసియై తిరుగుచుఁ గామప్రకోపమును గాల్చివైచి పుట్టువును మట్టుపెట్టినవానిని నేను బ్రాహ్మణుఁ డందును. 33

ఆశల నడఁగార్చి, గృహమును బరిత్యజించి సన్న్యాసియై తిరుగుచుఁ దృష్ణాప్రకోపమును క్రుంగించి పుట్టువును మట్టుపెట్టిన యాతని నేను బ్రాహ్మణుఁ డందును. 3౪

మానుషికములు, దైవికములు నగు సర్వబంధముల వలన విముక్తుఁ డగువానిని నేను బ్రాహ్మణుఁ డందును. 3౫

సుఖదుఃఖములను గల్పించువానిని బరిత్యజించి ప్రశాంతుఁడు జననమరణోపాధిరహితుఁడునై సర్వలోకములను వశీకరించు వీరశిఖామణిని నేను బ్రాహ్మణుఁ డందును. 3౬

ఎల్లప్రాణులయొక్క యుత్పత్తినాశములను గుర్తెఱిఁగి, దేనియందును దగుల్కొనక, సుగతుఁడు (సన్మార్గగామి), బుద్ధుఁడు (ప్రబుద్ధుఁడు) నగువానిని నేను బ్రాహ్మణుఁ డందును. 3౭

దేవగంధర్వ మానవులకు దుర్గ్రాహ్యమైన ప్రవర్తనముగలవాఁడు, విషయవికార విహీనుఁడు, అర్హతుఁడు నగు వానిని నేను బ్రాహ్మణుఁ డందును. 3౮

భూతభవిష్యద్వర్తమాన విషయములందు దాసక్తిలేక దరిద్రుఁడు, వాంఛాహీనుఁడు నై యొప్పువానిని నేను బ్రాహ్మణుఁ డందును. 3౯

పురుషశ్రేష్ఠుఁడు, ఉన్నతుఁడు, వీరుఁడు, మహర్షి, జయశీలుఁడు, కామరహితుఁడు, శుద్ధుఁడు, ప్రబుద్ధుఁడు నగు వానిని నేను బ్రాహ్మణుఁ డందును. ౪౦

పూర్వజన్మజ్ఞానము గలవాఁడు, స్వర్గనరకములను గుర్తెఱిఁగినవాఁడు, పునర్జన్మవిరహితుఁడు, సంపూర్ణజ్ఞానముచే నిర్వాణానందమునకుఁ జేరువ నున్నవాఁడు, ముని, సర్వ విషయములం సంపూర్ణుఁడు నగువానిని నేను బ్రాహ్మణుఁ డందును. ౪౧

## మంగళగీతము

జయము సత్యచతుష్టయజనక! బుద్ధ
జయము నీతినిధీ! సుధీ! శాంతమూర్తి
జయము నిర్వైరశీల! నిస్సంగభావ!
జయము లోకకుటుంబకా! జయము! జయము!

# అనుబంధము

## విశేషాంశములు

**యమునివర్గో పరమో**

ప్ర.-శ్లో. శ్లో: పేరా.

౧— ౫ 'సనాతనో'—'సనస్తనో' అనిపాఠాంతరము.

౩—౧౫, ౧౬ 'దృక్షా'—'దన్వా' అని పాఠాంతరము.

౫— ౧ "మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః." అను బ్రహ్మబిందూపనిషద్వాక్యాభిప్రాయమును జూచునది.

౭— ౮ ఏకేంద్రియుఁ డెవ్వానిని, పెనుబండలతో గట్టికొండను బ్రచండవాయువువలె మారుఁ డింపుఁడేని? జలింపఁజేయఁజాలఁ డనుట.

,, ౧౧ "యదా మనసి వైరాగ్యం జాతం సర్వేషు వస్తుషు, తదైవ సన్న్యసేద్విద్వాన్ అన్యథా పతితో భవేత్" అని యొకరు నుడివిరి.

పు.-శ్లో. లేక పేరా.

౭—౧౧, ౧౨ అనగా నిస్సారములగు ప్రాపంచికవిషయములు సత్యములు, శాశ్వతములు నని నమ్మి, సారవంతము, జ్యోతిర్మయము, నిర్వాణసుఖదాయకము నగు పరబ్రహ్మ మసత్యము, అశాశ్వతమునని పరిత్యజించి, జననమరణాది దుఃఖదూరుఁడు గాఁజాలక తుట్టతుదకు మనుజుఁడు మట్టిపాలగుచున్నాఁడు. కావున సత్యాసత్యములను గుర్తెఱిఁగి సత్యమార్గమునఁ బ్రవర్తించువాఁడు జననమరణాది దుఃఖదూరుఁడై శాశ్వతానందము నొందునని భావము.

౮—౨౦ 'భిక్షుపదము' అనగా 'ఆచార్యస్థాన' మనుట.

## అప్పమాదవగ్గో దుతియో

౯— ౧ 'మచ్చునోపదం' అని.

,, ౪ 'సూచికమ్మస్స'—'సుచికమ్మస్స' అని పా.

,, ౫ 'నాభికిరతి'—'నాభికీరతి' అని పా.

౧౦— ౮ 'మానుమ్యా'—'మానుయ్యా' అని పా.

౧౨— ౭ ఇట్లే "శ్రద్ధా భక్తి జ్ఞాన వైరాగ్యాదవేహి నకర్మణా న ప్రజయా ధనేన; త్యాగే నైకే అమృతత్వ మానశుః." అని కైవల్యోపనిషత్తునఁ గలదు.

| పు.-శ్లో. | టీక పేరా. |
|---|---|
| ౧౨— ౮ | బాలకుఁ డనఁగా మూర్ఖుఁడనుట. |
| ,, ౧౦ | "భక్తై రింద్రో భవే జ్జీవో బ్రహ్మాపుత్ర స్వభక్తినా" అని దేవీభాగవత (౯, ౨౭, ౧౪) మీ విషయము నీ యిట్లు వివరించినది. |
| ౧౩—౧౧ | "యథైధాంసి సమిద్ధోగ్ని ర్భస్మసా త్కురుతేఽర్జున, జ్ఞానాగ్ని స్సర్వ కర్మాణి భస్మసా త్కురుతే తథా" అను భగవద్గీతా (౪-౩౭) వచనమును బరిశీలింపుఁడు. |
| ౧౩—౧౨ | ఈ విషయము భగవద్గీత (౬-౨౧) యందిట్లున్నది. "సుఖ మాత్యంతికం యత్త ద్బుద్ధిగ్రాహ్య మతీంద్రియమ్, వేత్తి యత్ర న చైవాయం స్థిత శ్చలతి తత్త్వతః." |

చిత్తవర్గో తతీయో

| | |
|---|---|
| ౧౫—౧ | 'బత'—'వత' అని. |
| ౧౬—౧ | శ్రీ కృష్ణపరమాత్మ అర్జునునితో "అసంశయంమహాబాహో!మనోదుర్నిగ్రహం చలమ్; అభ్యాసేన తు కౌన్తేయ! వైరాగ్యేణ చ గృహ్యతే." (భగ. |

పు.-శ్లో. లేక పేరా.

౬,౩౫) అని చెప్పెను. ఇచటి భావమున కిది యెంతయుఁ బోలియున్నది.

## పుప్ఫవగ్గో చతుత్థో

| | |
|---|---|
| ౨౧—౧౫ | 'యత్థ'—'తత్థ' అని. |
| ౨౨— ౧ | ఇది ప్రశ్న. |
| ,, ౨ | ఇది పైప్రశ్నకు ఉత్తరము. స్వస్వరూపమును గుర్తెఱిఁగినవాఁడే సర్వలోకములను జయింపఁగలవాఁ డనుట. |
| ,, 3 | 'మారుఁడు'=మోహాది మనోవికారములను గలిగించు మన్మథుఁడు, మృతికారకుఁడునని రెండర్థములు. |
| ,, ౬ | 'నివసింప లేఁడు' ఇది తప్పు. 'నివసింపవలెను' అని ఉండవలెను. తేనెటీగవలెనే భిక్షుకుఁడును దాను జరించు గ్రామముల, నాయా గ్రామముల నివసించువారల సంపదలను, సౌఖ్యములను ఆసింపక, వారి కష్టబాధలను గలిగింపక కేవలము భిక్షాచరణము గావించుచు శరీరయాత్రను గడపుచుండవలయునని భావము. |

## బాలవగ్గో పంచమో

| | |
|---|---|
| ౨౬— ౫ | 'ఖిప్పం ధమ్మం'—'నసో ధమ్మం' అని ఉండవలెను. |

పు.-శ్లో. లేక పేరా.

౨౮— ౬ 'నసో ధమ్మం'—'ఖిప్పం ధమ్మం' అని ఉండవలెను.

,, ౧౫ 'వడత్థి'—'వడ్ఢతి' అని ఉండవలెను.

౨౯— ౩ 'మోహం జహి మహామృత్యుం, దేహ దార సుతాదిషు; యం జిత్వా మునయో యాంతి తద్విష్ణోః పరమం పదమ్' వివేక చూడామణి (౮౫ శ్లో.) యందలి పైశ్లోకముయొక్క భావమును జూడుఁడు.

౩౨—౧౪ "ద్రవ్యార్థ మన్నవస్త్రార్థం యః ప్రతిష్ఠార్థ మేవచ; సన్న్యసే దుభయభ్రష్ట స్సముక్తిం నాప్నుమర్హతి" అను మైత్రేయోపనిషద్వాక్యము నిచట విచారింపఁ దగును.

,, ౧౫ అనఁగా అట్టిమూర్ఖుఁ డహంకారి యగుననుట.

పండితవగ్గో ఛట్ఠో

౩౮— ౯ 'న ఇచ్ఛే'—'న ఇచ్ఛేయ్య' అని పా.

౩౯—౧౦ 'సంసారసాగరపు టిద్దరి' యనఁగా నాసముద్రపు టీవలి తీరమునకుఁ జేరువ ననుట. అట్టివా రెన్నటికి నావలిదరిని జేరఁజాలరు.

పు.-శ్లో. లేక పే.రా.

౩౮—౧౧ యమలోకమును గూడ దాటిపోవుచున్నా రనఁగా మృత్యువును సైతము జయించి నిర్వాణపదమునఁ గుదురుకొందురని భావము.

౩౮—౧౨ 'కణ్హం ధమ్మం'=కృష్ణధర్మ (కాయదుశ్చరిత)మనగా దుష్కార్యాచరణము. 'సుక్కం ధమ్మం'=శుక్లధర్మ (కాయసుచరిత) మనఁగా సత్కార్యాచరణము.

౩౯—౧౨, ౧౩ 'సంసారసుఖములను బాపుకొని......బరిత్యజించి' అనుటకు మారుగా 'సంసారసుఖములను బాపుకొని గృహాదులను బరిత్యజించి' అని చదువుకొనునది. పంచవిధక్లేశము లనఁగా: కామము, క్రోధము, అవివేకము, అహంకారము, గర్వము అనునవి.

౩౯—౧౪ 'సంబోధితత్త్వములు' ఏడు:

౧. సతి (జ్ఞప్తి)

౨. ధమ్మవిచయ (జ్ఞానవిచారము)

౩. వీరియ (వీర్యము)

౪. పీతి (ప్రీతి)

౫. పస్సద్ధి (ప్రశాంతి)

౬. సమాధి

౭. ఉపేక్ఖా (ఉపేక్ష) అనునవి).

పు.-శ్లో. లేక పేరా.

అరహన్తవగ్గో సత్తమో

౮౨—౧ ఈలోకయాత్రను ముగించుకొన్నవా రనఁగా జీవన్ముక్తు లనుట.

సహస్సవగ్గో అట్ఠమో

౮౯— ౬ 'దేవ గంధర్వ దానవులు,మారుఁడుగూడ'నని.

౫౦—౧౦ 'అభివాదన శీలస్య, నిత్యం వృద్ధోప జీవినః,చత్వారి తస్య వర్ధంతే ఆయుః ప్రజ్ఞా యశో బలమ్' అని మనుస్మృతి యందుఁ గలదు.

౫౧—౧౮ వృద్ధిక్షయములయంతర మనఁగాఁ బ్రపంచము యొక్క ఉత్పత్తిలయములనుట. వానిఁగూర్చి అనగా వానిని దెలిసి యనుట.

పాపవగ్గో నవమో

౫౩— ౬, ౭ 'మావమఞ్ఞేథ'—'మాప్పమఞ్ఞేథ' అని పా.

౫౮—౧౩ 'నప్పసహదే'—'నప్పసహధే'అని పా.

౫౫— రెండవపేరా నాల్గవశ్లోకముయొక్క భావము. మూడవపేరా మూఁడవ శ్లోకముయొక్క భావము అని తెలియునది.

దండవగ్గో దసమో

౫౯— ౮ 'బుజ్ఝతి'—'వుజ్ఝతి' అని.

పు.-శ్లో. లేక పేరా.

౫౯—౧౧ 'జాతీన'—'జాతీనం' అని.

౬౦—౧౩ 'నిగ్గచరియా'—'నగ్గచరియా' అని.
'కజ్ఝం'—'కక్కుం' అని.

,, ౧౪ 'అలజ్కుత్తో'—'అలజ్కుత్తో' అని.

౬౨— ౪ 'పరలోక సహాయార్థం, సర్వభూతా న్యపీడయన్' అని మనుస్మృతి (౪-౨౩౮)

౬౩—౧౩ ఇట్టిభావమునే "జటిలో ముండీ లుఞ్చిత కేశః కాషాయాంబర బహుకృత వేషః; పశ్యన్నపి చ నపశ్యతి మూఢో హ్యుదరనిమిత్తంబహుకృతవేషః" అను ద్వాదశమంజరికాస్తోత్రమునఁ గనుఁడు.

## జరావగ్గో ఏకాదసమో

౬౬— ౯ 'చిత'—'చిత్తం' అని పా.

౬౭— ౧ వెలుఁగు అనగా నజ్ఞానాంధకారవినాశక మగు సుజ్ఞానప్రకాశ మనుట.

౬౭— ౨ వివేకచూడామణి (౧౬౪ శ్లో.) యందుఁ గల యిట్టిభావమునే చూడుఁడు: "అత్రాత్మ శుద్ధిం త్యజ మూఢబుద్ధే, త్వమజ్ఞాంసం సమేదో ఽస్థి పురీషరాశౌ;"

పు.-శ్లో. లేక పేరా.

## అత్తవగ్గో ద్వాదసమో

౭౦— ౨ 'పటిరూపే'—'పతిరూపే' అని పా.

౭౨— ౧ దశాత్రయము అనగా జాగ్రత్స్వప్నసుషుప్తి దశలు. ఒక్కదానియందైన ననఁగా జాగ్రదవస్థయందైన ననుట.

,, ౩ ఎన్ని విధములఁ జూచినను దన్నుఁ దా జయించి వశము చేసికొనుట అసాధ్యమని భావము.

,, ౪ 'ఉద్ధరే దాత్మ నాత్మానం నాత్మాన మవసాదయేత్, ఆత్మైవ హ్యాత్మనో బంధు రాత్మైవ రిపు రాత్మనః' అను గీతాభిప్రాయము నిచట విచారించునది.

,, ౫ ఇతరరత్నముల ననఁగా నితర వజ్రముల ననుట.

౭౩— ౬ శత్రువులు కోరెడు దుర్దశకు మనుజునిఁ దెచ్చి పెట్టునని భావము.

,, ౮ 'ఫలంవే కదలిం హన్తి ఫలం వేలుం ఫలం నలం, సక్కారో కాపురిసం హన్తి గబ్భో అస్సతరిం యథా.' అను శ్లోకమును జూడుఁడు.

౭౪— ౯ 'ఏకః ప్రజాయతే జంతు రేక ఏవ ప్రలీయతే, ఏకోఽనుభుంక్తే సుకృతం

పు.-శ్లో. లేక పేరా.

| | |
|---|---|
| | ఏక ఏవచ దుష్కృతమ్' అని మను స్మృతి (౪-౨౪౦) నుడువుచున్నది. |

లోకవగ్గో తేరసమో

| | |
|---|---|
| ౭౬— ౯ | 'సవాహినిం'—'సవాహనం' అని పా. |
| ౭౮— ౪ | 'అవిద్యాతం శరీరాది దృశ్యం బుద్బుద వత్ క్షరమ్.' ఆత్మబోధ (౩౧-శ్లో.) దీని యభిప్రాయము ఇట సరిపోవుచున్నది. |
| ౭౯— ౯ | మృత్యువును అనఁగా మృత్యువును, మారునిఁ గూడ నని తెలియునది. |
| ,, ౧౧ | 'దాని ప్రభావము...' అను వాక్యమునకుఁ బర్యాప్తి, తరువాతి పేరాలోని 'అది బుద్ధిమంతుని సొమ్ము......జేరి సుఖించును.' అను వాక్యములను జేర్చుకొనునది. |
| ౭౯—౧౨ | స్రోతాపన్నుఁడు. బౌద్ధభిక్షువు నిర్వాణమును బొందుటకుఁ బూర్వము నాలుగుదశలను బొందు చున్నాఁడు. ఆదశలు: ౧. సోతాపన్న, ౨. సకదాగామి, ౩. అనాగామీ, ౪. అరహాత అనునవి. |
| | ౧. సోతాపన్న (స్రోతాపన్నుఁడు): జనన మరణ ప్రవాహమునఁబడియున్న వాఁడు. అతఁ డా ప్రవాహము నుత్తరించి నిర్వాణమును |

పు.—క్లో. లేక పేరా.

గాంచుటకుఁ బూర్వ మేడు జన్మములఁ బొం
దును.

౨. సకదాగామీ (సకృదాగామి): ఇతఁ
డు మానవులయందుఁ గాని దేవతలయందుఁ
గాని నిర్వాణము నధిగమించుటకుఁ బూర్వ
మొక్కమారు జన్మించును.

3. అనాగామీ (అనాగామి): ఇతఁ డీక
వెనుకకు మరలి జనన మరణ ప్రవాహమునఁ
గూలఁడు గాని నిర్వాణమును బొందుటకుఁ
బూర్వ ముత్తమ బ్రాహ్మణ (బ్రహ్మవేత్త)
జన్మమును మాత్రము గాంచును.

౪. అరహాత (అర్హాతుఁడు) ఇతఁడు సర్వో
త్తమస్థానము నధిగమించినవాఁడు. నిర్వాణ
పదమునకుఁ గడుఁ జేరువ నున్నవాఁడు. అనఁ
గా నీతఁడే నిర్వాణపదము నధిష్ఠించి యనం
తానందమును గాంచఁగలిగినవాఁ డనుట.

బుద్ధవగ్గో చతుద్దసమో

౮౧— ౭ 'బుద్ధాన'—'బుద్ధానం' అని పా.

౮.౨—౧3 'చట్టాంగికం'—'చట్టంగికం' అని పా.

,, ౧౭ 'సమతిక్కన్తో'—'సమతిక్కన్తే' అని.

పు.-శ్లో. లేక పేరా.

౮౪— ౫ ఇది చాల ముఖ్యమైనది. ఇందే బౌద్ధధర్మ తత్త్వమంతయు నిమిడియున్నది. శీల సమాధి ప్రజ్ఞలు మూఁడును బౌద్ధులు పాటించవలసిన ప్రధానధర్మములు. శీలము = పాపకర్మములను గావింపకుండుట. సమాధి=పుణ్యకర్మములఁ బొనరించుట. ప్రజ్ఞ= మనోనైర్మల్యముఁ గ ?గియుండుట.

౮౪— ౭ మనుస్మృతి(౬-౪౯) చూపుఁడు: "అధ్యాత్మరతి రాసీనో నిరపేక్షో నిరామిషః; ఆత్మనైవ సహాయేన సుఖార్థీ విచరే దిహ."

౮౫— ౮ "యచ్చ కామసుఖం లోకే యచ్చ దివ్యం మహత్సుఖమ్, తృష్ణాక్షయ సుఖస్యైతే నార్హత షోడశీం కలామ్." (మహాభారత-శాంతిపర్వము).ఇచ్చట పైశ్లోక భావమునకుఁ బోలిక గలదు.

౮౫—౧౦ "అంతస్థ మాత్మాన మజం నదృష్ట్వా భ్రమంతి మూఢా గిరిగహ్వరేషు" అని జ్ఞానవాసిష్ఠమును,"తీర్థే దానే తపో యజ్ఞే కాష్ఠే పాషాణకే సదా, శివం పశ్యతి మూఢాత్మా......" అని సూత సంహితయు వాకొనుచున్నవి.

పు.-శ్లో. లేక పేరా.

౮౫—౧౨, ౧౩ 'బుద్ధ, ధర్మ, సంఘ'ములు మూఁడును 'బౌద్ధరత్నత్రయ'మనఁబడును. బౌద్ధులు
"బుద్ధం శరణం గచ్ఛామి,
ధర్మం శరణం గచ్ఛామి,
సంఘం శరణం గచ్ఛామి"
అని యుచ్చరించుచు బుద్ధ ధర్మ సంఘములను శరణు సొచ్చెదరు. దీనినే 'శరణత్రయ'

ఆర్యాష్టాంగమార్గములు ౮:

౧. సమ్మాదిట్ఠి=సమ్యగ్దృష్టి.
౨. సమ్మాసంకప్ప=సమ్యక్సంకల్పము.
౩. సమ్మావాచా=సమ్యగ్వాక్కు.
౪. సమ్మాకమ్మంత=సమ్యక్కర్మము.
౫. సమ్మాఆజీవ=సమ్యగాజీవము.
౬. సమ్మావాయామ = సమ్యగ్వ్యాయామము (ఉద్యోగము).
౭. సమ్మాసత్తి=సమ్యగ్విచారము.
౮. సమ్మాసమాధి=సమ్యక్సమాధి.

ఈయెనిమిదిటికిని యమనియమాసనాద్యష్టాంగములకును పోలిక చూపట్టుచున్నది.

పు.-శ్లో. ౪౪ పేరా.

ఆర్యసత్యములు ౪:

౧. దుక్ఖము=దుఃఖము. ఈ ప్రపంచము దుఃఖమయము.

౨. దుక్ఖసముదయ = దుఃఖసముదయము: దుఃఖకారణము. అట్టిదుఃఖమునకుఁ గారణము జాతి జరా మరణాదులు.

3. దుక్ఖనిరోధ = దుఃఖ నిరోధము: దుఃఖనాశనము. అట్టి దుఃఖోత్పాదకములను నశింపఁజేయవలయును.

౪. దుక్ఖనిరోధగామినీపటిపదా=దుఃఖనిరోధగామినీప్రతిపదము: దుఃఖనాశనోపాయము. దుఃఖదాయకము లగువానిని మూలముట్టుగ నశింపఁజేయుటకు బుద్ధోపదిష్టమగు ఆర్యాష్టాంగమార్గము గలదు. దానిని ద్రొక్కి నడచినవారెల్ల దుఃఖాదులు నశించి నిర్వాణపదమును జేరుకొనఁగలరు.

౮౬—౧౮ "జ్ఞానిభ్యో క్రియతే యత్తు తత్కోటి గుణితం భవేత్" అను శివగీతా వాక్యము నందు భావమే యిట విచారింపఁబడినది.

సుఖవగ్గో పణ్ణరసమో

౮౭— ౬ 'ఖన్ధా'=స్కన్ధములు; ఇవి అయిదు:

౧. రూప (రూపము)

పు.-శ్లో. టీక పేరా.

౨. వేదనా (వేదన)

౩. సఞ్ఞా (సంజ్ఞా)

౪. సంఖార (సంస్కార)

౫. విఞ్ఞాన (విజ్ఞానము)

ఈ యైదును ప్రతిశరీరమునకును ముఖ్యపదార్థములు.

౮౯— ౪ మహాభారత (శాంతిపర్వము) మున నిట్లున్నది; చూడుడు: "సుసుఖం బత జీవామి యస్య మే నాస్తి కించన; మిథిలాయాం ప్రదీప్తాయాం న మే దహ్యతి కించన."

౯౦— ౯ ముముక్షువులు వారనుష్ఠించవలసిన ధర్మములను వివేకచూడామణి (౫౪౦ శ్లో) యిట్లు చెప్పుచున్నది: "చింతాశూన్య మదైన్య భైక్ష్య మశనం పానం సరిద్వారిషు, స్వాతంత్ర్యేణ నిరంకుశస్థితి రభీ ర్నిద్రా శ్మశానే వనే; వస్త్రం క్షాలన శోషణాదిరహితం దిగ్వాస్తు శయ్యా మహీ, సంచారో నిగమాంతవీథిషు విదాం క్రీడా పరే బ్రహ్మణి."

పు.-శ్లో. లేక పేరా.

౯౧—౧౨ "ఉత్తమై రుత్తమై ర్నిత్యం సంబంధా నాచరేత్సహ" అని మనుస్మృతి (౪-౨౪౪) యందుఁ గలదు.

## పియవగ్గో సోళసమో

౯౨— ౧ 'యుఞ్ఞ'—'యుఞ్జ' అని పా.

౯౬—౧౦ ఊర్ధ్వస్రోతః అనఁగా రాగద్వేషాదులం దగుల్కొనక నిర్వాణప్రవాహమున కెదురీదు వాఁడు. ఊర్ధ్వరేతస్కుఁడు.

## కోధవగ్గో సత్తరసమో

౯౭— ౩ 'కదరియం'—'కదరియా' అని పా.
'అలికం'—'అలీకం' అని పా.

,, ౭ 'ఏత్తోపిహెత్తోపి'—'ఏతేపిహేతిపి' అని.

౯౮— ౨ అత్రుణం=నిస్తులమైనది అని కొందఱు. మూఁడుఁ దః: "మౌనా న్మూకః ప్రవచనపటు ర్వాతులో జల్పకో వా, ధృష్టః పార్శ్వే వసతి చ తదా దూరత శ్చాప్రగల్భః
.............................."

భర్తృహరి, నీతిశతకము.

పు.-శ్లో. ౭౯ పేరా. కాని యిట వ్యాఖ్యాకారుడు 'అతుల' అనఁగా బుద్ధశిష్యులలో నొకఁడగు 'అతులుని' సంబోధన మనెను.

౯౮—౧౦ 'మరవాసి'—'మరవాతి' అని పా.

౯౮—౧౧ 'కాయప్పకోపం'=కాయప్రకోపము; శరీరముచేఁ జేయఁబడు దుష్కార్యము లనుట. అవి అహింస, స్తేయము, జారత్వము మొదలైనవి.

౯౮—౧౨ 'వచీపకోపం'=వాక్ప్రకోపము; వాక్కుచేఁ జేయఁబడు దుష్కార్యము లనుట. మృషావాదము, పైశున్యభాషణము, పరుషవాక్యము మొదలయినవి.

౯౮—౧౩ 'మనోపకోపం' =మనః ప్రకోపము; చెడు [illegible] గలిగించు [illegible].

౯౯— ౧ "యా న సక్కారస్సావమానాస్సముద్రే,
అ[illegible] గి[illegible] నామరూపే విహాయ;
[illegible] మహాపాద్వముక్తం
[illegible] పు[illegible] మునైతి దివ్యమ్"
అను మంచి[illegible] ములను గాంచునది.

౯౯— ౨ "ఇంద్రియాణాం విచరతాం విషయే
ష్వపహారిషు; సంయమే యత్నమా
తిష్ఠే ద్విద్వా న్యంతేవ వాజినామ్."
మను. ౨-౮౮.
ఈ శ్లోకాభిప్రాయ మిచటఁ బోలియున్నది.

పు.-శ్లో. లేక పేరా.

౧౦౦_ ౩ 'లోభి' అనుటకు మారు 'లోభము' అని చదువుకొనునది.

౧౦౨_౧౪ త్రికరణములు = మనోవాక్కాయ కర్మములు.

మలవగ్గో అట్ఠారసమో

౧౦౩_ ౧ 'దాసిఽసి'—'దానిఽసి' అని.

,, ౩ 'వయోచ'—'వమోచ' అని పా.

,, ,, 'దాసిఽసి'—'దానిఽసి' అని.

౧౦౪_ ౫ 'మచ్ఛేరం'—'మచ్ఛరం' అని పా.

౧౦౫_ ౬ "యపషు మూఢా విషయేషు బద్ధా, రాగోరుపాశేన సుదుర్దమేన; ఆయాన్తి నిర్యాన్త్యథ ఊర్ధ్వముచ్చైస్స్వకర్మ దూతేన జనేన నీతాః" అను వివేకచూడామణి (౯౬) శ్లోకమును బరికింపుడు.

౧౦౬_౧౨,౧౩ హింస, అసత్యము, అదత్తాదానము, పరదారగమనము, సురాపానము అను నీయైదు దుష్కర్మములను బరిత్యజించుట 'పంచశీలము' లనఁబడును. బౌద్ధులు వీనినే 'పంచశిక్షాపదము' లను పేర ననుదినమును జపించెదరు.

౧. పాణాతిపాతా వేరమణీ సిక్ఖాపదం సమాదియామి.

పు.-శ్లో. రేక పేరా.

౨. అదిన్నాదానా వేరమనీ సిక్ఖాపదం సమాదియామి.

౩. కామేసు మిచ్ఛాచారా వేరమనీ సిక్ఖాపదం సమాదియామి.

౪. ముసావాదా వేరమనీ సిక్ఖాపదం సమాదియామి.

౫. సురామేరయ మజ్జప్పమాదట్ఠానా వేరమనీ సిక్ఖాపదంసమాదియామి.

ఇవి గృహపంచశిక్షాపదములు.

౧౧౦—౧౮ "రాజన్! సర్షపమాత్రాణి పరచ్ఛిద్రాణి పశ్యసి, ఆత్మనో బిల్వమాత్రాణి పశ్యన్నపి నపశ్యసి" అనునది భారతమున ధృతరాష్ట్రునితో విదురుఁడు చెప్పెడు వాక్యము. ఇందలి యభిప్రాయమే యిట వివరింపఁబడినది.

౧౧౧—౨౦,౨౧ ఆకసమునఁ బక్షిపాద మెట్లు గుర్తింప రాదో అట్లే బాహ్యవేషాడంబరములుగలవారి యందు నిజమైన భిక్షుకుని గుర్తించుట సాధ్యము. ఈతత్త్వమును దెలియక మూఢులై జను లైహికాడంబరముల యందుఁ దగిలి ముక్తులు కాఁజాలకుందురు. తథాగతులు (బుద్ధులు) తత్త్వవేత్తలు. వారు బాహ్యాడంబరముల యందుఁ దగుల్కొనరు. వారు నిర్వాణ

పు.—శ్లో. లేక పేరా.

పదము నధిగమించి శాశ్వతానందము ననుభ
వింతురందురు.

ధమ్మట్ఠవగ్గో ఏకూనవీసతిమో

౧౧౨— ౫  'మేఘజిణ్ణో'—'మోఘజిణ్ణో' అని.

౧౧౬— ౬  "ధనవృద్ధా వయోవృద్ధా విద్యా
వృద్ధా స్తథైవచ, తే సర్వే జ్ఞానవృద్ధ
స్య కింకరా శ్శిష్య కింకరాః" అని
మైత్రేయోపనిషత్తు.

౧౧౬,౧౧౭— ౯,౧౦,౧౧  "ద్రవ్యార్థ మన్నవస్త్రార్థం యః ప్రతి
ష్ఠార్థ మేవచ; సన్న్యసే దుభయ
భ్రష్టస్స ముక్తిం నాప్తు మర్హతి"
ఇందలి భావమిది కొంత సరిపోవుచున్నది.
'పరమహంసపరివ్రాజకోపనిషత్తు.'

౧౧౮—౧౬,౧౭  "వదన్తు శాస్త్రాణి యజన్తు దేవాన్
కుర్వన్తు కర్మాణి భజన్తు దేవతాః;
ఆత్మైక్యబోధేన వినాఽపి ముక్తి ర్నసి
ధ్యతి బ్రహ్మశతాంతరే ఽపి." అను
వివేకచూడామణి శ్లోకాభిప్రాయమున కీపదం
బోల్చఁగలదు.

పు.-శ్లో. శేష పేరా.

మగ్గవగ్గో వీసతిమో

౧౯-౩ 'సల్లకత్తనమ్'—'సల్లసత్థనమ్' అని పా.

" ౬ 'ఖన్తా'—'సఞ్ఞారా' అని

౧౨౦-౮ 'ఉపత్తో'—'ఉపేత్తో' అని పా.

'సంసత్త'—'సంసన్న' అని పా.

" ౧౦ 'భూరి'—'భూరీ' అని పా.

౧౨౨-౧౫ 'మచ్చు'—'మచ్చ' అని పా.

౧౨౨-౧ చూపుఁ గన్నులుగలవాఁడనఁగా జ్ఞాననేత్రము గలవాఁడనుట.

౧౨౩-౪ చూడుఁడు: "తస్మాత్సర్వప్రయత్నేన భవబంధవిముక్తయేః స్వైరేవ యత్నః కర్తవ్యో రోగాదావివ పండితైః."

(వివేకచూడామణి, శ్లో. ౬౫.)

౧౨౬-౧౬ గోవింద ద్వాదశమంజరికాస్తోత్రము నందలి యీ క్రింది శ్లోకమును బరిశీలింపుఁడు: "భజ గోవిందం భజ గోవిందం భజగోవిందం మూఢమతేఃసంప్రాప్తే సన్నిహితే కాలే నహి నహి రక్షతి డుకృఞ్ కరణే."

పకిణ్ణకవగ్గో ఏకవీసతిమో

౧౨౭-౬ వేయ్యగ్ఘ=వ్యాఘ్రముభూయిష్ఠమైభయంకరమైన మార్గము. నీవరణము (శాద్ధమతాచరణ

పు.-శ్లో. లేక పేరా.

(ప్రతిబంధకము) లైదు గలవు. అవి: ౧. కామచ్ఛందనీవరణము (కామము), ౨. వ్యాపాదనీవరణము (ద్రోహచింత), ౩. తీనమిద్ధా (స్త్యానమిద్ధ) నీవరణము (సోమరితనము, మాంద్యము), ౪. ఉద్ధచ్చ. కుక్కుచ్చ (ఔద్ధత్యకౌకృత్య) నీవరణము (గర్వము, చెడునడక), ౫. విచికిచ్ఛా (విచికిత్సా) నీవరణము (సంశయము) అనునవి. వానిలో నైదవది యగు 'విచికిచ్ఛానీవరణము' వ్యాఘ్రయుక్తమైన మార్గమువలె నత్యంతభయానకమైనది. కావున నిది 'వేయ్యాఘ్రపంచమ' మనఁబడియె. జ్ఞాని దానినిఁ బరిత్యజింపవలె ననుట.

౧.౫౦—౭,౮,౯ 'సతి' (స్మృతి) = 'అనుస్సతి' (అనుస్మృతి)యు అనఁబడును. ఇవి పది:

౧. బుద్ధానుస్సతి=బుద్ధానుస్మృతి

౨. ధమ్మానుస్సతి=ధర్మానుస్మృతి

౩. సంఘానుస్సతి=సంఘానుస్మృతి

౪. సీలానుస్సతి=శీలానుస్మృతి

౫. చాగానుస్సతి=త్యాగానుస్మృతి

౬. దేవతానుస్సతి=దేవతానుస్మృతి

పు.-శ్లో. లేక పేరా.

౭. మరణానుసతి=మరణానుస్మృతి

౮. కాయగతాసతి = కాయగతాను స్మృతి

౯. ఆనాపానస్సతి = ఆనాపానస్మృతి (ఉచ్ఛ్వాస నిశ్వాసములు)

౧౦. ఉపసమానుస్సతి = ఉపశమాను స్మృతి

ఈపదియును కలువది 'కమ్మట్ఠాన' (కర్మస్థాన) ములలోనివి. ఈ 'కమ్మట్ఠాన'ములను గూర్చి 'విసుద్ధిమగ్గ' మున:

తత్థ ఇమాని చత్తాలీసా (౪౦) కమ్మట్ఠానాని:

దశ కసిణా=పదికృత్స్న (కర్మస్థానములు)

దశ అసుభా = పది అశుభ ,,

దశ అనుస్సతియో=పది అనుస్మృతి ,,

చత్తారో బ్రహ్మవిహారా= ౪ బ్రహ్మవిహార (కర్మస్థానములు)

చత్తారో ఆరూప్పా=౪ అరూప్య ,,

ఏకా సఞ్ఞా=౧ సంజ్ఞా ,,

ఏకం వవత్థానం=౧ వ్యవస్థాన ,,

అని కలదు.

పు.-శ్లో. లేక పేరా.

పైపడి అనుస్సృతులలో ముఖ్యముగా బుద్ధ, ధమ్మ, సంఘముల నొక్కొక్కదానిని బౌద్ధభిక్షువులు నిరంతరము నీ క్రిందివిధమున ధ్యానముచేయుచుండవలెను.

౧. బుద్ధానుస్సతి — ఇతి ఒపి సో భగవా అరహం సమ్మాసంబుద్ధో విజ్జాచరణసంపన్నో సుగతో లోకవిదూ అనుత్తరో పురిసదమ్మసారథీ సత్థా దేవమనుస్సానం బుద్ధో భగవాఽతి తస్స గుణా అనుస్సరితబ్బా.

౨. ధమ్మానుస్సతి—స్వాక్ఖాతో భగవతో ధమ్మో సందిట్ఠికో అకాలికో ఏహిపస్సికో ఓపనేయ్యికో పచ్చత్తంవేదితబ్బో విఞ్ఞూహీఽతి ఏవం పరియత్తిధమ్మస్స చేవ నవవిధస్సచ లోకుత్తరధమ్మస్స గుణా అనుస్సరితబ్బా.

3. సంఘానుస్సతి — సుప్పటిపన్నో భగవతో సావకసంఘో, ఉజుపటిపన్నో భగవతో సావకసంఘో, ఞాయపటిపన్నో భగ

ఘ.-శ్లో. లేక పేరా.

వతో సావకసంఘో, సమీచి పటిపన్నో భగవతో సావక సంఘో, యదిదం చత్తారి పురి సయుగాని అట్ఠ, పురిసపుగ్గలా ఏస భగవతో సావకసంఘో ఆహునేయ్యో పాహునేయ్యో, దక్ఖిణేయ్యో అఞ్జలీకరణీయో అనుత్తరం పుఞ్ఞక్ఖేత్తం లోకస్సా ఉతి సంఘస్సగుణా అనుస్సరిత బ్బా-" విసుద్ధిమగ్గో. భా. ౯

౧౨౮—౧౩ 'దుక్ఖానుపతితో'—'నచదుక్ఖానుపతితో' అని పా.

౧౩౦— ౧ అల్పసుఖమును గలిగించు నైహికసుఖముల యందు, మనస్సును సంలగ్నీయక శాశ్వతా నందము నొసగునట్టి నవృత్తిపథమును బొందు టకు విశేషియముగా ప్రయత్నింప వలయును.

" ౨ మనుస్మృతి యందు విషయమునే యిట్లు వివ రించుచున్నారు. మనువు: "యో౽హింస కాని భూతాని హినస్త్యాత్మ సుఖేచ్ఛ యా; సజీవశ్చ మృతశ్చైవ న క్వచి త్సుఖ మేధతే. (౫-౪౫)

పు.-శ్లో. లేక పేరా.

౧౩౧-౨, ౬ 'దండ్రులను'-తప్పు. 'తల్లిదండ్రులను'-ఒప్పు

తల్లి=తృష్ణ; తండ్రి=అహంకారము; బ్రాహ్మణుఁడు, ఇద్దరు రాజులు=ప్రపంచము నిత్యము అనిత్యము అను భిన్నమతములు. రాజ్యము=చక్షు, శ్రోత్ర, ఘ్రాణ, జిహ్వా, కాయ, మానసంబులను నింద్రియములు, రూప, శబ్ద, గంధ, రస, స్పర్శ, ధర్మములను నింద్రియ ధర్మములు అను ద్వాదశాయతనములు; ప్రజలు=ఇంద్రియసంగములు, వీనిని నశింపఁజేసిన వానికి వందనము చేసు. అనఁగాఁ బాహ్యపాప ఫలము లంటనివానికి చేరనుట. ఇది యీగాథ వ్యాఖ్యాతి కావించిన విధానము.

"సత్ప్రజ్ఞుఁడగు మహానీయుఁడు నెట్టి దుష్కార్యముల నాచరించినను దండార్హుఁడు కాఁడు. వానిని బాహ్యపాపము లంటఁజాలవు" అని కొందఱు.

పురాణములు, స్మృతి, ఇరువదియొక్కమారు క్షత్రియవీరులను జంపిన పరశురాముఁడు సప్తసంతానముగ బ్రాహ్మణోత్తముఁ డని వాకొనుచున్నవి. బౌద్ధ సిద్ధాంతము నంగీకరింపక నిరసించుచు నీస్మృతి వశిష్ఠులకు పనవసరమైనను." అని నుడికొండఱు.

"బుద్ధునికాలమునఁ గర్మకాండయు, సాంఘిక జీవితము బ్రాహ్మణుల హస్తగతములై యుం

డెడివి. ఎట్టివారికైనను స్వర్గనరకములయందు
స్థానముఁ గల్పించుటకును, అల్పాధికదండము
లను విధించుటకును సమర్థులు బ్రాహ్మణులే
యను నిర్ణయార్థ మిందుండెడిది. వారుమాత్ర
మెట్టి ఘోరకృత్యమును గావించినను దండా
ర్హులు గారట. సంఘముయొక్క యిట్టి
హీనావస్థను బుద్ధుఁడు సహింపఁజాలక యిట్లు
చెప్పెను." అని యింకఁగొంపలు.

సారిపుత్త్రుఁడు చెప్పిన యీ రెండుశ్లోకముల
యర్థము విని అశ్వఘోషుఁడు నాశ్చర్యచకి
తుఁడయ్యె. అది గ్రహించి సారిపుత్త్రుఁడు చిఱు
నవ్వు నవ్వుచు నాతనితో "మీ కీవిషయ మా
శ్చర్యమును గలిగించుట వింతకాదు. నేనును
నా బుద్ధభగవానుని దివ్యవాణినుండి యీ విషయ
మును విని మీవలెనే విస్మయమును జెందితిని.
అంత వారు బ్రాహ్మణులను జంపు మొదలుగాఁ
గల ఘోరకృత్యముల నాచరించినను బ్రాహ్మ
ణులు దండార్హులుగా రను పురాణాదిగ్రంథ
ములను, వారిహింసాపూరితములైన యాగాది
కర్మములను, వారియు స్మృత్యాదిధర్మశాస్త్ర
ముల నుద్దేశించి యిట్లు తిరస్కారపూర్వక
ముగా నుడివి, పిదప బ్రాహ్మణుల యథార్థ
మైన కర్మకాండతత్త్వమును వివరింపఁగా
నా యాశ్చర్యము పటాపంచలయ్యె" ననెను.
ఈ మాటలను విని ఆసభనున్నవారు సంతుష్టు

పు.-శ్లో. తేక శేరా.

౧౨౭— ౭ 'దక్షా'—'దస్వా' అని.

,, ౯,౧౦ 'తసినాయ'—'తసిణాయ' అని పా.

,, ౧౧ 'తసినం'—'తసిణం' అని పా.

౧౫౩— ౬ ముప్పదియాఱు స్రోతస్సులు (ఇంద్రియ ప్రవాహములు). అవి: చక్షు (చక్షు), సోత (శ్రోత్ర), ఘాన (ఘ్రాణ), జివ్హా (జిహ్వా), కాయా, మన, అను నాభ్యంతరము లాఱును; రూప, సద్ద (శబ్ద), గంధ, రస, ఫోట్ఠబ్బ (స్పర్శ), ధమ్మ (ధర్మ) అను బాహ్యము లాఱును కలసి పండ్రెండింద్రియములు. అవి, కామతృష్ణ, భవ (రూప) తృష్ణ, విభవ (అరూప) తృష్ణ లను మూఁడింటిభేదములచే ముప్పదియాఱు.

౧౫౫—౧౧ బ్రహ్మోపనిషత్తునం దీవిషయ మిట్లున్నది "ఏవ మాత్మాఽఽత్మని జాయతే ఽపా సత్యేన తపసా యోఽనుపశ్యతి; ఊర్ణ నాభి ర్యథా తంతూన్ సృజతే సంహ రత్యపి; జాగ్రత్స్వప్నే తథా జీవో గచ్ఛ త్యాగచ్ఛతే పునః."

సు.-శో. లేక పేరా.

౨. విచికిచ్ఛా=విచికిత్స.

౩. సీలబ్బతపరామాసో=శీలవ్రత పరామర్శ.

౪. కామరాగ=కామము.

౫. పటిఘు=ప్రతిఘ (ద్వేషము) అనునవి.

దీనికి 'ఓరంభాగియ (అవరభాగముకు జెందిన) సంయోజనము (బంధము)' అని పేరు. అనగా నరక లోకములయందు జన్మనునకు గురిచేయునవి యనుట.

పరిత్యజింపవలసినవి అయిదు:

౧. రూపరాగము

౨. అరూపరాగము

౩. మాన (గర్వము)

౪. ఉద్ధచ్చ (ఔద్ధత్యము)

౫. అవిజ్జా (అవిద్య)అనునవి.

వీనికి 'ఉద్ధంభాగియ (ఊర్ధ్వభాగమునకు చెందిన) సంయోజనము' అని పేరు. అనగా ఊర్ధ్వలోకములయందు జన్మనునకు గురిచేయునవి యనుట.

పు—శ్లో. లేక పేరా.

౧౯౯—౧౮ "అక్రోధనం"—"అక్రోధనం" అని.

" " "అనుస్సదం"—"అనుస్సతం" అని పా

౧౭౧—౨౭ "దీఘం"—"దీఘంవ" అని పా.

" ౩౨ "మగ్గం"—"దుగ్గ" అని.

" ౩౩ "బ్రూహి"—"బ్రూమి" అని.

౧౭౩—౬ "సాళసా"—"సాళసా" అని.

" " "చతుర్దస"—"చ చుద్దస" అని.

౧౭౭—౧౧ "న యోని ర్నాపి సంస్కారో న శ్రుతం నచ స న్తతిః; కారణాని ద్విజత్వస్య వృ త్తమేవతు కారణమ్." భా. వనప.

౧౯౫—౧౬ "త్రాటిని, లోలుపట్టను, గొలుసును" అనగా 'విద్వేషము, స్త్రీ వి త్త భోగాది తృష్ణ, మతాభి నివేశాది సంకుచితాభిప్రాయము లనుట. గడియ మ్రాను అనగా జ్ఞానకవాటము నడ్డువెట్టు నవివేకము.

౧౮౦—౨౩ స్థావరములు, జంగమములు—బలవంతములుదుర్బలములు నగు జీవజంతువులయెడనని కొందఱు.

౨— ౯ మహాభారతము - శాంతిపర్వము : "అనిష్కా షాయే కాషాయ మీహార్థ మితి విద్ధి తమ్; ధర్మధ్వజానాం ముణ్డానాం వృ త్త్యర్థ మితి మేమతిః" దీనిని బరి శీలింపుఁడు.

# త్రిపిటకములు

## వాని అంతర్భాగములు

తిపిటక—౧. వినయపిటక, ౨. సుత్తపిటక, ౩. అభిధమ్మపిటక.

౧. వినయపిటక—౧. సుత్తవిభంగ, ౨. ఖంధక, ౩. పరివార.

౧. సుత్తవిభంగ—౧. పారాజిక, ౨. పాచిత్తియ.

౨. ఖంధక—౧. మహావగ్గ, ౨. చుల్లవగ్గ.

౨. సుత్తపిటక—౧. దీఘనికాయ, ౨. మజ్ఝిమనికాయ, ౩. సంయుత్తనికాయ, ౪. అంగుత్తరనికాయ, ౫. ఖుద్దకనికాయ.

ఖుద్దకనికాయ—౧. ఖుద్దకపథ, ౨. ధమ్మపద, ౩. ఉదాన, ౪. ఇతివుత్తక, ౫. సుత్తనిపాత, ౬. విమానవత్థు, ౭. పేతవత్థు, ౮. థేరగాథా, ౯. థేరీగాథా, ౧౦. జాతక, ౧౧. నిద్దేస, ౧౨. పటిసంభిదా, ౧౩. అపాదాన, ౧౪. బుద్ధవంశ, ౧౫. చరియాపిటక.

౩. అభిధమ్మపిటక—౧. ధమ్మసంగణి, ౨. విభంగ, ౩. కథావత్థు, ౪. పుగ్గలపఞ్ఞత్తి, ౫. ధాతుకథా, ౬. యమక, ౭. పట్ఠాన.

# పీ ఠి క

పేజి. పంక్తి.

౭— ౮ శేర్పుట—'సేర్చుట' అని.

౧౫— ౬ ఆగమింద్ర—'అగామీంద్ర' అని.

౧౬—౨౦ జన్మము పవిత్ర—'జన్మ మపవిత్ర' అని.

౨౧— ౬ ఆరాళ—'అరాళ' అని.

౨౨—౧౪ నడిగింపు—'నడఁగింపు' అని.

౨౨—౧౬ ఆరాళ—'అరాళ' అని.

౨౬—౧౬ గార్య—'గ్రార్య' అని.

౨౯—౧౫ ఉపాసికభిక్షుకీ—'ఉపాసికోపాసకభిక్షుకీ' అని.

౩౯— ౧ స్త్యహింసా—'స్త్వహింసా' అని.

౪౦—౧౬ మహామునీనాం మతయశ్చ భిన్నాః—'నైకో మని ర్యస్య మతం ప్రమాణమ్' అని పా.

౪౩—౧౧ మతావలంబు—'మతావలంబిను' అని.